సమృద్ధ పరిమళము
సరియైన ధరతో




ప్రేమ్ - తాజాతనము నందించు సబ్బు.

"గులాబి మ[illegible] [illegible] రంగులలో లభించును'



జయలక్ష్మి
గుంటూరు వారి
తయారీ

Imageads-2107



ఈసారి మీ కుటుంబానికి
సన్‌ఫ్లవర్ రక్షణ కవచంతో
భద్రత నివ్వండి.




## సన్‌ఫ్లవర్ ఎకానమీ ప్యాక్.
## విడి వనస్పతి కంటే కొద్ది పైసల ఎక్కువ ధరకే శుద్ధమైనది.

మీ కుటుంబానికి అత్యంత సురక్షితమైనదీ, భద్రమైనదీ ఇవ్వండి: సన్‌ఫ్లవర్ బ్రాండ్ వనస్పతి. సన్‌ఫ్లవర్ రక్షణ కవచంతో ప్యాక్ చేయబడి, సీలు చేయబడినది, విటమిన్ ఎ,డి చేరిన పరిశుద్ధమైన పుష్టికరమైన వనస్పతిని మీ కందించే నిమిత్తం ఇలా చేయబడింది.




**సన్‌ఫ్లవర్** బ్రాండ్ వనస్పతి

మంచి నెయ్యి మాత్రమే దీన్ని మించగలది.

1కిలో, ½కిలో ప్యాక్‌లలో లభ్యం

WIPRO LTD – Closer to the consum

WPL-220

స్థాపకుడు
వి. వి. రాఘవయ్య



మేనేజింగ్ ఎడిటర్-
లీలావతి రాఘవయ్య

సంపుటి 23 ఏప్రిల్-86 సంచిక 3

## కథలు



## సీరియల్స్



## ఫీచర్స్



## ఈ నెల నవలానుబంధంలో



ఈ నెల ముఖచిత్రం : నళిని

జ్యోతి పి. బి. నెం. 1824. హైదరాబాదు-20. ఫోన్-61180

రాధిక ముఖ చిత్రముతో వెలువడిన "మార్చి" నెల "జ్యోతి" లో ఫిల్మోత్సవ్-88 ప్రత్యేక అధ్యాయంలో "యుమే-చియో" జపాన్ చిత్రం కథను ప్రచురించినందుకు చాలా థాంక్స్ ఇదే విధంగా నెలనెలా రెండు మూడు చిత్రాల కథలను పాఠకులకు అందిస్తారని మనవి

"రాక్షసుడు," హైజాక్ సీరియల్స్ ప్రతినెలా ఎంతో ఆసక్తి పరుస్తూ ముందుకు పరుగెడుతున్నవి ఫీచర్స్ లో కంప్యూటర్ టీజింగ్ ఆసక్తికరంగా ఉంది నవలాను బంధంలో "సంధి" చాలా బాగుంది వచ్చేనెల నవలానుబంధం కోసం చూస్తుంటాము

*సిరి కొండ వెంకటేశం*
*లోయర్ మానేరు డ్యాం*

ఇకముందైనా ఆరుద్ర గళ్ళనుడి కట్టు ప్రచురింపబడిన పేజీకి రెండవ వైపున ఏదైనా ఎడ్వర్టైజ్‌మెంట్ ప్రచురింపబడేలా చూడండి ఉదాహరణకి మార్చి 88 జ్యోతి సంచికలో "ఆరుద్రగళ్ళనుడికట్టుకి" రెండవవైపున ఏమ్వీయల్ ఫోటోతో జ్యోతి ఫజిలు ప్రచురించారు ఈ పజిలు కాగితం చింపి పంపడం కారణంగా పాఠకులకు కలిగిన అసౌకర్యాన్ని గమనించారను కుంటాను

స్వర్గీయ ఎమ్వీయల్ జ్యోతి బాష్పాంజలితో మాకళ్ళు చెమర్చాయి

*వి వి సుబ్బారావు*
*గుంటూరు*

తినాలని పించేసేవ్వా
చదవాలని పించే మీజ్యోతి
రాధిక ముఖ చిత్రంతో
రమ్యాతి లోకాలను
రేకెత్తిస్తున్నది

*రిచ్ ంగిల్*
*బి. టి వి యస్*

పోలీసు డిపార్టుమెంటునించి లంచ గొండులను, తాగుబోతులను తొలగించేయటం అంటే గొంగడిలో తింటూ వెంట్రుకలు వెదకటం అన్నమాట

ప్రేమ విజయంలో రాసినట్టు సైకిలుకు లైటు లేకపోవటం డబుల్‌రైడింగ్ అపరాధంకాదు వెంగళరావు గారి హయామునుండి నిషేధము తొలగిపోయింది

*కె రామారావు*
*హైదరాబాదు*

మార్చి నెలజ్యోతి ముఖచిత్రం చాలా అందంగా వుంది "ప్రేమవిజయం" కథ కడుపుబ్బ నవ్వించింది రచయితకు మా ధన్యవాదాలు "పోలీస్‌ఓల్ ఏస్తోంది పారిపోండి" చదువుతుంటే హాస్యంతో పాటు

Edited & Published by V Leelavathy Raghaviah at 1 8 519/11 Chikkdadpally Hyd 20 & Printed by P Ramakrishna at Raghava Printers, 1 8-4/1/1 Chikkdadpalli, Hyderabad 20

# ఉత్తరాలు

ఆ బిల్ అంటే భయంకూడా ఏర్పడింది.

**యస్. బడేఖాని**
**పిడుగురాళ్ళ**

మార్చి 86 జ్యోతిపై నటి రాధిక ముఖచిత్రం చాలా ఆకర్షణీయంగాఉంది. 'హైజాక్' సీరియల్ చాలా ఆసక్తిదాయకంగావుంది. ఈ సంచికలోని కథలు చాలా బాగున్నాయి.

**వి.వి.జె.బి. నరసింహాచార్యులు**
**అనపర్తి**

కె.వి.వి. సత్యనారాయణరాజుగారి 'మచ్చుకో మహానుభావుడు' కథ చాలా బావుంది. రచయితలు రాసిందిచెయ్యరు చేసింది రాయరు. అన్న నగ్నసత్యాన్ని చాలా చక్కగా వివరించారు.

**ఎస్. హెచ్. ఎస్. సాగర్**
**తెనాలి**

'రాధిక' ముఖచిత్రంతో వెలువడిన మార్చి 86 సంచికలో శ్రీధర్ల బాపు మూర్తిగారి 'ప్రేమవిజయం' కథ హాస్యపుజల్లు కురిపిస్తూ ఆద్యంతం రసవత్తరంగా నడిచింది. ఈ కథను రచయిత ప్రత్యేకించి 'యర్రంశెట్టి శాయి' గారికి అంకిత మీయడం సముచితంగా వుంది.

కొన్ని చోట్ల కొటేషన్ మార్క్స్ పడని కారణంగా ఇబ్బంది కలిగింది.

**పాటిబండి చక్రరావు**
**విశాఖపట్నం**

మైనంపాటి భాస్కర్ గారి సీరియల్ హైజాక్ చదువుతుండే సస్పెన్స్‌తో ఊపిరి సలపనివ్వనంతెదు ఎంత సస్పెన్స్ సీరియల్ అందిస్తున్నందుకు కృతజ్ఞతలు.

**పానకాలు**
**గుంటూరు**

యర్రంశెట్టిశాయిగారి హాస్యామరావళి -38 "పోలీస్‌బిల్ వస్తోంది పారిపోండి" చదివిన తరువాత-ఆయన హాస్యానికి నవ్వు వచ్చినా-అందులో వున్న నిజాలకు దడపుట్టింది. ఎంత భయంకరమైన విషయాన్నయినాహాస్యభరితంగా చెప్పడంలో శ్రీ శాయిగారు సిద్ధహస్తులు - అని ఈ శీర్షిక నిరూపించింది.

చరిత్రను జోడించి సహజ వాతావరణంలో రాస్తున్న రాబందుల రెక్కల చప్పుడు సీరియల్‌కూడా క్రొత్తతరహాలో చాలా చక్కగా వుంది.

హాస్యానికి ప్రాధాన్యతనిచ్చి తన దైనబాణీని నిల్పుకొంటున్న 'జ్యోతికి' శాయిగారి రచనలు తైలంలాపని చేస్తున్నాయి.

**బండారు లక్ష్మి**
**ధవళేశ్వరం**

ప్రతినెల అత్యంత అందంగా ముస్తాబవుతూ వెలువడుతున్న జ్యోతి మార్చి నెలది చూసేను. అందులో పి. సత్యవతిగారి డామిట్ కథచాలా బాగుంది. సీరియల్‌లో శ్రీ యర్రంశెట్టి శాయిగారి రాబందుల రెక్కల చప్పుడు చాలాకొత్తతరహాలోవుండి మా హృదయాల్ని ఆకట్టుకున్నది.

**ఎల్. వి. నారాయణ**
**వాగల్లు**



# హ్యూమరాలజీ-39

ముందు హైద్రాబాద్ తరువాత -

విజయవాడ-పోలీసులతో పేచీపడ్డాక కాలనీ వాళ్ళందరం కలసి ఒక మీటింగ్ ఏర్పాటుచేసి ఇకనుంచీ ఎవ్వరం రాజకీయాలజోలికీ, పోలీస్‌లతో పేచీవచ్చేవ్యవహారాలజోలికీపోకూడదని నిర్ణయించుకున్నాం.

"నేనొప్పుకోను !" అంటూ ఎదురు తిరిగాడు శాయిరామ్ "మనం వాటి జోలికి వెళ్ళకపోయినా అవే మన కాలనీ లైఫ్‌లోకి జొరబడుతూంటే మనమేం చేస్తాం ? గాజులుతొడుక్కొని కూర్చుంటామా ?" అన్నాడు ఆవేశంగా

"కూర్చొపోతే జైలుకి పోతారా! లేదా మనవాళ్ళందరినీ శ్రీకాకుళం ప్రాంతానికి బదిలీలుచేసి పారేస్తారు. అది కాకపోతే రోడ్లు విశాలంచేసే స్కీమ్స్‌లో మన కాలనీ కూల్చిపారేస్తారు" అంటూ బెదిరించాడు గోపాల్రావ్

ఇళ్ళకూల్చడం అనగానే శాయిరామ్ భయపడిపోయాడు హైద్రాబాద్‌లో ఇళ్ళు దొరకటం ఎంత కష్టమో, ఇళ్ళ అద్దెలు ఎంతభయంకరంగా ఉన్నాయో-ఆమధ్య వాళ్ళబంధువులకోసం ఇల్లు వెదికినప్పుడు అనుభవమయింది మా అందరికీ !

"సరే-మీరుచెప్పిందే కరెక్ట్" అన్నాడు రాజీకొస్తూ.

అదే అవకాశమని నేను మరోక్లాజ్ కూడా అప్పుడే ప్రవేశపెట్టాను

"కొన్ని వారాలవరకూ కాలనీ మీటింగ్‌లుకూడా ఉంటానికి వీల్లేదు" అన్నాను శాయిరామ్‌వంక చూస్తూ

శాయిరామ్ బాధతో విలవిలలాడిపోయాడు.

"అదేమిటి ? మీటింగ్‌లు ఎందుకు పెట్టకూడదు!" అన్నాడు ఉక్రోషంగా

"నువ్వుపెట్టే మీటింగ్‌లవల్లే గొడవలు జరుగుతున్నాయ్-" అని సపోర్ట్‌కోసం

**యర్రంశెట్టి శాయి**

మిగతావారివేపు చూశాను.

"అవ్ ! నో మీటింగ్స్" అన్నాడు నివిన్ పాల్.

"అవును! ప్రస్తుతం మీటింగ్ వొద్దు!" అన్నారు రాజేశ్వరి, పార్వతీదేవిలు

దాంతో శాయిరామ్ ఇంక మాట్లాడ లేకపోయాడు.

ఆరోజు రాత్రి చాలాహాయిగా, ప్రశాంతంగా నిద్రపోయారు కాలనీలోవాళ్ళందరూ. ఉదయం ఎనిమిది గంటలయినా దయింది.

భయంగా లేచి కూర్చుని టైమ్‌పీస్ వైపు చూశాను రాత్రి పన్నెండవుతోందప్పుడే !

ఇంత రాత్రివేళ ఎవరు పిలుస్తున్నారో అర్థంకాలేదు

లేచి తలుపు తీయవోయేసరికి మా శ్రీమతి కూడా లేచికూర్చుని "వద్దు ! తీయకండి?" అంది గాబరాగా.

"ఎందుకని?"

# సెప్టెంబర్‌లో

చాలామంది నిద్రపోతూనే వున్నారు నిజంగా ఆ ఒక్కరోజు కాలనీచరిత్రలో "స్వర్ణయుగం" అని నిస్సందేహంగా చెప్పవచ్చు.

నామటుకు నేను అంత మంచినిద్ర అంత ఎక్కువసేపు కాలనీలోకొచ్చాక ఏనాడూ అనుభవించలేదు

రెండోరోజుకూడా ఆ తీయనినిద్రలో మునిగితేలుతూంటే-తలుపుకొట్టిన చప్పు

"వచ్చింది దొంగలేమో-తలుపుతీశాక తీరా మీకేమయినా అయితే - నా సంగతేమిటి? అందుకే మీ ఇన్స్యూరెన్స్ [illegible] కొంచెం పెంచమని మొత్తుకుంటుంటే [illegible] పించుకోరు-" అంది గొణుగుతూ

దానికి నా మీదకంటె నా ఇన్సూరెన్స్ పాలసీ మీద ప్రేమ ఎక్కువవటం [illegible] నాకు వళ్ళుమండి పోయిందిగానీ

కావాల్సొదాని తప్పుకాదు కాలనీలో ఆడా

ళ్ళందరూ ఈమధ్య మగాళ్ళను ఉద్యో గస్తుల మొత్తం పెంచమని గొడవ చేస్తూనే ఉన్నారు. ఆరోజుల్లో దొంగలు మా కాలనీ బయట ఉన్న ఓ దాబా ఇంట తెగనిదం పిన దగ్గర్నుంచి వాళ్ళకి ఆలోచన కలి గింది అతనికి పోలీస్ ఉద్యోగమున్నా మొత్తం అవటంవల్ల అతని కుటుంబం చాలా అవ స్థలు పడటం గమనించారుట!

"ఎవరు!" అంటూ అరచాను తలుపు దగ్గర నిలిపెట్టి.

"ఎవరా! ఏవరేమిషి గురూ! నేనే జనా ర్దన్ని..." అంటూ జనార్ధన్ గొంతు విని పించాక ధైర్యంగా తలుపు తెరచాను.

గ్రాంధీవాసన గుప్పుమంటూ జోర బడింది లోపలకు.

"ఏమిటింత రాత్రప్పుడు వచ్చావ్?" అడిగాను ఆశ్చర్యంగా.

జనార్ధన్ కంటి వెంబడి కన్నీళ్ల రాలి పోయినయ్ "గురూ! నన్ను ష...ష... మించుగురూ." అంటూ నా చేతులుపట్టు కున్నాడు.

నా కతనిమాటలు అర్థం కా లే ధు "ఏమిటి? నేనేంచేయాలి?"

"నన్ను షమించాలి గురూ! ముందు 'ష' అను!" అన్నాడు కన్నీళ్ళు తుడిచేసు కుని "ష" అన్నాన్నేను.

"మిం —"

"మిం —"

"చ —"

"చ —"

"ష మిం చ —"

"ష.. మించు "

"అది-అదే గురూ! నన్ను షమించా నని చెప్పు!"

"ఎందుకు? నువ్వేం చేశావని!"

జనార్ధన్ గుండెలు కొట్టుకోసాగాయి "అమ్మో-అమ్మో-ఏం చేషానేమిషి గురూ- ద్రోహం షేశాను.

షారీ! దోహం కాదు తో ...తో — ద్రోహం-ద్రోహం షేషాను గురూ! నీకు తీరని ద్రోహంషేశాను-

ఏం చేశావ్?"

"ముందు షమించానను-ష...మిం... చా అను గురూ"

మా ఆవిడకు జనార్ధన్ గొడవ అర్థం అయినట్లు లేదు. "ఏమిటలా ఏడుస్తున్నా డు? వాళ్ళావిడకేమయినా సీరియస్‌గా ఉందా?"

"ష్" అన్నాన్నేను "అదేంకాదు ? మందు కొట్టేసి వచ్చాడు-"

మా ఆవిడ అర్థంచేసుకుంది "అ... మంతే-"

తాగి ఉన్నాడితో వాదన అనవసరం అన్నవిషయం మాకు పోలీస్ డిపార్ట్ మెంట్‌ద్వారా బాగా అనుభవమయింది. అంచేత రాజీ కొచ్చేయడానికి ప్రయత్నిం చాను.

"సరే! బదరూ! షమించాన్లే - ఇంక ఇంటికెళ్ళిపో-" అన్నాను నా నిద్రపాడయి పోతున్న విషయం గుర్తుకొచ్చి

"నో—" గట్టిగా అరచాడు జనార్ధన్ "నేనొప్పుకోను!"

ఆ అరుపుకి మా పిల్లలూ, పక్కింటి వాళ్ళూ లేచివచ్చి నిలబడ్డారక్కడ

"ఎందుకని ఒప్పుకోవు? ఆశ్చర్యంగా అడిగాను

"నేనేం దో-దో-ద్రోహం షేషానో

లేకుండా నన్నెలా క్షమిస్తావ్! అలా
తెలీకే క్షమించేయటం నా కిష్టం లేదు-
క్షమించేవాడెప్పుడూ రీజన్ తెల్సుకోవాలి!"

సరే-నా కేం ద్రోహం చేశావో చెప్ప
త్వరగా!

సైన్ టీన్ ఎయిషీటులో సిగిరెట్
ఫామిన్ వచ్చింది గుర్తుందా?

"అవును - సిగిరెట్ ఫామిన్! అంటే
సిగిరెట్ కరువు - అప్పుడప్పుడూ మన
దేశంలో సిగిరెట్ కరువు రాదూ?

"వస్తుంది - వస్తుంది - వస్తుంది!"

"ఆ! ఆ సిగిరెట్ ఫామిన్ సైన్టీన్
ఎయిటీ ఫోర్లో వచ్చినప్పుడు-నువ్ నన్ను
కోటీ ఇన్స్టాప్‌లో సిగిరెట్ అడిగావు
గుర్తుందా?

"అడిగానేమో - నాకు గుర్తులేదు-"

"గుర్తు లేకపోతే గుర్తు తెచ్చుకోవాలి!"

"సరే అడిగాను!
అప్పుడు నేనేం చెప్పాను?"

"ఏమోగుర్తులే..."

"నో! గుర్తు తెచ్చుకోవాలి!"

"సిగిరెట్ ఇచ్చావ్-"

"అబద్దం! నేనివ్వలేదు-"

"ఆ గుర్తుకొచ్చింది - ఇవ్వలేదు!"
అన్నాను అబద్ధమాడేస్తూ.

"ఇవ్వకుండా ఏంచెప్పాను?"

"సిగిరెట్లు లేవని చెప్పి ఉంటావ్-"

"చెప్పి ఉంటావ్ కాదహ! అదే
చెప్పాను!"

అవును! అదేచెప్పావ్-"

హఠాత్తుగా జనార్ధన్ కిందకూర్చుని
నెత్తినరెండు చేతులూ పెట్టుకుని ఏడ్చేయ
సాడు.

"అక్కడే నీకు ద్రో-ద్రో-ద్రోహం
చేశాను గురువా! నా జేబులో
అప్పుడు రెండు సిగిరెట్లు ఉన్నాయ్ -
అయినా లేవని అబద్ధం చెప్పాను-"

"అదా-ఏంపర్లేదులే! అందులో పెద్ద
ఇదే ముంది? నవ్వేస్తూ అన్నానుపైకి
కానీ లోలోపల అలా అబద్ధం చెప్పినం
దుకు షాక్కుమండిపోయింది

జనార్థన్ కోపంగా లేచినిలబడ్డాడు

"అలా మాట్లాడకు గురువా! ఏం
పర్లేదులే అంటావేమిటి? అది ద్రోహం
కదూ!"

"అవును ద్రోహమే—"

'అయితే చెప్పు-ఆరోజు నేను చేసి
నో ద్రో - ద్రో - ద్రోహానికి క్షమించానని
చెప్పు—'

"సరే క్షమించాను!"

"నువ్ క్షమిస్తే సరిపోయిందేమిటి?
మా వదినమ్మ క్షమించొద్దూ?"

మాఆవిడ ఉలిక్కిపడింది.

"నువ్కూడా క్షమించానని చెప్పెయ్యో
వే! గొడవెందుకు?" అన్నాను మా
ఆవిడతో.

"నేనూ క్షమించానండీ!" అందామె.
అబ్బ! ఈ మగసన్నాసులు తాగితే ఇంత
సాధుజంతువులుగాకూడా మారే అవకాశం
ఉందన్నమాట" అంది నాతో రహస్యంగా

జనార్థన్ మావెనుకనిలబడ్డ పిల్లలవేపు
చూశాడు.

"మరి వాళ్ళు క్షమించొద్దూ?"

"వాళ్ళుకూడా క్షమించార్లే!" అన్నా
న్నేను.

"ఏదీ వాళ్ళు మాట్లాడరేం?"

"రాత్రుళ్ళు వాళ్ళు మాట్లాడరు—"

జనార్థన్ వాళ్ళదగ్గరకెళ్ళి కింద
కూర్చున్నాడు.

"పీపీ" అన్నాడు వాళ్ళ బుగ్గలమీద చిటికెవేస్తూ.

వాళ్ళు భయంగా మావేపు చూశారు "లీలీ"...వాళ్ళు రెండడుగులు వెనక్కు వేశారు.

"క్రీక్రీ" అన్నాడు మళ్ళీ — నేను కల్పించుకోకపోతే ఆ కార్యక్రమం తెల్లారే వరకూ సాగేట్లు కనిపించింది.

"ఇంక ఇంటికెళ్ళు-టైమ్ ఒంటిగంట పుతోంది" అన్నాను విసుగ్గా.

జనార్ధన్ లేచినిలబడ్డాడు. వెనక్కు తిరిగి రెండడుగులు వేసి మళ్ళీ తిరిగి వచ్చాడు

మరి రంగారెడ్డిమాటేమిటి ? అతడు క్షమించొద్దూ ?" అడిరిపడ్డాను.

' అదేమిటి ? రంగారెడ్డెందుకు క్షమించటం ?

అతిక్కూడా తో-ద్రోహంచేశాను. అటుకూడా క్షమిస్తేగానీ వెళ్ళను—" అన్నాడు మళ్ళీ కూర్చుంటూ. చేసేదిలేక నేనే వెళ్ళి రంగారెడ్డిని నిద్రలేపుకొచ్చాను

రంగారెడ్డిని చూస్తూనే ఢభాల్‌మని అతనికాళ్ళమీద పడిపోయాడు జనార్ధన్.

నీకు ద్రోహంచేశాను గురూ—దో—తో-హం —ద్రోహం—ద్రోహం !"

"నా 1౦ క్షేయలేకుకే- పద-మీ ఇంటికెళ్దాం !"

హఠాత్తుగా గట్టిగా ఏడవటం మొదలుపెట్టాడతను. దాంతో అందరిళ్ళల్లో టపటప లైట్లు వెలిగిపోయినయ్. ఆ తరువాత ఒకరొక్కరేవచ్చి మూగిపోయారక్కడ. మరి కాసేపట్లో పెద్దలూ, పిల్లలూ అంతా కిటకిటలాడిపోయారు.

"నేను నీకు ద్రోహంచేశాను గురూ! నీకు తెలీదది-"

"ఏమిటది ?"

"నాలుగేళ్ళక్రితం రేడియోలో జనరంజనిలో శ్రోతలుకోరిన రికార్డులో - ఒక బూతుపాట కోరి-అది కోరినవారు రంగారెడ్డి నిర్భయ్‌నగర్‌కాలనీ అని నేనే రాసేశాను."

"నువ్వా ఆ పని చేసింది?" కోపంగా అన్నాడు రెడ్డి.

"అవునుగురూ! నేనే-నేను టి వి.లో వేషంకోసం ఆ ప్రొడ్యూసర్‌ని బార్‌కి తీసుకెళ్ళటానికి రెండొందలు అప్పు అడిగితే లేదన్నాడని కోపంవచ్చి ఆ పని చేశాను—"

"అందరం - రెడ్డిని బతిమాలాము" ముందు వాడిని క్షమించేసెయ్ - లేపోతే ఎవ్వరికీ నిద్రఉండదు-"

"సరే - క్షమించాను". అన్నాడు రెడ్డి. "ఇంక మీ ఇంటి వెళ్ళవుగాని పద-"

"మరి...రాజేశ్వరి షమించొద్దూ ?"

అందరం ఉలిక్కిపడ్డాము 'రాజేశ్వరా?'

"అవును-రాజేష్యంక్కూడా ద్రోహం చేశాను."

"నాకేం ద్రోహం చేసిన గుర్తులేదే-" అంది రాజేశ్వరి.

"నైన్టీన్ హైర్టీ ఎయిటీ షూలో మీ ద్రా పినకథ 'జ్యోతి'లో పడింది గుర్తుంషా?"

"అదెందు గుర్తుంధదు?" ఉత్సాహంగా అందామె" అందులోనే హీరో శివశంకర్! వాళ్ల పిన్నికూతుర్ని మర్డర్ చేస్తారెవరో! ఎవరో ఎవరికి తెలిదన్నమాట! అఖరికి ఆ అమ్మాయికికూడా తెలీదు-శివశంకర్‌కి ఎనిమిదిమంది మీద అనుమానం ఉంటుందన్నమాట! మొదటి అనుమానితుడు భీమ్




రాజ్! క్లూకోసం అర్ధరాత్రి రెండింటికి భీమ్‌రాజ్ ఇంటి కెళ్ళాడతను. లోపలను జొరబడి గోడపక్కన నిలబడతాడు

"షాప్-" అంటూ ఓ కత్తి అతని పక్కనుంచీ దూసుకుపోతుంది.

"షాష్ షాష్ షాప్" అన్నీకత్తులే!...

......"పిల్లలూ - ఆడాళ్ళు శ్రద్ధగా ఆ కథ వినటం చూసేసరికి మా అందరికి వళ్ళు మండిపోయింది.

"స్టాపిట్!" అరచాడు రంగారెడ్డి

రాజేశ్వరి భయపడిపోయింది ఆ కేకకు.

"మీ కథ రేపు చెప్దురుగాని - ముందితనిని డిస్పోజ్ చేయనీయండి!"

"ఆ కథ పరమచెత్త కథ అనీ అలాంటి చెత్త 'జ్యోతి'లో ప్రచురించ వద్దనీ ఆ తరువాత నెలలో ఒకఉత్తరం ఉత్తరాం శీర్షికలో పడింది గుర్తుందా?" అడిగాడు జనార్ధన్.

"అవును-పోకిరి వెధవ! ఇడియట్! డాష్-వాడెవాడో-కె కిషన్‌రావ్, న్యూనల్లకుంట అని రాశాడు-"

జనార్ధన్ తలవంచుకున్నాడు

"అది రాసింది నేనే రాజేశ్వరిగారూ."

జనమంతా ఉలికిపడ్డారు.

"మీరా?" అంది రాజేశ్వరి

"అవును - అదే మీకు చేసిన ద్రోహం! క్షమించానన్నండి!"

"నా కథలను విమర్శించే వాళ్లను నేను చస్తే క్షమించను" - బిగుసుకుపోయిందామె.

ఆ మాటతో జనార్ధనం భోరున ఏడవటం మొదలుపెట్టాడు.

అందరం కలసి ఆమెను పక్కకు తీసుకెళ్ళి బతిమాలాము.

"చూడండి! మీ కథలన్నీ క్లాస్ పాఠకులు మెచ్చుకుంటారు - జనార్ధన్ లాంటి మాస్-మసాలాగాళ్ళ చెత్త అంటే మీకెందుకు! మీవన్నీ 'క్లాసిక్స్' అని మేమంతా ఎప్పట్నుంచో చెప్తున్నాం కదా!" అన్నాడు సాయిరామ్.

"సరే క్షమించాను" అందామె.

వెంటనే అందరం కలసి జనార్ధన్‌ని తీసుకెళ్ళి వాళ్ళింట్లో మంచం మీద పడేసాము.

"ఏమిటో అన్నయ్యగారూ! ఆ పాడు




"సినిమాల్లో వేషంకోసం మద్రాస్ వెళ్ళిన దగ్గర్నుంచీ అలవాటయింది రోజూ రాత్రుళ్ళు తాగి ఇంటి కొచ్చి నానాగొడవా చేస్తున్నారు-" అంది వాళ్ళావిడ కన్నీళ్ళు తుడుచుకుంటూ

"అవునమ్మా! ఆ మనిషి కూడ గిట్లనే తయారయ్యిండు! సినిమా ఏషాల్దిస్త కెళ్ళి ఈ చెడ్డ అలవాటు జేస్తోని పైసలన్నీ ఖర్చుజేసి మమ్మల్ని చాలా కష్టపెడుతున్నాడు" అంది యాదగిరి భార్య గద్గర స్వరంతో

"అంతేకాదు! వీళ్ళిద్దరూ కలసి మా ఆయన్నికూడా బలవంతంగా తాగించారు మొన్న అలా తాగుతేగానీ సినిమారచయిత లవలేరు అని ఎవరో చెప్పారట! అంది చంద్రకాంత్ ఛటోపాధ్యాయ్ భార్య అతని వంక కోపంగా చూస్తూ

"ఆ మాట నిజమేలేవే! చాలామంది రచయితలుఇంతకుముందే చెప్పారునాకు" ధీరాగ్గా అన్నాడు చంద్రకాంత్

"అవునుగురూ! వీళ్ళిద్దరూ మద్రాస్‌లో ఆ వెధవసినిమాల్లో ఒక్క వేషం వేశారో లేదో తెగఫోజుకొడుతూ రోజూ బార్ కెళ్తున్నారు" అన్నాడు రంగారెడ్డి

"వీళ్ళసంగతి రేపు ఆలోచిద్దాంలెండి" అన్నానేను నిద్రను ఇంకా సర్వనాశనం చేసుకోవటం ఇష్టంలేక

"కాదు - ఇప్పుడే తేలాలి!" అంది పార్వతీదేవి ఖండితంగా "మొన్న పండింట్లో మావారు వంటలో నాకు సాయం చేస్తూ అన్నంవారుస్తూంటే కిటికీలోనుంచి చూసి పాటపాడారు ఇద్దరూ!" అందామె కసిగా

"పాటేమిటి? ఏమని పాడారు?" అడిగాడు సాయిరామ్ కుతూహలంగా

అందమయిన జీవితమూ - అద్దాల సౌధమూ
వంటచేస్తూ బ్రతికితే వడాలిపోవును
మందుకొట్టి తిరుగుతె ధన్యమైపోవును

అని పాడారు

ఆ పాటలోని సాహిత్యం వినగానే ఆడాళ్ళందరికీ వళ్ళు మండిపోయింది "అయితే ఇప్పుడే తేల్చాల్సిందే" అంది సావిత్రమ్మకూడా! పరిస్థితి చేయిదాటిపోతుందని గ్రహించి రంగారెడ్డి కల్పించుకున్నాడు

"ఆ విషయం నిజమేగానీ-వాళ్ళిద్దరూ మందు ప్రభావంలో ఉన్నప్పుడు మన మాటేం వింటారు? వచ్చే ఆదివారం మీటింగ్ పెట్టుకుందాం!"

సాయిరామ్ ఆనందంతో పొంగిపో యాడు "సోదరసోదరీమణులారా! అనుకోకుండా తలెత్తిన ఈ తాగుడుసమస్య గురించి వచ్చే ఆదివారం మీటింగ్ ఏర్పాటు చేస్తున్నాము కనుక" అంటూ జనం ఇళ్ళల్లోకి వడివడిగా వెళ్ళిపోవటం గమనించి ఉపన్యాసం ఆపేశాడు

మర్నాడు పొద్దున్నే అందరం కలిసి జనార్థన్ యాదగిరినీ పిలిచి రాత్రిగొడవ గురించి అడిగాము

"సినిమాఆర్టిస్టులన్నాక మాకు మందు చాలా అవసరం బ్రదర్! రాత్రింబగళ్ళు షూటింగ్ లు కెళ్ళటం, విశ్రాంతి ఉండక పోవటం, లైట్స్ వేడిలో నిలబడటం— మా లైఫ్ ఎవరికి తెలుస్తుంది? ఎందుకు మందుకొడుతున్నామో ఎవరర్థం చేసుకుంటారు?" అన్నాడు జనార్థన్ శూన్యంలోకి చూస్తూ.

"అవును గురూ! మందుకొడితేగానీ కెమెరాముందు నిలబడటానికి రాదు" అన్నాడు యాదగిరి

"రెండునిముషాల వేషం వేశావో లేదో బోడిపోజు పెడుతున్నారేమిటి? ఆ ఒక్క సినిమాకూడా విజయవాడలో ఊరి బయట హాల్లో ఒకేఒక్క మార్నింగ్ షో ఆడింది-" అన్నాడు గోపాల్రావ్

జనార్థన్ ఉక్రోషంగా లేచినిలబడ్డాడు "అలా అబద్ధాలు మాట్లాడకండి! రెండో ళ్ళుకూడా మార్నింగ్ షో వేశారుట"

"అయినా రాత్రి పెగ్ వేసాక ప్ర

కొట్టాం కాబట్టి కొంచెం సరదాగా కాలనీ అంతా తిరిగాముగానీ—పెగ్ నెంబర్ టూ లోపట ఏమీ గొడవుండదు-" అన్నాడు యాదగిరి

"మేము రోజూ తాగేదికూడా లేదు- మనసు బాగోనప్పుడే" అన్నాడు జనార్థన్

ఆరాత్రి సరిగ్గా పన్నెండింటికి మళ్ళా కేకలు వినిపించినయ్ కాలనీవాళ్ళంతా కిటికీల్లోనుంచే టార్చిలైట్లు ఫోకస్‌చేసి చోద్యంచూడసాగారు

'నా కొడుకులు! ఒకేఒక్క మార్నింగ్ షో ఆడిందంట! ఛూ! దొంగనాయాళ్ళు" అరచాడు జనార్థన్

"సాలేగాళ్ళన్నా ఆళ్ళందరూ! రెండో రోజు మార్నింగ్‌షోల మన యాక్షన్‌కి ఇద్దరు చప్పట్లు కొట్టిన్రట! ఆ సంగతాళ్ళన్నా చెప్తరేమో చూడు—"

ఆ తరువాత ఇద్దరూ పాట మొదలు పెట్టారు "జయంబు నిశ్చయంబురా భయంబు లేదురా! సినిమాఫీల్డు కెళ్ళి నోడికి ఎదురులేదురా-ఎదురులేదురా"

మర్నాడు పొద్దున్నే మళ్ళీ వాళ్ళిద్దరినీ బయటకు పిల్చాము "ఎప్పుడో మనసు బాగోనప్పుడే తాగుతామన్నారుకదా నిన్న" అడిగాడు రంగారెడ్డి కోపంగా

"నిన్న మళ్ళీ మనసు పాడయిపోయిందన్నా" అన్నాడు జనార్థన్ విచారంగా

"ఎందుకని ?"

"మా ప్రొడ్యూసర్ సెకండ్ పిక్చర్‌లో మళ్ళీ మమ్మల్ని బుక్ చేసుకుంటా నన్జెప్పి - మోసంచేశాడు-"

"అంటే ఇంకెవరినయినా వేసుకున్నాడా?"

"కాదు గురూ! అసలు సెకండ్ పిక్చరే తీయకుండా ఎగ్గొట్టాడు!"

"బాస్టర్డ్! బ్రీచ్ ఆఫ్ ప్రామిస్" అన్నాడు యాదగిరి కోపంగా

"అంటే ఇవాళ ఏగొడవా ఉండదని గారంటీ ఇస్తారు! అంతేనా?"

'సెంట్‌పర్సెంట్" అన్నాడు జనార్థన్.

ఆ రోజురాత్రి హఠాత్తుగా బయట కేకలు వినిపించినయ్ అది యాదగిరి గొంతని తెలుస్తూనే ఉంది వెంటనే బయటకు పరుగెత్తాను అప్పటికే మిగతా చాలా మంది ఇళ్ళల్లోనుంచి బయటికొస్తూ కనిపించారు ఆగొడవకి



అందరం కాలనీమధ్యలో ఆగిన ఆటో రిక్షా దగ్గరకు చేరుకున్నాం. ఆటోలో జనార్ధన్, యాదగిరి ఇద్దరూ కూర్చునిఉన్నారు.

"మేమేం ఊరోళ్ళం అనుకున్నవా? ఏయ్-మంచిగే జెప్తున్నా - మా కాలనీకి తీస్కపో! లేకుంటే నువ్వూ ఈడనే ఉంటావ్ - నీ ఆటోభీ ఇక్కడనే ఉంటది!" అన్నాడు యాదగిరి.

ఆటోడ్రైవర్ మావేపు దీనంగ చూశాడు.

"ఇగో చూడండిసార్! అర్థగంట కెళ్ళి కిరికిరి జేస్తున్రు వీళ్ళు - నిర్భయ్‌నగర్ కాలనీ ఇదేనంటే ఇనటం లేదు-"

"వీళ్ళెక్కడ ఎక్కారు ఆటో అసలు?" అడిగాడు శాయిరామ్

అదేసార్ - కాలనీ బయటి బార్‌లో నుంచి వచ్చి ఆటోలో కూర్చున్నారు. నిర్భయ్‌నగర్ కాలనీ ఇదేగద్సార్.

ఆటో ఎందుకుఅని ఎంత మొత్తుకున్నా విన్లేదు-"

"ఏమిటి యాదగిరీ గొడవ? అడిగా

"చూడుగురూ! ఆటో ఎక్కి కూచున్న మో లేదో-నిర్భయ్‌నగర్ కాలనీ ఇదే దిగ మంటున్నాడు."

"అవును మరి! మన నిర్భయ్‌నగర్ కాలనీ ఇదేగదా?" అన్నాడు రంగారెడ్డి.

"ఇదిగో - మనోళ్ళయుండి ఆ ఆటో వాడిని షపోర్ట్ షేష్తారా! మీకు షిగ్గు లేదూ? దమ్ముంటే మమ్మల్ని షపోర్ట్ షేయాలి!" అన్నాడు జనార్ధన్ కళ్ళు కొంచెంగా తెరచి.

"అంటే ఇది మన కాలనీ కాదంటావా?" అడిగాడు శాయిరామ్

"చస్తేకాదు! మన కాలనీకి ఇంకా చాలా దూరం పోవాల!" అన్నాడు యాదగిరి

"ఇదే కిరికిరిషార్ - అర్ధగంట కెళ్ళి! జర మదద్ జేయండిసార్-వాళ్ళను బయటకు లాగుదాం!" అన్నాడు ఆటోడ్రైవరు.

"మమ్మల్ని బయటకు లాగుతావా! నీయవ్వ-ఎందుకు లాగుతావ్‌వే - పోలీస్ రిపోర్టుస్తాం ! ఏమనుకుంటున్నావో !" అన్నాడు జనార్ధన్.

"జనార్ధన్! ఏమిటోయ్ ఇది? ఆటో దిగండి!" అన్నాడు గోపాల్‌రావ్.

"మేము దిగం!" అన్నాడు యాదగిరి.

"ఎందుకని?" అడిగాడు శాయిరామ్

"ఇది మన కాలనీ కాదు-"

"కాకపోవటమేమిటి? మీ ఇల్లు కనబడటంలేదూ?"

"నా కషలు ఇల్లేలేదు-"

యాదగిరి భార్య ఆమాట వినడంతోనే కోపంగా ముందు కొచ్చి నిలబడింది.

"ఏమిటీ నీకసలు ఇల్లు లేదా ?"

"లేదు —"

"ఇప్పుడు ఇల్లులేదంటున్నావ్, ఇంకా సేపాగుతే భార్యలేదంటావ్—"

"అవ్-నాకు భార్యగూడ లేదు-"

'ఓర్నాయనో-భార్యలేదంటున్నాడు' అంటూ గట్టిగా ఏడుపు మొదలుపెట్టిందామె.

అందరం అడ్డుపడి ఆమెఏడుపు ఆపేశాం.

"ఇదిగో చూడవోయ్ - ఇలా రా ఓసారి" ఆటోడ్రైవర్‌ని పక్కకు పిలిచాన్నేను.

"ఏమిటి సార్?"

"నువ్వోపనిచెయ్ - ఆటోని కాలనీ చుట్టూ ఓ రౌండ్‌కొట్టించి తీసుకురా !




ఇప్పుడు దిగుతారేమో చూద్దాం!" సలహా ఇచ్చాడు రంగారెడ్డి

ఆటో రివ్వున కాలనీవెనుకవేపునుంచీ రౌండ్‌కొట్టి తిరిగివచ్చి మధ్యలో ఆగింది

"ఇదేసార్ నిర్భయ్‌నగర్ కాలనీ-" అన్నాడు అతను

"గట్ల దారికిరా ! ఎంతతాగినాగాని మా కాలనీఏదొ తెలుసుకోలేని బేవకూఫ్‌లు గాదు మేము "

అన్నాడు యాదగిరి ఆటోదిగుతూ

జనార్థన్‌కూడా దిగి నిలబడ్డాడు

ఆటోవాడు హఠాత్తుగా నా కాళ్లమీదా రంగారెడ్డి పీళ్ళమీదా పడిపోయాడు-

"ఇయాళ నా ఆటోనీ, నా ఫామిలీని బ్రతికించిన్రుసార్ – లేకుంటే ఈ దినే తెల్లారిపోతుండె "

వాళ్ళిద్దరినీ బలవంతంగా ఇళ్ళల్లోకి తీసుకెళ్ళాము ఆ మర్నాటినుంచీ మా కాలనీపేరు చెప్తే ఆటోవాళ్లు రావటానికి తిరస్కరించటం మొదలుపెట్టారు ఖాళీ ఆటోలు, సైకిల్‌రిక్షాలు అంతవరకూ నెమ్మదిగావచ్చి– మా కాలనీ దాటేవరకూ మాంఛిస్పీడులో వెళ్ళిపోతున్నాయ్

రోజూ రాత్రి పన్నెండింటివరకూ వాళ్ళిద్దరూ కాలనీఅంతా తిరుగుతూ అంద ర్నీ నిద్రలేపుతూ,పాటలుపాడుతూ నానా గొడవా చేసేస్తున్నారు

శనివారంనాడు రాత్రి వాళ్ళతోపాటు చంద్రకాంత్‌ఛటోపాధ్యాయ్ కూడా చేరి గట్టిగా పాటలుపాడడం ప్రారంభించేసరికి కాలనీలో ఆడాళ్ళందరికీ భయం పెరిగి పోయింది

రోజుకో మగాడుచొప్పున వెళ్ళి ఆ గ్యాంగ్‌లో చేరిపోతాడేమో అన్న అను మానం వచ్చేసింది అందుకే మర్నాడు శాయీరామ్ ఏర్పాటుచేసిన మీటింగ్‌కు మగాళ్ళకంటే ఆడాళ్ళే ఎక్కువమంది వచ్చారు

"ఇదంతా పెగ్‌నెంబర్ త్రీ వల్లే వస్తోంది!" అంది రాజేశ్వరి మైక్‌ముందు నిలబడి "వీళ్ళ మందుకి సంబంధించిన విషయాలన్నీ నేను సేకరించాను చాలా ఖార్‌లో ! వీళ్ళ కెపాసిటీ ఏమిటంటే రెండు పెగ్గులవరకూ ఎలాంటిసమస్యా ఉండదు కానీ పెగ్‌నెంబర్–త్రీ కొట్టగానే అమాయకులయిన మనలాంటి ప్రజలమీద పడి చిత్రవధ చేసేస్తున్నారు కనుక పెగ్‌నెంబర్ త్రీ కొట్టలేకుండా వాళ్ళకు

అడ్డుపడదాం మనం!" అందామె. అంతా తప్పట్లు మార్మోగిపోయినయ్. !

"అయితే వాళ్ళకు మూడోపెగ్ ఇవ్వకుండా నాలుగూఅయిదూ ఎన్నయినా ఇవ్వమని బార్‌వాళ్ళకు చెప్తేసరి!" అంది పార్వతీదేవి.

మేమందరం నవ్వాం ఆ సలహాకు! ఎందుకు నవ్వారని పార్వతీదేవి తరచి తరచి అడిగిందిగానీ మేము చెప్పలేదు.

"వీళ్ళను మందుజోలికి పోకుండా చేయాలంటే ఒక అయిడియా ఉంది!" అంది రాజేశ్వరి.

"ఏమిటది ?" ఆత్రుతగా అడిగారు జనార్ధన్‌భార్య, యాదగిరిభార్య.

"హిప్నొటైజ్ చేయటం! తాగుడంటే ఎలర్జీకలిగేట్లు హిప్నటైజ్ చేయిస్తే చాలు! ఇంక జన్మలో తాగరు."

"అద్భుతం - అద్భుతం !" అంటూ తప్పట్లుకొట్టింది చంద్రకాంత్‌భార్య.

"ఇంకో మందుకూడా ఉంది!" అన్నాడు రంగారెడ్డి.

"ఏమిటది?"

"డిసూల్‌ఫిరామ్ అంటే (యాంటాబ్యూష్) టాబ్‌లెట్లు వాడితే వాళ్ళకు ఆ తాగుడుసీసాలు చూస్తేచాలు భయం పట్టుకుంటుంది."

అందరూ తప్పట్లుకొట్టారు మళ్ళీ.

మా కాలనీలోనే ఉన్న వివిన్‌పాల్ ఆ మధ్య ఆరుగంటల్లో హిప్నొటిజం క్రాష్‌కోర్స్ నేర్పుతున్న విషయం మాకు గుర్తొచ్చింది. ఆ పనికి అతనినే నియోగించాము

మర్నాడే రంగారెడ్డి డిసల్ఫిరమ్ టాబ్లెట్లు రెండొందలు తెచ్చి జనార్ధన్ భార్యకూ, యాదగిరిభార్యకూ ఇచ్చారు.

"రోజుకి రెండుచొప్పున - వాళ్ళకు తెలీకుండా మంచినీళ్ళల్లో వేసితాగించండి అంటూ సలహా ఇచ్చారు.

ఆరోజు సాయంత్రమే వివిన్ పాల్ హిప్నొటిజం ప్రారంభించాడు.

యాదగిరిఇంట్లోనే అందరం గుమికూడాము.

"మీరిద్దరూ నావంకే చూస్తున్నారు" అన్నాడు వివిన్ పాల్.

"అవును చూస్తున్నాం" అన్నారు వాళ్ళిద్దరూ.

"నా కళ్ళల్లోకే చూస్తున్నారు—"

"అవును చూస్తున్నా—"

"మీరిప్పుడు నిద్రావస్థలోకి వెళ్ళిపోతున్నారు. మీ కళ్ళు మూతలుపడిపోతున్నాయ్. మీ మనసంతా ప్రశాంతంగా ఉంది. మీరు రెక్కలొచ్చిన పక్షుల్లా ఎక్కడికో, ఏ లోకాల్లోకో ఎగిరిపోతున్నారు. నా గొంతు తప్పితే ఇంక మీకు ప్రపంచంలో ఏమీ వినిపించటంలేదు..."

'అన్నీ వినబడుతున్నాయ్' అన్నాడు జనార్ధన్.

"వినబడుతున్నా సంగతి బయటకు చెప్పకూడదు" కోపంగా అరచాడు పాల్

"మీరిప్పుడు ప్రగాఢమయిన, ప్రశాంతమయిన, పవిత్రమయిన, ప్రక్షాళనమయినస్థితిలో కెళ్ళిపోయారు - చస్తే బయటకు రాలేరు! వస్తే చచ్చారే! ఇప్పుడు మీకు నేనేది ఇచ్చినా మజ్జిగలాగానే కనబడుతుంది! మీరేం తాగినా మజ్జిగలాగానే కనబడుతుంది! ఇల్లంతా మజ్జిగమయం! బార్ అంతా మజ్జిగమయం! ప్రపంచమంతా మజ్జిగమయం!" అంటూ






ఆపి యాదగిరిభార్యకు సైగచేసాడు పాల్.

ఆమె వెంటనే రెండు గ్లాసుల్నిండా బ్రాందీ పోసుకొచ్చి వాళ్ళిద్దరికి ముందూ చెరో గ్లాసూ పెట్టింది

"ఇప్పుడు మీరు మీ ముందు గ్లాసుల్లో ఉన్న మజ్జిగ తాగుతారు!" అన్నాడు పాల్

"మజ్జిగ-"

"ఇంకా తాగండి !"

"వద్దు ! మజ్జిగంటే మాకు ఎలర్జీ-"

అందరం పాల్‌ని కౌగలించుకున్నాం!

"అంతే ! వీళ్ళకి ఎప్పుడు బ్రాందీ తాగినా మజ్జిగలా అని పించింది - కనుక ఎప్పటికీ వీళ్ళక మందు కొట్టరు-" అన్నాడతను విజయగర్వంతో.

"ఫెంటాస్టిక్! ఈ వార్త మా పేపర్లో వేసేస్తాను" అన్నాడు గోపాల్‌రావ్.

"ఇంక మీరిప్పుడు నార్మల్ ప్రపంచంలో కొచ్చేస్తారు. అయితే బ్రాందీవిస్కీ ల్లాంటివి ఏం తాగినా మీకు పుల్లని మజ్జిగ తాగినట్లే అనిపిస్తుంది-" అన్నాడు పాల్.

వాళ్ళిద్దరూ మామూలు ప్రపంచంలో కొచ్చేశారు.

వెంటనే టాబ్‌లెట్లు కలిపిన మంచినీళ్ల ఇద్దరికీ ఇచ్చేసింది జనార్ధన్ భార్య

అది తాగ్గానే మళ్ళీ చూచి 'కెవ్వ్' మని అరచారిద్దరూ

"ఏమిటరా అరచారు?" అడిగాడు రంగారెడ్డి

"భయం వేసింది ఎందుకో!" భయంగా చెప్పారు వాళ్ళు.

రంగారెడ్డి గర్వంగా మా అందరి వేపూ చూశాడు

ఆసాయింత్రం వాళ్ళిద్దరూ మళ్ళీ బార్ కెళ్తొంటే నేను రహస్యంగా వాళ్ళను వెంబడించి వాళ్ళకు తెలికుండా ఆ పక్కరూమ్‌లోనే కూర్చున్నాను

"పిచ్చి సన్యాసులు-మనం నిజంగానే హిప్నటైజ్ అయిపోయామనుకున్నారు-' అన్నాడు జనార్ధన్.

ఇద్దరూ పగలబడి నవ్వుకున్నారు కాసేపు.

"ఆ మంచినీళ్ళు తాగ్గానే మనకు నిజంగానే భయం వేసిందనికూడా భలే బోల్తా పడ్డారు-"

మళ్ళి నవ్వుకున్నారిద్దరూ

బేరర్ బాటిల్ తీసుకెళ్ళి గ్లాసులో మందు పోయటం నాకు వినబడుతూనే ఉంది.

రెండు నిముషాలు నిశ్శబ్దంగా ఉన్నారిద్దరూ

''ఇదేంటో మజ్జిగ వాసనొస్తోందేమిటి?'' అన్నాడు జనార్ధన్

''అవునన్నా! నేనూ అదేచెప్దామనుకుంటున్న నీతో-'' అన్నాడు యాదగిరి

జనార్ధన్ బేరర్‌ని పిలచాడు

''యస్సార్''

''బ్రాంది అదోలా ఉందేమిటివాళ ?''

''అదే బ్రాండ్ కదా సార్ తెచ్చింది ?''

''అఫ్‌కోర్స్ బ్రాండ్ అదేననుకో-ఇంకెవరూ దీన్ని గురించి ఏమీ చెప్పలేదా ?''

''చివరి కాబిన్లో కూర్చున్నాయన చెప్పారుసార్ !''

''ఏమని ?''

''ఈసారి స్టాక్ చాలామంచి స్టఫ్‌తో వచ్చిందని-''

''ఐసీ-సరే-నువ్వెళ్ళు-''

మళ్ళీ అయిదునిమిషాల నిశ్శబ్దం

''నేను తాగలేనుగురూ! నా కింకా మజ్జిగవాసనే కొడుతోంది'' అన్నాడు జనార్ధన్.

''నాకూ అంతే !''

''వదిలేసి వెళ్ళిపోదామా ?''

''వాంతులు చేసుకోటంకన్న అదే మంచిది గద !''

''ఒకవేళ-బై ఛాన్స్-ఐస్టఫర్ ఆవర్ సేక్ - ఆ పాల్‌గాడి హిప్నాటిజం ఏమయినా వర్క్ చేసింగంటావా ?''

''ఏమోగురూ! నాకేం సమఝ్ కావటం లేదు-''

''సరే-పద! రేపుచూద్దాం !''

వారం రోజులు గడచిపోయింది. ఇప్పుడు జనార్ధన్, యాదగిరి నిజంగానే భయంభయంగా చూస్తున్నారు మా అందరి వంకా! జనార్ధన్ రాత్రుళ్ళు తన సీటనే



క్యాడ్‌బరీస్

# బోర్న్‌విటా




## ఉరకలు-వేసేలా-చేసే పానీయం!

బోర్న్‌విటా, తేగురు రంగులోని. కోకో. మాల్ట్, పాలు, పంచదార, వీటన్నిటిలో గల, పుష్టినిచ్చే మంచి లక్షణాలన్నీ వున్న మాల్టెడ్ ఆహార పానీయం దీన్ని తయారుచేసింది, 100 సంవత్సరాల పైగా ఆహార పానీయాల్ని తయారుచేయడంలో ప్రత్యేకత వహించిన క్యాడ్‌బరిస్.

రెండు చెంచాల బోర్న్‌విటాని ప్రతి కప్పు పాలలో కలిపితే అవుతుందిక అది పుష్టినిచ్చే, రుచికరమైన ఆహార పానీయంగా — మీ కుటుంబంలోని వారందరికీను. ముఖ్యంగా, పెరిగే పిల్లలకోసం మరెంతో మంచిది బోర్న్‌విటా. వాళ్ళకి, పెరిగే ఆ ప్రాయంలో అవసరమయ్యే, ఉరకలు వేసే అధిక శక్తికోసం అధికమైన పుష్టినివ్వడంకోసం, రోజూకు రెండుసార్లు, ప్రతిరోజూ యివ్వండి, బోర్న్‌విటా.

పిల్లల సంరక్షణలో శ్రద్ధ వహించే ఒక తల్లి కథనం యిది "పాలలో బోర్న్‌విటా కలిపి నా పిల్లలకివ్వడం వలన, పెరిగే ప్రాయంలో వారికి అవసరమైన ఆ పుష్టినీ, శక్తినీ యిస్తుందది. దాంతో పిల్లలు పెరుగుతారు సరిగ్గా."



**బోర్న్‌విటాతో పెరిగే ప్రాయం యిది యిక.**
**వాళ్ళు మిమ్మల్ని మెచ్చుకునే రోజొకటి వస్తుందిక.**




చూచుకుని కెవ్వున అరుస్తున్నాడని వాళ్ళావిడ చెప్పింది వాళ్ళిద్దరూ మందు మానేశారు. కాలనీవాళ్ళందరం కలసి పాల్‌కి వెయ్యిరూపాయల పర్స్ బహూకరించాం !

ఆ మర్నాడే పాల్ ఆ వెయ్యిరూపాయలూ బార్‌లో జనార్దన్‌కీ, యాదగిరికీ డ్రింక్స్ సర్వ్‌చేసిన బేరర్‌కి ఇస్తూంటే నేనూ రంగారెడ్డీ, శాయీరామ్ చూడటం తటస్థించింది

వెనుకనుంచీ వెళ్ళి పాల్ భుజంమీద చెయ్యివేశాము

గాల్లో ఎగిరిపడ్డాడు పాల్

"మీరా !" అన్నాడు పాలిపోయిన మొఖంతో.

"సంగతేమిటి ?" అడిగాడు శాయిరామ్.

"ఆ బేరర్ నిజంగానే బ్రాందీలో కలర్డ్ బటర్‌మిల్క్ కలిపిఇచ్చాడు వాళ్ళకు- అందుగ్గానూ నేను వెయ్యిరూపాయలు అతనికివ్వాలని ఒప్పందం !"

"అయితే ఇది నీ హిప్నాటిజం ప్రభావం కాదన్నమాట !"

"ఎందుకో అది పనిచేయలేదుగురూ ! నాకు నేర్పించినవాడిని వదలన్లే-ఎప్పుడో పట్టుకుని తుక్కురేగ్గొట్టేస్తాను-"

అందరం నవ్వేశాము

"కాని గురూ ! దయచేసి ఈ విషయం ఎవరికీ చెప్పకండి ! నా ప్రిస్టేజ్ పోతుంది

బ్రతిమాలసాగాడు పాల్

"సరే !" అన్నాం అయిష్టంగానే

చాలా రోజులతర్వాత మళ్ళీ ఆ రోజు అందరం ఉదయం పదిగంటలవరకూ సుఖంగా నిద్రపోవాలని నిర్ణయించుకున్నాము.

కానీ ఉదయం ఆరయేసరికే బయట పెద్ద కోలాహలం వినిపించేసరికి కాలనీని తిట్టుకుంటూ బయటకు వెళ్ళక తప్పలేదు నాకు.

అక్కడి దృశ్యంచూస్తూనే నా నిద్రమత్తంతా వదలిపోయింది

## పాల్ ఇంటిముందు కొన్ని వేలమంది స్త్రీలు క్యూ కట్టి నిలబడి ఉన్నారు. ●

## పొరుగింటి పుల్లకూర......

అతడి పేరు 'అజీజ్'

కైరోకి కొన్ని వందల మైళ్ళ దూరంలో నిర్జన
ప్రదేశమైన 'సినాయ్ ఎడారి'లో అతను
ఇల్లు కట్టుకుని కుటుంబంతో నివసిస్తున్నాడు
దీనికి మొదటి కారణం

— ఎడారితో అతనికున్న అనుబంధం —

మిగిలిన కారణాలు ?

అద్భుతమైన కథ! అత్యద్భుతమైన కథనం!!

**వీరభద్రరావ్ పమ్మి** అనువాదంలో

అతిత్వరలో.......

**రోల్డ్ డాల్**... పెద్దకథ.



# ఎండవల్ల ఎల్లప్పుడూ నల్లబడుతూనే వుంటే
# ఎలా వచ్చేను తెల్లదనం—ఎరుక సేయవే ఓ మనసా!

పుట్టినప్పటినుంచి వాళ్ళ శరీరతత్వాల ప్రకారం ఎక్కువగానో తక్కువగానో శరీరం క్రమంగా నల్లబడుతూనే ఉంటుంది లోపల వున్న కారణం [illegible] లో[illegible]గల నల్లని రంగు పదార్థం మెలానిన్



**జి.కె.కి ఆతడికిమధ్య సమావేశం ఆ మరుసటిరోజు జరి**గింది. వాళ్ళింట్లోనే కలుసుకున్నారు. అయితే ఇంతకు ముందులా తండ్రీకొడుకుల సంబంధాలూ, ఆప్యాయతలూ (అవి పైపైవైనాసరే లేవు. శ్యామా, భరత్‌లు మాత్రం యధావిధిగానే పలుకరించారు.

"నువ్వు ఇంట్లోనుంచి వెళ్ళిపోతున్నావటగా" అంది శైలజ.

"ఎవరు చెప్పారు?"

"డాడీ"

"అవును"

"ప్చ్. నువ్వుంటే చాలాబావుండేది." అనిమాత్రం అంది. ఆ అమ్మాయి మానసికంగా పూర్తిగా ఎదగలేదు. ఎప్పుడూ ఇంటిమీదకు ఏదో ఒక గొడవ తెస్తూనే వుంటుంది. "...ఎందుకువెళ్ళి పోవటం? మాతోనే వుండొచ్చుగా." ఆలోచన్లనుంచి తేరుకుని చప్పున అడిగింది.

అతడు నవ్వేడు. సుమతి పరిచయ మయ్యాక నవ్వు ఎక్కువైంది. ఇప్పుడు చెల్లెలిమాటలు వింటూంటే మళ్ళీ నవ్వొస్తూంది. "నాకు నా అమ్మొస్తుంది. అమ్మ ఇక్కడెలా వుంటుంది? తనూ నేనూ వేరేగా వుండాలి. అవునాకాదా?" చిన్నపిల్లకి చెప్పినట్టు చెప్పాడు.

"అవున్నిజమే!" అని ఆ అమ్మాయి కొంచెంసేపు మౌనంగావుండి, తనలో తనే ఆలోచించుకుంటున్నట్టు. "అమ్మలేని పిల్లలందరూ చాలా చెడ్డగా తయారవుతార్ట కదూ" అంది.

"ఏం? ఎందుకలా అనిపించిందినీకు."

"నేనే...నేనే కారణం చూస్తూ... ఇప్పటికి రెండు అబార్షన్లు. అసలు నాకీ ఇల్లంటేనే అసహ్యం. ఎప్పుడూ నవ్వుతూ అల్లరిచేస్తూ వుంటానని నా స్నేహితు

అందరూ 'హుషారైన పిల్ల' అని బిరుదిచ్చారు.

కానీ నా వెనుక నవ్వు కుంటారు. నిజం చెప్పు. నే నంటే నీకేమైనా మంచి అభిప్రాయం వుందా? ఎవరికీ లేదు. కానీ నే నెందుకు ఇలా తయారయ్యాను: చిన్నప్పటినుంచీ నాకి ఇల్లంటే ఇష్టం వుండేది కాదు. నాన్న పట్టించుకోడు. ఇంట్లో ఎవరూ మాట్లాడరు. ఆత్మైమెలో పరాయివాడు ఎవడు కాస్త మాట్లాడినా అదే ప్రేమ అనుకునేదాన్ని. అందుకే ఏ చిన్న భవిష్యత్తయినా ఆ ఇంటి తల్లిమీదే ఆధార పడి వుంటుంది బాగా ప్రేమ పంచిఇచ్చి, బాగా తీర్చి దిద్దితే ఎవరూ పాడవరు."

"దేశం లాగా."

"ఏమిటీ"?

"ఏం లేదులే చెప్పు."

"నా మాటలకి నీకు బాగా నవ్వొస్తున్నట్టుంది"

"లేదు. లేదు. నువ్విలా మాట్లాడటం ఎంతో బావుంది. చెప్పు."

"చాలా కాలానికి మనం ఇలా మాట్లాడు కుంటున్నాం కదూ. నిజంగా నా స్వంత అన్నయ్యకంటే—నువ్వంటేనే ఇష్టం. నమ్మరావు కదూ... నే నంటే నీకు అసహ్యం లేదు కదూ..."

"లేదు."

"నిజంగా అమ్మలేక పోవటం వల్లనే నేనిలా తయారయ్యాను. నా తప్పులకి కారణం వెతుక్కోవటం కాదు. నిజంగానే... ఈ రోజు అబద్ధం చెప్పను. ఈ రోజు గొప్ప తన మేమిటో తెలుసా— సరిగ్గా ఈ రోజు నాడే మా ఇంట్లో ప్రవేశించావ్ నువ్వు. మళ్ళీ ఇన్ని సంవత్సరాల తరువాత ఈ రోజు వెళ్ళిపోతున్నావు. అమ్మ దగ్గరకి... నిన్ను చూస్తూంటే నాకు ఈర్ష్యగావుంది. అమ్మ ప్రేమ లేని వాళ్ళు, అమ్మ ప్రాపకం లేనివాళ్ళు అందరూ నాలా తయారవుతారనుకున్నాను. కాదని నిరూపించావు. మీ అమ్మని నాక్కూడా చూపించాలి. నువ్వుతాలుక్కూడా మీ అమ్మ దగ్గర నా గురించి చెడుగా చెప్పొద్దు. అబార్షన్ల సంగతి... పాప్ మ్యూజిక్కు... లేట్ సాయంత్రాలూ... ఏమీ చెప్పకూడదు..."

"మతి లేకుండా మాట్లాడకు. పడుకో. చాలా రాత్రయింది"

"అవును మతిలేదు. చిన్నప్పుడుకూడా ఇంతే. స్కూల్‌నుంచి ఇంటికి రాగానే ఇల్లంతా నిశ్శబ్దంగా వుండేది. మతిపోయేది."

అతడాపిల్లదగ్గరగా వెళ్ళి తలమీద చెయ్యివేసి, "నిద్రపో" అన్నాడు బుజ్జగిస్తున్నట్టు. అతడి చెయ్యి మొహానికి దగ్గరగా తీసుకుని ఆ అమ్మాయి కప్పుమూసుకుంది. చేతికి తడి తగిలింది. అతడామె తల నిమురుతూ వుండిపోయాడు. అతడికి అకస్మాత్తుగా ఒక వెలుగురేఖ చీకట్లోంచి బయల్వెడలినట్టు అనిపించింది. విశ్లేషిస్తే ఈ ప్రపంచంలో ఎవరూ చెడ్డవారు కారు. విశ్లేషిస్తే ఈ ప్రపంచంలో బాధలులేని వారెవరూ లేరు. విశ్లేషిస్తే ఈ మనుషులంతా ఆప్యాయత కోసం అలమటిస్తున్నవారే. విశ్లేషించేదెవరు: వివరించి చెప్పగలిగేదెవరు? అందరికన్న పెద్దరచయిత తగ

**వంతుడే**... ఆ బుచ్చిబాబు కన్నా ఎవరుబాగా చెప్పగలరు—

జీవితంలో నిజమైన విషాదం ద్వేషించటం కూడా కాదు; నిజమైన విషాదం ప్రేమించలేక పోవటం! ద్వేషించటంలో కూడా కొంతపట్టువల, కార్య సాధనకూడా వుండొచ్చు కానీ ప్రేమించలేకపోవటంలో అట్లా సమాధాన పడేటందుకేమీలేదు.

“నా కొరకు చెమ్మగిలి నయనమ్ములేదు–” కంటే విషాదకరమైన **గీతం** ఏముంది?

...శ్యామా నిద్రపోయింది. ఆమెతో ఈ కథ ప్రారంభమయింది. **ఆమెతో ఆఖరవబోతూవుంది** అవుతుందా? ఏమో... అతడు బయటకు వచ్చాడు.

జి కే. అతడికోసం హాల్లో ఎదురుచూస్తున్నాడు. మనిషి భయపడుతున్నాడు. కానీ బింకంగా వున్నాడు అతడు మాత్రం దేన్నైనా క్షమించగలిగే స్థితిలోవున్నాడు.

సంతృప్తి ద్వేషాన్ని చంపుతుంది. ఆమాటే అతనన్నాడు.

“— జి కే .. చాలా సంవత్సరాల తరువాత నిన్ను పేరుపెట్టి పిలుస్తున్నాను. మన గడువుకాలం పూర్తయింది కాబట్టి... నువ్వునన్ను చంపాలని చూసేవు. వంక చెక్క రామ్మూర్తితో చివరిరోజుల్లో చేతులు కలిపావు, అయినా నిన్ను క్షమిస్తాను. ఎందుకంటే– నా తల్లిని నువ్వు చూపించబోతున్నావు కనుక–”

జి కే దానిది వెంటనే జవాబు చెప్పలేదు.

“ఏది నా తల్లి?”

జి కే. పెదవులు వణుకుతున్నాయి అతడు భయస్థుడు కానీ ఆ పరిస్థితిలో ఎదుటివ్యక్తి ఆకారం ఎవర్నైనా భయ పెట్టేటట్టువుంది “నా తల్లెవరో నీకు తెలీదని నువ్వీక్షణం నాకు చెప్పబోవటం లేదు– అవునా! అలా చెప్పిన మరుక్షణం...”

“లేదు-శ్యామ్. అలా చెప్పటంలేదు” మాటల్ని కట్ చేస్తూ అన్నాడు.



"మరి!"

జీ.కే. ధైర్యాన్ని కూడకట్టేసుకుని అన్నాడు. నీ తల్లిని నీకు వప్పచెప్పటానికి-మన మధ్య కొన్ని సంవత్సరాల అగ్రిమెంటుంది."

"అవును. వుంది. నిన్నటితో అది అయిపోయింది."

"కానీ చివరి రోజుల్లో నువ్వు నన్ను విడిచి వెళ్ళిపోయావు."

అతడు అనుమానంగా చూసాడు.

"అలా... అలా విడిచి వున్నన్నిరోజులు నువ్వు నా దగ్గిర ఇంకా పని చెయ్యాలి."

జి.కే. మాటలు పూర్తికాలేదు. అతడు జి.కే కాలరు పుచ్చుకుని విసురుగా లాగాడు. "నేను విడిచి వున్నానా? చివరిరోజుల్లో నన్ను చంపించటానికి నువ్వు వేసిన ప్లాన్ కదూ ఇది! నీ నుంచి విడిపోయాక నీకు నేను బలమైన శత్రువుని అవుతానని కదూ నువ్వెళ్ళి రామ్మూర్తితో చేతులు కలిపింది! ఇప్పుడిదంతా నా తప్పుగా, నా మీదకు తోసేస్తావా? నిన్నింకా బ్రతకనివ్వటం నాదే తప్పు. కేవలం నా తల్లి రహస్యం నీకు తప్ప ఇంకెవరికీ తెలియదనే ఉద్దేశ్యంతో నిన్ను ఇన్నాళ్ళూ వదిలిపెడుతూ వచ్చాను. ఇప్పుడిక బ్రతకనివ్వను. నా తల్లిగురించి నాకు శాశ్వతంగా తెలియకపోయినా సరే-నిన్ను చంపేస్తాను..."

"ఆగు" గింజుకుంటూ అన్నాడు జి.కే."... పోనీ ఇంకొక మార్గం చెపుతాను-"

"నీ కిక 'మార్గాలు' చెప్పేహక్కులేదు జీ.కే. ఆ అవకాశాలన్నీ ఎప్పుడో పోగొట్టుకున్నావు."

"ఇది నా ఆలోచనకాదు దీని వెనుక వున్నది నేను కాదు-"

అతడు చెయ్యివదిలేసి, "మరి"? అన్నాడు.

"వంకచెక్కా రామ్మూర్తి"

"అతడూ నువ్వూ ఇద్దరూ ఒకటే! చెప్పు మీకేం కావాలి!" ఆవేశాన్ని కంట్రోల్ చేసుకుంటూ అడిగాడు.

"జానకీరాముడు నీ మనిషి నువ్వేం చెపుతే అదిచేస్తున్నాడు మారిన పార్లమెంటరీ సిస్టమ్‌లో, దేశానికి అత్యున్నతాధికారి ప్రెసిడెంటు! అతడిని మాకు పరిచయం చేయాలి."

"ఏ విధమైన పరిచయం" అనుమానంగా చూసేడు.

నీ ద్వారా వెళితే ఏ విధమైన పరిచయమైనా పర్వాలేదు"

"నేనేం చెప్పినా జానకిరాముడు వింటాడు. ఇంకోరకంగా చెప్పాలంటే -నా ద్వారా వెళ్ళిన మీకు జానకీరాముడి దగ్గర అంతులేని పలుకుబడి లభిస్తుంది. మారిన ఈ రాజకీయ సిస్టమ్‌లో, ప్రెసిడెంట్ తల్చుకుంటే చేయలేనిదేమీలేదు. అతడి ప్రాపకం మీకుంటే, దేశంలో మీ పలుకుబడి అంతులేనంతగా పెరిగిపోతుంది

నా తల్లిని నాకు వప్పచెప్పటానికి మీరు కోరే ఆఖరి కోరిక- ఈ దేశాన్ని మీకువప్ప చెప్పమని- అవునా"

అంతంత పెద్దమాటలెందుకు?"

"పెద్దవయినా చిన్నవయినా ఆ మాటలర్థం అదే-" అతను లేచాడు." సారీ. నేనాపని చెయ్యలేను. నా స్వార్థంకోసం మీకు జానకిరాముడిని అప్పగించలేను. పోతే నన్ను మోసం చేసి ఇన్నాళ్ళు నాతో పనిచేయించుకున్నందుకుగానూ నేనిన్ను చంపబోతున్నాను మామూలుగాకాదు చిత్రహింసచేసి..." అని, జి. కె. ఏదో అనబోతూ వుండగా అక్కణ్ణుంచి విసురుగా బయటకు నడిచాడు.

అతని మనసంతా వికలమయింది.

ఒక అద్దాల మేడని అయిదంతస్థులు కట్టి- అంతాపూర్తయ్యాక రాయి విసిరి బద్దలు కొట్టినట్టువుంది. విరిగిన గాజుముక్కల్లా చెల్లాచెదరైన ఊహల భవిష్యత్తు. మనసుకు సేదతీర్చే చోటుకోసం తపన...

అతడు సుమతి దగ్గిరకి వెళ్ళి జరిగినదంతా చెప్పాడు. అయితే, ఆమె విస్మయాన్ని ప్రకటించలేదు. "ఇలాటిదేదో జరుగుతుందని నేను అనుకుంటూనే వున్నాను" అందిక్లుప్తంగా.

"అంటే... నా తల్లి గురించి అతడికి తెలీదా?"

"తెలిసి వుండవచ్చు. కానీ అంతసులభంగా చెపుతాడనుకో లేదు. ఇప్పుడదే జరిగిందిచూడు"

"నాది అత్యాశ అంటారా? ఇదంతా మూర్ఖత్వం లా కనబడుతోందా?"

"ప్రతీ మనిషికీ తర్కానికి అందని, ఏదో ఒకరకమైన అబ్సెషన్ వుంటుందని నువ్వేగా ఎప్పుడూ అంటూవుంటావ్."

అతడు తన ఆలోచనల మధ్యలో అలాగే వుండిపోయాడు. అతడి మూడ్ మార్చటానికా అన్నట్టు, "రేపు నా పుట్టినరోజు-తెలుసా" అంది. అతను చప్పున తెప్పరిల్లి, "నిజమా" అన్నాడు. "చెప్పు- ఏం కావాలి నీకు?"

"ఏం వొద్దు. ఊరికే చెప్పానంతే."

"ఈ రోజు ముందు అనుకున్నట్టుగా నా తల్లి గురించి నాకు తెలిసివుంటే, రేపు నీ పుట్టినరోజు మరెంత ఆనందంగా వుండేదికదూ-"

నువ్వేం అనుకోనంటే నేనొకమాట చెప్పనా?"

"ఏమిటి?"

"నా స్కూల్లో దాదాపు రెండొందలమంది పిల్లలున్నారు. ఎవరికీ తల్లుల్లేరు. అవునా-"

అతడు చూస్తూ వుండిపోయాడు.

"తల్లిలేని ప్రతీ పిల్లవాడూ జీవితం మొత్తం ఆ ఆబ్సెషన్‌తో బాధపడకుండా వుండేట్టు చేయటానికి ప్రయత్నించటం, తల్లి లేదని బాధపడటం కన్నా మంచి

బాంబినో ఒక అద్భుతమైన వెర్మిసెల్లిని. పరిశుభ్రమైన పద్ధతిలో అధునాతన ఇటాలియన్ యంత్రములతో తయారు చేయబడినది. మిక్కిలి ప్రొటీన్లు కలిగి యుండి కొవ్వు పదార్థము లేకుండుటయే బాంబినో విశిష్టత వండినప్పుడు కాని, తరువాత కాని, ముద్దగా కాక పోవుటయే బాంబినో ప్రత్యేకత. నిమిషములలో బాంబినోతో ఎన్నో రకములైన నోరూరించే వంటకాలు, ఫలహారాలు తయారు చేయవచ్చును. ఇంకా బాంబినోతో ఎంతో పొదుపు కూడా. నేడే వాడి చూడండి. మీకే తెలుస్తుంది.



బాంబినో కట్‌లెట్:
5 కప్పుల బాంబినోను ఉడకబెట్ట
ఆరబెట్టి ఉంచండి. కీమాను కూ
ఉడకబెట్టి ప్రక్కన పెట్టండి. అం
లవంగాలు, ఏలక్కాయ, వెల్లిగ
5 పాయలు, అల్లం ముక్కలు
ముద్ద చేయాలి. కళాయిలో నూ
మరగించి, కీమాను, బాంబినోను
మసాల ముద్దను ఈ కళాయిలో
గరిటతో కలపాలి. తరువాత దీని
దించి గ్రుడ్డు పచ్చసొన, మొక్క
పిండి కలిపి మూడు కట్‌లెట్‌లు
చేయండి. తర్వాత దీనిని తెల్లని
ముంచి రొట్టె ముక్కలు రుద్దిబా
వేయించండి.




బాంబినో వంటల విధానం తెలిపే పుస్తకం కొరకు వ్రాయండి.

జన జీవన్ ఫుడ్స్ ప్రైవేట్ లిమిటెడ్
1వ ఫ్లోర్, బషీర్‌బాగ్ ప్యాలెస్, హైద్రాబాద్.







వెర్మిసెల్లిని



తీపైనా ఖారా అయిన బాంబినోతో రుచే రుచి !





'శపథం' లో కమలహాసన్, సుజాత.






రాజాచంద్ర · మాగంటివెంకటేశ్వరరావు · కిషోర్

# ఆహ్లాదమైన అనుభూతి, కనువిందయిన సరదాల సమ్మేళనం.

ఆ సరదా క్షణాలలో అసోకా వారి మధురమైన అనుభూతి.
పుష్టికరమైన పోషక పదార్థాలతో తయారు చేయబడి నోరూరించే అసోకా వారి నాలుగు రుచులు –
ఇలాచీ. ఆరంజి. పైనాపిల్ మరియు చాక్‌లెట్ క్రీమ్ బిస్కెట్లు.



**అసోకా®**

**బిస్కెట్లు.**

నాంధారి ఇండస్ట్రీస్. అంబర్ పేట్. హైదరాబాదు - 500 013 **అసలైన రుచితో మధురమైన ఆహ్లాదం**

TARA/AB/55/85 TEL




విషయం కాదా నేనంటున్నాని ఏమనుకోక- ఆ విషయం ఎప్పటినుంచో చెపుదామనుకున్నాను నువ్వేమనుకుంటావో అని వూరుకున్నాను. దీవి నుంచి బయటపడగానే తల్లికోసం వెతుక్కుంటూ వచ్చి జికే ట్రాప్‌లో చిక్కుకున్నావు ఒక తల్లికోసం ఆత్మవంచన చేసుకుని ఈ సాలెగూడులో ఇరుక్కుపోయావు ఎంతో మంది ఆ దీవిలో తమ తల్లుల్ని, తండ్రుల్ని వదిలి జీవితాంతం బానిసలుగా బతుకుతూంటే, వాళ్ళ గురించి, నువ్వు బయటకు రాగానే మర్చిపోయావు చాలా కన్వీనియెంట్‌గా అలా మర్చిపోవటం గురించి నేనంటే నువ్వేమంటావు?"

"సుమతీ-"

"తల్లి నాకూ ఉంది. నేనేమీ నిచ్చలు ష్యామూలాగా తయారవలేదే... మనిషి తానున్న స్థితికీ, తాను చేసేపనికీ, అనుగుణంగా తనని తాను సమర్థించుకోవటానికి, తన చుట్టూవున్న పరిస్థితుల్ని, తనకు జరిగిన అన్యాయాల్ని సాకుగా తీసుకుంటాడు దీనికి నువ్వూ దూరం కాలేవు నీ తల్లికి అన్యాయం చేసిన వాడిని తుదముట్టించాలన్న పగకన్నా — తల్లిలేని ఎంతో మంది నీలాంటి పిల్లల్ని పెంచాలన్న ప్రేమ ఎంతో గొప్పది కాదంటావా? అసలు నీలాంటి వేలమంది అభాగ్యుల్ని ఎలా మర్చిపోగలిగావు? ఆ దీవిలో అంతమందిని ఎలా వదిలేసి రాగలిగావు?? ఒక్క చీకటి రాత్రయినా నీ పాత రోజులూ నీతో బాధపడుతున్న అంతమంది అభాగ్యుల ఆక్రందనలు జ్ఞాపకం రాలేదా? దేశాన్ని ఉద్ధరించాలన్న కోర్కె గొప్పదే కానీ దేశం కన్నా 'మనిషి' ముఖ్యం కాదా అలాంటి -'మనిషిని'- ఎలా మర్చిపోగలిగావు? నీ మనసు పూర్తిగా గతాన్ని మర్చిపోయిందా? దేశం- రాజకీయాలు- ఎన్నికలు- ఈ కుళ్ళు- వీటన్నిటికన్నా ఆఖరికి తెలియని ఓ తల్లికన్నా- -సాటిమనిషి, తల్లిపాలకోసం ఏడ్చే పిల్లవాడు- వీళ్ళు ముఖ్యం కాదా నువ్వెప్పుడో అడిగావు గుర్తుందా- నీకు తల్లి గుర్తురాదా అని గుర్తురాదు వస్తే నా పిల్లల్ని చూసుకుంటాను రెండొందల మంది పిల్లలు .. ఇప్పటికే ఆలస్యమైంది ..వెళ్ళు...

ఆ దీవి ఎక్కడుందో, ఎలాగైనా కష్టపడి కనుక్కొని ఆ బానిసల్ని విడిపించు. నేను నిశ్చయంగా చెప్పగలను- తల్లి దొరికినప్పటి ఆనందంకన్నా ఆ ఆనందం ఎక్కువగా వుంటుంది కావాలంటే చేసి చూడు"

అతడు తలవంచుకుని ఆ గదిలోంచి బయటకు నడిచాడు వెళుతూ మనసులో అనుకున్నాడు- "నా తాపత్రయం మీకు అర్థం కాదు! ఈ మాటలకి నేను మారిపోయినట్టు ఆత్మవంచన చేసుకోలేను అయినా నీ కోసం నే నీ పని చేస్తాను"

*　*　*　*

"పుట్టినరోజు బహుమతి కార్డులున్నాయా" అతడు షాపులో అడిగాడు.

"చాలా వున్నాయిసార్. చూడండి"

"ఒక ప్రత్యేకమైన కాప్షన్ వున్నదేదైనా కావాలి"

"ఎటువంటివిసార్-"

అతడు సరిగ్గా చెప్పలేకపోయాడు "ఇటువైపుకి రండి. బొమ్మకన్నా లోపల మాటరు బాగావున్నది కావాలి అంతేగాసార్."

"అవును"

షాపువాడు లోపలికి తీసుకెళ్ళాడు చాలా పెద్దషాపు అది రకరకాల కార్డులున్నాయి షాపువాడు అన్నాడు- "చాలామంది కార్డుపైన అందమైన బొమ్మల కోసం, బెస్ట్ గ్రీటింగ్స్ కోసం చూస్తారుసార్. లోపల ఏం వ్రాసివుంది అని మీలా అంతగా పట్టించుకోరు మీ లాంటివాళ్ళు చాలా తక్కువ. కావలసినంతసేపు చూసుకోండి-" అని అక్కడ్డించి వెళ్ళిపోయాడు

అతడికి దాదాపు అరగంట పట్టింది తనకి కావలసిన కార్డు దొరకటానికి. పైన రెండు చేతులున్నాయి లోపల మాటరు మాత్రం ఇంగ్లీషులో వుంది.

"నేను చీకట్లో వున్నాను
నీ కిష్టమైన పనిచేయాలని నా మనసు ఉవ్విళ్ళూరుతుంది...
నువ్వు చెప్పాలనుకున్న పనిని
నువ్వు చెప్పకుండా నేను చేసినపప్పుడు
నీ కళ్ళలో మెరిసే వెలుగు- ఆ చీకటినుంచి
నన్ను రక్షిస్తుంది
పోతుంది ఈ చేతులుపడిన కష్టమంతా
నీ చేతుల్లోకి వాటిని తీసుకున్నప్పుడు.
తొందర్లోనే ఆ క్షణం
రావాలని ఈ నిరీక్షణం.

—పుట్టినరోజు శుభాకాంక్షలతో."

అతడి పెదాలమీద చిరునవ్వు వెలిసింది తన మనసుని సరీగ్గా సూచించే ఆ కార్డువైపు సంతృప్తిగా చూసుకున్నాడు దాన్ని తీసుకుని లోపల గదిలోంచి బయట హాల్లోకి వస్తూంటే 'హల్లో' అని ఎవరో విష్ చేయటం వినిపించింది.

తలెత్తి చూస్తే ఇన్‌స్పెక్టర్ విజయ్.

"ఏమిటి కార్డా?"

"అవును. ఇదెలావుంది చూడండి" అంటూ విజయ్ ఓ కార్డు అందిచాడు. రాధా కృష్ణుల బొమ్మవుంది.

"ఎవరికి"

"సుమతి అని... మీకు తెలుసుగా— మా మేనత్త కూతురు. రేపు తన పుట్టినరోజు-" విజయ్ చెపుతున్నాడు. అతడికి కేదారేశ్వరి గుర్తొచ్చింది. సుమతి వంకాచెక్కా రామ్మూర్తి గురించి చెప్పటం గుర్తొచ్చింది. ఈ స్నేహంలో ఆశ్చర్యమేమీలేదు. విజయ్ వాళ్ళింటికి తరుచు వెళుతూ వుండి వుండవచ్చు. కేదారేశ్వరి సుమతి మేనత్త...

అతడు కార్డు తిప్పి లోపల చూసాడు. తెలుగులో చక్కటి అక్షరాలు ప్రింటు చేయబడివున్నాయి.

"పాంచజన్యమేల-
చేత మురళి వుండగా...
యుద్ధవాంఛ ఏల-కృష్ణా
చెంత రాధ నిలుచుండగా...
యుద్ధమే "పురుష" లక్షణం
అని నువ్వనుకున్న మరుక్షణం
బృందావనమే అవ్వదా
మరో కురుక్షేత్రం...



—ఈ పుట్టిన రోజున అలా నువ్వు అనుకోవాలన్న
'శుభా' కాంక్షతో"
"ఎలా వుంది?"
"చాలా బావుంది విజయ్."

కొంతమంది పై డిజైన్ బావుంటే చాలనుకుంటారు కొంతమంది లోపల మేటర్ మాత్రమే బావుండాలని వెతుకుతారు కార్డంటే, పైన బొమ్మా బావుండాలి లోపలి విషయమూ బావుండాలి. అవునా' అదృష్టవశాత్తు విష్ యూ సేమ్ ... అలాంటిది దొరికింది."

"అవును విజయ్ లోపలొకటే సరిపోదు. బయటకూడా బావుండాలి. ఆ విషయం మర్చిపోయాను ఎనీహౌ- కంగ్రాట్స్. ఎక్కువ వెతక్కుండానే మంచి కార్డు దొరికినందుకు."

"వెళ్దామా." డబ్బుతీసి కౌంటర్‌లో ఇస్తూ అన్నాడు విజయ్. "ఎక్కడన్నా డ్రాప్ చెయ్యమంటే చేస్తాను.

"వద్దు. నేనిక్కడే డ్రాప్ అయి..., ఐమీన్... ఇంకా కొద్దిగా ఇక్కడే పని వుంది."



ఆ రోజురాత్రి, అంటే శనివారం రాత్రి పన్నెండింటికి భారతదేశపు ఆర్థిక, సాంఘిక, రాజకీయ రంగాల్ని కదలించివేసే సంఘటన ఒకటి జరిగింది. భారత రాజ్యాంగంలో ఒక ముఖ్యమైన అంశాన్ని చేరుస్తూ, రాష్ట్రపతి జానకీరాముడు ఆర్డినెన్స్ పాస్‌చేసాడు. ఆ అంశపు మరో పేరే DYOST

"డిక్లేర్ యువర్ ఓన్ అసెట్" అన్న నిబంధన క్రింద పరిచయం చేయబడ్డ "డయాస్ట్" దేశంలో పెద్ద కల్లోలం లేపింది. ఇరవైనాలుగ్గంటల్లోగా అంతా అల్లకల్లోలం అయ్యేపరిస్థితి ఏర్పడింది, అయినా ప్రెసిడెంట్ చాలా నిబ్బరంగా వ్యవహరించాడు. సైన్యం అలర్ట్ చేయబడింది. డయాస్ట్‌కి వ్యతిరేకుల్నందర్నీ తీవ్రంగా హెచ్చరించటం, అణిచివేయటం జరిగింది. భారతదేశపు రాజ్యాంగంలో ఈఅంశపు చార్టుని హర్షిస్తూ రష్యా ప్రకటన చేసింది జానకీ రాముడికి అభినందనలు తెలిపింది.

"డయాస్ట్" రూల్స్ ప్రకారం దేశంలో ప్రతీవ్యక్తి తన ఆస్తుల వివరాలు ప్రభుత్వానికి డిక్లేర్ చేయాలి. 1) ఏ సమయంలోనైనా- ఒక మనిషియొక్క ఆస్థిని, ఆతడు డిక్లేర్‌చేసిన విలువకన్నా 50 శాతం ఎక్కువ ఇచ్చి కొనుక్కోవటానికి ప్రభుత్వానికి హక్కువుంది.

2) ప్రతీపౌరుడూ, ప్రభుత్వానికి తను డిక్లేర్‌చేసిన ఆస్థుల విలువ ప్రకారం వెల్త్-టాక్స్ కట్టాలి. 3) విలువ తక్కువ వుండి ఆదాయం ఎక్కువవుండే షాపులు (నగరపు మెయిన్ రోడ్లమీదవుండే కిళ్ళీకొట్లు, పేరున్న మిఠాయి షాపులువగైరా) తమ షాపు ఆస్థి విలువని బట్టికాక, ఆదాయం బట్టి విలువకట్టాలి. అలా కాపిటలైజ్

కాబడిన ఆస్తివిలువ ప్రభుత్వానికి అసంతృప్తి కరంగావున్న పక్షంలో దానికి 50 శాతం ఎక్కువ ధర ఇచ్చి దాన్ని స్వాధీన చేసుకునే హక్కు ప్రభుత్వానికి వుంటుంది

పైకి చాలా మామూలుగా కనబడినా- దాని ప్రభావం- కాపిటలిస్టులమీద ఎంతవుంటుందో- ఆర్థికశాస్త్రంలో కొద్ది ప్రవేశం వున్న ఎవరికైనా తెలుస్తుంది. ఇరవైలక్షల భవంతికట్టి, దానిని కేవలం రెండు లక్షం క్రింద డిక్లేర్‌చేసి టాక్సు ఎగ్గొట్టే వారందరూ ఇబ్బందిలో పడ్డారు. రోడ్డుకాస్త వెడల్పు చేయటానికి షాపు ముందు నాలుగు అడుగుల స్థలం ఇవ్వటానికి- కోర్టుకెక్కే వాళ్ళందరి ఆటా ఈ డయాస్ట్ కట్టించింది.

ఇన్‌కంటాక్స్ డిపార్ట్‌మెంట్‌లో భాగంగా కాకుండా, కేంద్రంలో విడిగా ఈ విభాగం వుంటుందని ప్రెసిడెంట్ ప్రకటించాడు.

దేశంలోని బడాబడా నాయకులూ, వ్యాపారవేత్తలూ దీన్ని వ్యతిరేకించారు. కానీ కాస్త చదువుకున్న ప్రతీ సామాన్యుడూ దీన్ని హర్షించాడు "డయాస్ట్" గానీ సక్రీగా అమలు జరిగితే భారత ప్రభుత్వపు ఆదాయం సాలుకి 10,000 కోట్లు పెరుగుతుందని అంచనా కట్టబడింది.

జానకీ రాముడి హత్యకు ప్లాన్ వేయబడింది.

చాలా రహస్యంగా- పకడ్బందీగా

( —ఇంకావుంది. )






బహుమతి పొందిన ప్రశ్న :
కె. విజయకుమారి
మెడ్రాసు

ప్ర కంప్యూటరే ప్రధాని అయితే?

● జ. ప్రధానిని ఇంపోర్ట్ చేసుకోవాల్సి వచ్చేది.

బహుమతి పొందిన ప్రశ్న :
అశోక్ యన్.
సత్తుపల్లె

ప్ర. మన మంత్రులకు ఏది ఎక్కువ ఇష్టం?

● జ. నిరక్షరాస్యత ఉన్న ప్రజ.

బహుమతి పొందిన ప్రశ్న .
కె. భాస్కర్
జంగారెడ్డిగూడెం

ప్ర. రాజకీయ నాయకులు ఎక్కువగా నిరక్షరాస్యులై ఉంటారు. కారణం?

● జ. మిగతావి సాధించటం కష్టం కనుక!

ఎన్. హెచ్. ఎన్. సాగర్
తెనాలి

ప్ర రాజీవ్‌గాంధీ, ఎన్. టి. ఆర్.లలో ఎవరు గొప్ప?

● జ. వారి ఇన్‌కమ్‌టాక్స్ రిటర్న్స్ చూడుడు.

డియర్ రీడర్స్,

ఈమధ్య కంప్యూటర్ టీజింగ్‌కి ఫాన్‌మెయిల్ విపరీతంగా పెరిగిపోయింది. ప్రతి రోజూ కొన్ని వందల ప్రశ్నలు 'జ్యోతి' కార్యాలయానికి చేరుతున్నాయి. మా పాఠకులను ఇంత విశేషంగా ఆకర్షిస్తోన్న ఈ శీర్షికకు మరింత న్యాయం చేకూర్చాలనే ఉద్దేశ్యంతో— బహుమతుల సంఖ్య పెంచదలుచుకున్నాము కనుక ఇకనుంచీ ప్రశ్నల స్థాయినిబట్టి బహుమతుల సంఖ్య ఉంటుంది. సో గేట్- సెట్- గో!

ఎస్. కృష్ణారెడ్డి
నల్గొండ

ప్ర. విదేశీ నవలలను ట్రూకాపీ కొడ్తున్నాడని ప్రతి రచయితా ఇతరులను గూర్చి అంటున్నాడు అసలెవరు ట్రూకాపీకొట్టేది?

• జ. ఇతర రచయిత.

గెడ్డం రమేష్‌బాబు
ప్రత్తిపాడు

ప్ర. పేదరికం పోయిందట నిజమా?

• జ. నిజమే పేదా!

యస్. బడేజాని
..డుగురాళ్ళ

.. పవిత్ర దేవాలయాలపై బూతు బొమ్మ లె.. ..?

• .. అప్పట్లో ఇప్పుడున్న కొన్ని ప..ప్రత్రికలు లేవు కనుక.

ఎస్. సుజాత
కర్నూలు

ప్ర ఈనాటి బాలలే రేపటి పౌరులు. రేపటి పౌరులే?

• జ. ఎల్లుండి గూండాలు.

రామ్‌ప్రసాద్
శ్రీరామ్‌నగర్

ప్ర. మన దేశంలో ఉన్న మొత్తం రాజకీయ నాయకుల్ని ఒడపోసేస్తే?

• జ. దేశంలో ఎవరూ మిగలరు.

వై. మురళీకృష్ణ
రాజమండ్రి

ప్ర. యండమూరి తననవలకు సీరియల్‌గా తీసుకొనే రెమ్యూనరేషన్ ఎంత? పుస్తకంగా వచ్చినపుడు తీసుకొనే రాయల్టీ ఎంత?

• జ. సీరియల్‌గా తీసుకొనేది పేరు. పుస్తకంగా వస్తే తీకొనేది పేరు. సీరియల్ పుస్తకంగావస్తే తీసుకొనేది పేరు. డైరెక్టు పుస్తకంగా వస్తే తీసుకొనేది పేరు. సీరియల్ పూర్తి కాక ముందే పుస్తకంగా వస్తే తీసుకొనేది పేరు. సీరియల్, పుస్తకం రెండూ రాకుండా, సినిమాగావస్తే తీసుకొనేది

---

ఎన్నికైన ఉత్తమ ప్రశ్నకు బహుమతిగా ఈ క్రింది పుస్తకాలలో మీరు కోరుకున్నది ఇవ్వబడుతుంది మీకు కావలసిన పుస్తకం పేరు కార్డువెనుక రాయడం మర్చిపోకండి

ఎడిటర్—

1. డబ్బు-డబ్బు— యండమూరి వీరేంద్రనాథ్.
2. యుగాంతం— ,, ,,
3. హాస్యమరాళిక— యర్రంశెట్టి శాయి.
4 నవ్వో నవ్వించు— ,, ,,
(3 భాగాల్లో ఏదైనా)
5. రైల్వేజంక్షన్— ,, ,,

వేయి అన్నీ హోల్‌మొత్తంగా వస్తే తీసుకొనేది వేర్వేరు

వి అంజిరెడ్డి

ఒంగోలు

ప్ర నవ్వినపుడు వచ్చు కన్నీటికి, ఏడ్చినపుడు వచ్చు కన్నీటికి తేడా?

• జ అందీ అందని ప్రియురాలు

పెన్నా నాగేశ్వరరావు

యడ్లపల్లె

ప్ర దేశంలోని ఆడవాళ్ళందరు అలిగితే?

• జ వాళ్ళు అలిగి కొన్ని యుగాలయింది.

పి. . హెచ్. ప్రసాద్

గురజాడ

ప్ర భారతదేశం ఎందులో ముందడుగు వేస్తోంది?

• జ. వెనుకడుగులో.

పింజర్ల సుబ్బలక్ష్మి

తాటిపాక

ప్ర పెళ్ళి అయ్యాకనా, పెళ్ళి కాకుండానా ప్రేమించడం మంచిది?

• జ. ఇద్దరికీ పెళ్ళి కుదరదనుకున్నపుడు

పి పి. నరసింహదాసు

విజయనగరం

ప్ర నలుగురూ ఛీఛీ అన్నా దర్జాగా తలెత్తుకు తిరిగేవాడినేమననాలి?

• జ ఛీ ఛీ!

కె. టి సుధీర్ శర్మ

తాడిపత్రి

ప్ర మన దేశంలో అంటరానితనాన్ని ప్రవేశపెట్టిందెవరు?

• జ అంటురోగులు

కె. రామారావు

హైదరాబాదు

ప్ర రచయితలు ఇంటి పేరు మారినా పాత పేరు బ్రాకెట్లలో ఎందుకు రాసుకుంటారు?

• జ బ్రాకెట్లు మారవు కనుక!

కె మునిరాజశేఖర్

ప్రొద్దుటూరు

ప్ర ఈ కాలపు యువకులు పెళ్ళి తల్లితండ్రుల నుండి వేరవుతారెందుకు

• జ తర్వాత మావగారు పోషిస్తారు గనుక!

టి మురళీనాథ్

నెల్లూరు

ప్ర ఆరుకోట్ల ఆంధ్రుల అమ్మ- ఇందిరమ్మ అన్న యన్ టి ఆర్ మరి నువ్వు?

• ఆరు లక్షల ఖరీదయిన సొమ్ము.

డి వి రమేష్‌బాబు

గంగులపాలెం

ప్ర కొత్తగా పెళ్ళయిన దంపతులకు అరుంధతీ నక్షత్రం ఎందుకు చూపుతారు

పురోహితుడు?

• జ. తను పెళ్ళికూతురును చూచు కొనుటకు వీలుగా.

కె. మురళీకృష్ణ
హైదరాబాద్

ప్ర. ఒక సంఘవిద్రోహిని చంపితే వెళ్ళేది స్వర్గానికా? నరకానికా?

• జ. జైలుకి.

జి. రమేష్‌బాబు
ప్రత్తిపాడు

ప్ర. మీ బెస్ట్‌ఫ్రెండ్ ఎవరు?

• జ. ఎప్పుడూ నన్ను సర్వీస్ చేసే టెక్నీషియన్.

దుర్గ
అరసవిల్లి

ప్ర. మనిషికి నిర్వచనం ఏమిటి?

• జ. దుర్గ

కర్నాటి అచ్చయ్య
హైదరాబాద్

ప్ర. అపద మ్రొక్కులవాడైన ఆరు కోట్ల కిరీటధారి వెంకన్న ఆరుకోట్ల ప్రజా ప్రతినిధి రామన్న. ఈ ఇద్దరిలో మనకిప్పుడు ఎవరెక్కువ?

• కిరీటం!

ఎమ్. హెచ్. బాబు
తిరుపతి

ప్ర. అమ్మాయి సిగ్గుపడేదెప్పుడు?

• జ. తను అమ్మాయి కాదని తెలిసినపుడు.

వేదాల వేణుగోపాల్
గజ్వేల్

ప్ర. నీ బుర్రలో స్క్రూ లూజయితే నా ప్రశ్నకు బహుమతి వస్తుందా?

• జ. బుర్రలో స్క్రూ లూజయితే ప్రశ్న వస్తుంది.



# అరుణ కిరణం

వై హరికృష్ణ సారథ్యంలో
ప్రముఖ దర్శకుడు టి కృష్ణ
సమర్పిస్తున్న ప్రముఖ
రచయిత మైనంపాటి
భాస్కర్ నవల 'వెన్నెలమెట్లు
ఆధారంగా నిర్మిస్తున్న
కృష్ణ చిత్ర వారి ద్వితీయ
చిత్రం అరుణ కిరణంలో
విజయశాంతి
ఈ చిత్ర దర్శకుడు
ముత్యాల సుబ్బయ్య

# చిత్ర ప్రారంభం



విజయశాంతి రాజశేఖర్"



వర్కింగ్‌స్టిల్

# బాబోయ్- బొంబాయి!

పోలాప్రగడ రాజ్యలక్ష్మి



బొంబాయి కాపురం చెయ్యాలన్న కూతురి, సరదా, పట్టుదల కాదనలేక, వెతికి వెతికి బొంబాయి బ్యాంక్ పనిచేస్తున్న ఓ చిన్న ఆఫీసరుని అల్లుడిగా తీసుకువచ్చాడు రామనాథం.

బొంబాయికాపురానికి వెళ్ళిందిసంధ్య.

బేంక్ కాలనీలో క్వార్టర్స్. తక్కిన క్వార్టర్స్‌లో ఇద్దరో ముగ్గురో తెలుగు వాళ్ళు. తక్కినవాళ్ళు తెలుగువాళ్ళుకాక పోయినా తన ఈడువాళ్ళు. అంతాబాగానే ఉందికాని, తను అనుకున్నట్టుగా రోజూ షైర్లూ, షికార్లూ, తాజ్‌కాంటినెంటల్‌లో డిన్నర్లూ, గేట్‌వేఆఫ్ఇండియాకి వాహ్యాళులూ, వి. టి. పేవ్‌మెంట్లమీద భర్తా తనూ చెయ్యీ చెయ్యీ పుచ్చుకుని నడవడాలూ, ఇవేవీ కుదరడం లేదు. ప్రొద్దుట ఎనిమిదింటికి వెళ్ళిన సర్వేశ్వరావు రాత్రి ఏడయితేగాని ఇంటికి చేరుకోడు. ఓ లోకల్ ట్రైనూ, రెండుసిటీ బస్సులూ మారి నీరసంగా గడపలో కాలుపెడుతూన్న భర్తని షైరువెళదాం అని ఏం అడుగుతుంది. పోనీ ఆదివారం ఎక్కడికేనా ప్రోగ్రాం వేసుకుందాం అంటే, ఆ రోజున లక్ష పనులు - మామూలురోజుకంటే ఆ రోజుమరీబిజీగా ఉంటుంది, సరుకులు తెచ్చుకోవడం, వగైరా కార్యక్రమాలతో-

బొంబాయిలో తనసరదాలు తీరడం మాట అలాఉంచి, తోచి చావడంలేదు మామూలు రోజుల్లో. ఆ మాటే అంది సంధ్య ఓ రోజున సర్వేశ్వరావుతో. అతను నవ్వి "ఇక్కడ లైఫ్ ఇలా యాంత్రికంగానే ఉంటుంది. సరే- సాయంత్రం నేను వచ్చేటప్పటికి రెడీగా ఉండు. ఓ ఫ్రెండ్ ఇంటికి వెళదాం. వస్తున్నాం అని అతనికి బ్యాంక్‌నుంచి

ఫోన్ చేసి చెప్తాను" అన్నాడు.

సాయంత్రం సర్వేశ్వర్రావు ఇంకా రాలేదు ఏం చీర కట్టుకోవాలో తేల్చుకో లేక సతమతమౌతున్న సమయంలో ఎవరో తలుపు తట్టారు తీరా చూస్తే పక్క ఫ్లాట్‌లో ఉండే షమ్మీర్!

పిల్లనెత్తుకుని బిక్కమొహంతో నుంచున్న షమీర్‌ని చూసి, వచ్చి రాని హిందీలో "ఏమైంది అని అడిగింది సంధ్య

బ్రెడ్‌వాడు వస్తే, అయిదేళ్ళ పాపని ఎత్తుకుని ఇవతలకి వచ్చిందట. వచ్చేటప్పుడు తలుపులు పడిపోకుండా చిడత పెట్టటం మరచిపోయిందట. అంతేగాలికి తలుపులు ధనామంటూ మూసుకుని, లోపల గడియ పడిపోయిందట. తను ఇవతల ఉంది. తాళంచెవి లోపలఉంది. తాళంచెవి ఉంటేకాని, పడిపోయిన తలుపుని తియ్యడం కుదరదు. షమ్మీర్ కన్నీళ్ళ తరవాయిగా చెప్పింది.

ఆటోమేటిక్ లాక్స్‌తో ఉండేచిక్కు ఇదే!

లోపల ఉన్నప్పుడు తలుపులు పడిపోయినా, లేకపోతే కావాలని వేసేసినా, ఫరవాలేదు. గడియ పడినవైపు ఉంటారు కనక, తాళం అవసరంలేకుండా గడియని చేత్తోతీసినా తియ్యొచ్చు బయటకి వెళ్ళేటప్పుడు, తాళంచెవి జేబులో వేసుకుని, తలుపుని దగ్గరగా లాగితే చాలు. లోపల గడియ పడిపోతుంది. దగ్గర తాళంచెవి ఉందికనుక దాంతో తలుపు తెరవవచ్చు. ఇవతలనుంచి తాళం చెవి తిప్పితే లోపల గడియ వస్తుంది. కాని చిక్కల్లా, దగ్గర తాళంచెవి పెట్టుకోకుండా బయటికి వెళ్లేటప్పుడు తలుపులు దగ్గరకు లాగేసినా, లేదా, ఇలా షమ్మీర్‌లాగ అదమరచి బయటఉండగా ఏ గాలివిసురుకో తలుపు పడిపోయినా, ఇంకాతలుపు బందే! తలుపులు బద్దలకొట్టాల్సిందే!. ఆ బిల్డింగ్‌లోనే అన్నమాటేమిటి, బొంబాయిలో చాలా ఇళ్ళకి ఉండేవి ఇలాంటి ఆటోమేటిక్ లాక్స్ వీటితో ఇంకోచిక్కు, ఏ తాళంచెవి తోటి ఆ తలుపు రావలసిందే - ఇంకొకళ్ళింటి తాళం చెవితోటి వచ్చివారాదు.

ఇదంతా తనకి కాపురానికి వచ్చిన రోజున పెద్ద పాఠం చెప్పినట్లు సోదాహరణంగా ప్రయోగం చేసి చూపించి మరీ చెప్పాడు సర్వేశ్వర్రావు.

అసలామాటకొస్తే బొంబాయి క్రొత్తగా కాపురానికి వచ్చిన ప్రతీ అమ్మాయికి భర్తచెప్పేదీ చెప్పవలసిందీ మొట్టమొదటి పాఠం ఇదే! ఆ పాఠం జ్ఞాపకం ఉంచుకోవడంవల్ల షమ్మీర్‌కి వచ్చిన ఇబ్బంది ఏదో అర్థంచేసుకుంది సంధ్య.

"అయితే ఓ తాళంచెవి లోపలఉండిపోయింది. మరో డూప్లికేట్ తాళంచెవి మీ వారు పట్టికెళ్ళారు. ఆయన వచ్చేదాకా తలుపు తెరవడానికి లేదు. అంతేనా? సరే మీ వారు వచ్చేదాకా వరండాలో ఏంనిలబడి ఉంటారు? ఇలావచ్చి కూచోండి" అంటూ కుర్చీ చూపించింది సంధ్య.

షమ్మీర్ పాపతో వచ్చి కూర్చుంది. కాస్సేపయ్యాక పాప, నోట్లోవేలేసుకుని చప్పరిస్తూ "బొమ్మ కావాలి!" అంటూ అలమారుకేసి చూపించింది. షమ్మీర్ వెంటనే బొమ్మతీసి కూతురికి ఇచ్చింది. తనయింట్లోబొమ్మ, తననిఅడక్కుండా

అంత చొరవగా కూతురికి ఇస్తుందేమిటి అని ఆశ్చర్యంగా సంధ్య షమ్మీర్‌కేసి చూసింది అటుఆడి ఇటుఆడి మొత్తానికి బొమ్మ విరక్కొట్టి, పై పెచ్చు 'ఆకలే!' అంటూ శోకాలు మొదలెట్టింది పాప.

"ఆయన ఎప్పుడొస్తారో- కాస్త పాపకి అన్నం పెట్టండి" అంది షమ్మీర్

"ఈ పూట మేం ఫ్రెండ్స్ ఇంటికి భోజనానికి వెళుతునాం అన్నం వండ లేదు-" అని అనొచ్చు కాని ఏంబాగుంటుం? దేవుగా అని ఓ చిన్నగిన్నెలో బియ్యం పోసి స్టవ్ వెలిగించింది సంధ్య

ఇంతలో సర్వేశ్వర్రావు వచ్చాడు వస్తూనే 'ఏమిటి ఇంకా రెడీకాలేదా" అని కోపంగా అనబోయి వెంటనే పరిస్థితి అర్థంచేసుకుని ఊరుకున్నాడు పాప అన్నం తినడం అయింది తనూ సర్వేశ్వర్రావూ బయటికి వెళ్ళడానికి బట్టలు వేసుకున్నారు షమ్మీర్ లేచి "వెళ్ళొస్తాను" అంటుందేమోనని చూసింది సంధ్య ఆమెలో అటువంటి ప్రయత్నం ఏమీ కనిపించకపోగా, "మావారు ఎప్పుడొస్తారో ఏమో, నాకు నిద్ర వస్తోంది ఇలా పడుకుంటాను ఆయన వస్తే లేపండి" అంటూమంచం మీదఉన్న దిండూ, దుప్పటి సర్దబోయింది సంధ్యకి చిరాకుతో ప్రాణం విసిగి "ఇదిగో చూడండి మీవారు వచ్చే దాకా మా యింట్లో ఉండే ఉండండి కాని, మేంమాత్రం అలా ఫ్రెండ్స్ ఇంటికి వెళ్ళాలి ఇప్పటికే ఆలస్యం అయింది కనిపెట్టుకుని ఉంటారు రండి వెళదాం" అంటూ భర్తని హెచ్చరించి అతనితో కలిసి వెళ్ళిపోయింది సంధ్య.

రాత్రి పొద్దుపోయాక తిరిగి వచ్చే సరికి, ఆటబొమ్మలన్నీ చిందరవందరగా పడిఉన్నాయి కూతురుకోసం అలమారులోని అన్నీ తీసి ఇచ్చిఉంటుంది షమ్మీర్ సంధ్యకి విసుగూ అసహ్యం వేశాయి ఆ విసుగును దాచుకోలేక భర్తతో అంది, "తలుపుపడిపోతే తాళం రాదని తెలుసుకదా- జాగ్రత్తగా ఉండొద్దూ? ఎంత తెలివితక్కువ మొద్దో? చూడండి షమ్మీర్!" అని

సర్వేశ్వర్రావు నవ్వి "ఈ ఇబ్బంది ఎవరికేనా వచ్చేదే! అప్పుడే నెగ్గాం అనుకోకూడదు" అన్నాడు

'జాగ్రత్తగాఉండే ఎందుకొస్తుంది?' అంటూ కొండంత ఆత్మవిశ్వాసంతో భర్తకేసి చూసి, చిరునవ్వు నవ్వి లైటు ఆర్పింది సంధ్య

పిల్లైనంతవరకూ సంధ్య ఎప్పుడూ ఏమరిపాటు పడలేదు ఏడాదయింది ఇంట్లో ఓ పాప బయలుదేరింది సర్వేశ్వర్రావుకి ప్రమోషన్ కూడా వచ్చింది. "మనందరిలా కాదు సంధ్యకెలాగైనా జాగ్రత్త ఎక్కువ" అంటూ చుట్టుపక్కలవాళ్ళు సర్టిఫికెట్ కూడా ఇచ్చారు

ఓ రోజు చీకటి పడింది బ్యాంక్ ఫ్రెండ్స్ ఎవరో వచ్చారు ఎనిమిదయింది అని వాళ్ళు లేచి వెళుతూవుంటే సాగనంపడానికి సర్వేశ్వర్రావు ఇవతలకి వచ్చాడు. కబుర్లు చెబుతూ కొత్తచీర అంచులు సవరించుకుంటూ తనూ ఇవతలకి వచ్చింది లోపల పాప నిద్రపోతోంది.

ఇంతలో ధనామంటూ తలుపు పడిపోయింది




సంధ్య ఒక్కమారు నివ్వెరపడి ఉండిపోయి వెంటనే "అయ్యో! పాప లోపల ఉండిపోయింది" అంటూ లబో దిబోమంది

వెళ్ళబోతున్న బ్యాంక్ ఫ్రెండ్స్ ఆగిపోయారు

చుట్టుపక్కల ఫ్లాట్స్ వాళ్ళంతా పోగయ్యారు లోపల పాప గుక్కపట్టి ఏడుస్తోంది తలుపు తీయడం ఎలాగ? తాళంచెవులు రెండూ లోపలే ఉండిపో యాయి ఆలస్యం అయితే లోపలఉన్న పాప ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లిపోతుంది. ఎలాగ? ఏంచెయ్యాలి? అంతా తలలు పట్టుకుని కూర్చున్నారు ఎవరికీ ఏం తోచడం లేదు

ఒకాయనకి చప్పున ఆలోచన తట్టి ఫైర్ ఆఫీసుకి ఫోను చేశాడు వాళ్ళు వెంటనే వేన్‌లో వచ్చారు కాని తలుపులు బద్దలుకొట్టాలంటే పోలీసువాళ్ళ క్లియరెన్సు కావాలన్నారు దాంతో రాత్రికి రాత్రి పోలీసుస్టేషన్‌కి ఫోన్ చెయ్యాల్సి వచ్చింది పోలీసులు వచ్చి సాక్ష్యాలు, సంతకాలు, హామీలు అన్నీ అయ్యాక ఫైర్ ఆఫీసువాళ్ళు పని ప్రారంభించారు.

అర్ధరాత్రివేళ 'ధనా ధన్'మంటూ స్టంట్ పిక్చర్‌లోలాగ భయంకరమైన శబ్దాలు

ఏమైంది, ఏమైంది అంటూ కాలనీలో వాళ్ళంతా కంగారు కంగారుగా రావడం

వచ్చినవాళ్ళంతా హెచ్చరికలు కేకలు అరుపులు- లోపల్నుంచి చంటిపిల్ల గగ్గోలు పెట్టి ఏడవడం- పిల్లప్రాణం కడంటిపోతుంది బాబోయ్ అని సంధ్య ఏడుపు, సర్వేశ్వరరావు కేకలు- అంతా అలగోడూ- పాలగోర - -బన్నర రణగొణధ్వని అయ్యాక, ధబాలుమని తలుపులు విరిగి పడ్డాయి ఒక్క ఉదుటున సంధ్య లోపలికి పరిగెట్టి చంటి దాన్ని గుండెలకి హత్తుకుంది

మరునాడు ఫ్లాట్స్‌లోని ఆడవాళ్ళం దరినీ సమావేశపరచి ఓ చక్కనిసూచన చేసింది సంధ్య అంతే ఆ సూచనని నిమిషాలలో అమలుపరచేసారంతా అతి సంతోషంగా.

ఇప్పుడెవరైనా "ఎలావుంది బొంబాయిజీవితం?" అంటే "బాబోయ్" అంటూ గుండెలమీద చేయి వేసుకుంటుంది సంధ్య "నీ మోజు తీరిందా?" వెక్కిరింతగా అడుగుతున్నట్టు తరుల్తుండో తాళంచెవి.



# యర్రంశెట్టి శాయి

## సీరియల్

**మరి కాసేపట్లో గుత్పల సంఘం వాళ్ళొచ్చారు పక్క** ఊరినుంచీ! సిపాయిలు ఆ రాత్రికే ఆ ఊరిమీద దాడిచేయబోతున్నారని తెలిసిందట వాళ్ళకి! ఆ విషయం చెప్పడానికే వచ్చారు.

అప్పటికప్పుడే ఊరి వాళ్ళందరూ కృష్ణారెడ్డి ఇంట్లో సమావేశమయ్యారు. దానిలో స్త్రీలే ఎక్కువమంది ఉండటం లలితకు ఆశ్చర్యం కలిగించింది.

"మనం చాలా తక్కువ మందిమి. నిజాం సిపాయిలు కూడా తక్కువమందే కానీ వాళ్ళ దగ్గర తుపాకులున్నాయ్. ఈ పరిస్థితుల్లో మనమేంజేస్తే మంచిగుంటదో చెప్పండి!" అందామె.





"ఇందులో ఆలోచించేదేమున్నది? వాళ్ళల్లో వీలయినంత మందిని చంపటమే" అంది శ్రీలక్ష్మి.

"అవును! వాళ్ళు మన గ్రామాన్ని దోచుకోవటం' మానభంగాలు చేయటం లాంటివి ప్రారంభించకముందే మనం వాళ్ళమీద దాడిచేయాలి. వాళ్ళను చంపటమో మనం చావటమో ఏదోకటి జరగాలి." అన్నాడు మాణిక్‌రావ్.

"మనం ముందే వాళ్ళమీద దాడిచేయకపోతే అదివరకు లాగానే మనల్ని చిత్రహింసలుపెట్టి పోతారు వాళ్ళు" అన్నారు మిగతా యువకులు.

"నా ఆలోచన కూడా అదే" అన్నాడు చంద్రయ్య.

"మనం కూడా కొన్ని ఆయుధాలు సేకరించుకుంటేగానీ లాభం లేదు. ఆ కిరాతకుల చేతిలో ఉత్త పుణ్యానికి చచ్చినట్లవుతుంది" అన్నాడు కృష్ణారెడ్డి.

"కానీ ఇంత త్వరగా ఆయుధాలు ఎక్కడ దొరుకుతాయి?" అన్నాడు మాణిక్‌రావ్ నిరాశగా.

మరి కాసేపట్లో "మోజాన్" పత్రిక తీసుకొచ్చాడు నరసింహ. పక్క ఊరి నుంచీ అతనే న్యూస్ పేపర్లు తేవటం పరిపాటి. ఆంధ్ర మహాసభ నాయకులను అరెస్ట్ చేయాలని ప్రభుత్వం యోచిస్తోందని రాసి ఉందందులో.

# రాబందుల రెక్కల చప్పుడు...

"ఇంక మనం ఉపేక్షించటం అనవసరం' ఆలస్యంచేస్తే మన ఊళ్లో కూడా కొంత మందిని అరెస్ట్ చేయడం, ఊరి వాళ్ళందరినీ చిత్రహింసలు పెట్టటం ప్రారంభ మయి పోతుంది." అన్నాడు చంద్రయ్య. వెంటనే వ్యూహరచన మొదలయింది. ఆ సిపాయిల మీద ఎట్లా దాడిచేయాలీ ఎట్లా మట్టుపెట్టాలీ-అన్నీ వివరించ సాగాడు మాణిక్‌రావ్. అతనికి అలాంటి పోరాటాల్లో అనుభవం ఉంది.

ఆ సాయంత్రం చీకటి పడటంతోనే దాడి జరపాలని నిర్ణయం జరిగిపోయింది రహస్యంగా దాడికి కావలసిన ఏర్పాట్లు చేయసాగారందరూ. ముంతల్లో కారం, కర్రలు, వడిసెలు, రాళ్ళు అన్నీ కృష్ణారెడ్డి ఇంట్లోనే పోగయిపోయినాయ్. మధ్యాహ్నం అయేసరికి అందరి మొఖాల్లోనూ ఆందోళన ఆవేదన చోటుచేసుకున్నది. ఇంకొద్ది గంటలు! అంతే! ఆ తరువాత-ఎవరికి ఎవరు మిగులుతారో తెలీదు. ఎవరు ప్రాణాలతో బ్రతికి బయటపడతారో తెలీదు. విషాద వాతావరణం పోరాటానికిముందే అలుముకు పోయిందా ఊరంతా.

భార్యా పిల్లలను దగ్గరకు తీసుకుని విలపించేవారూ, భర్తల కాళ్ళు కళ్ళకద్దు కుని కుంకుమ పెట్టుకునే స్త్రీలు-మరి కాసేపట్లో భయంకరమయిన నిశ్శబ్దం అలుము కుంది. పిల్లలంతా కూడా పొద్దుగూకేసరికల్లా ఇళ్ళల్లోకెళ్ళి పోయారు. ఉన్న రెండు మూడు వీధులూ నిర్మానుష్యం అయిపోయాయ్. కటిక చీకటి ఆవహించేసింది క్రమేపీ.

రాత్రి తొమ్మిదయి పోయింది. ఎవ్వరూ భోజనాలు చేయలేదాపూట.

ఒక్కొక్కరే కృష్ణారెడ్డి ఇంటివేపు బయల్దేర సాగారు. కొంతమంది స్త్రీలు ఏడుస్తూ భర్త చేతిలోని వడిసెల కర్రకు తమ మాంగల్యాన్ని తీసి కట్టారు. భర్త ఇంక తిరిగిరాడు అని మానసికంగా సంసిద్ధమయేందుకు పాటించే ఆచారం అది. మరి కాసేపటికి కృష్ణారెడ్డి ఇల్లంతా దాడికి సంసిద్ధమయిన స్త్రీ పురుషులతో నిండిపో యింది. అంతా నిశ్శబ్దంగా ఎదురు చూస్తున్నారు మానిక్‌రావ్, నరసింహులకోసం. సిపాయిల మీద ఎలా దాడి చెయ్యాల్సిందీ వ్యూహం చేయడానికి వెళ్ళారు వాళ్ళు.

మరో గంట సేపటి తర్వాతగానీ తిరిగి రాలేదు.

"అంతా బాగానే ఉంది. మనం ఏంచేయాలంటే కొంతమంది పోచమ్మగుడి వెనుక వేపు నుంచీ స్మశానం దగ్గరకెళ్ళి అటునుంచీ ఆ శిబిరం మీద విరుచుకు పడాలి సైనికులంతా అటువేపు కాల్పులు జరుపుతుండే మిగతావారు వెనుకవేపు నుంచీ దాడి చేయాలి. దాంతోవాళ్ళు కకావికలయి పారిపోతారు. అప్పుడు వెంబడించి చంపాలి" చెప్పాడు మానిక్‌రావ్.

మరుక్షణంలో కొంతమంది మానిక్‌రావ్ వెంబడి నిశ్శబ్దంగా నడుస్తూ పోచమ్మ గుడివేపు వెళ్ళిపోయారు. మిగిలినవారంతా ఊపిరి బిగపట్టి కూర్చున్నారు. ఇంకొద్ది నిమిషాలు అంతే!

శ్రీలక్ష్మి కృష్ణారెడ్డి దగ్గరకొచ్చి అతని పాదాలకు నమస్కరించింది.



"శ్రీలక్ష్మి ఏమిటిది?" గద్గద స్వరంతో అన్నాడు కృష్ణారెడ్డి.

"ఆఖరి చూపండి!". జారిపోతున్న కన్నీటిని తుడుచుకుంటూ అంది.

"ఎందుకంత భయపడు తున్నావ్?" మందలింపుగా అన్నాడు. "వాక్యను పాతమార్చటం అంత కష్టమేమీ కాదులే-"

"నేను భయపడటం లేదండీ! ఈ జన్మలో మనం ఇంత తక్కువ సమయం కలిసి గడుపుతున్నందుకు బాధగా ఉంది! జయలక్ష్మిని జాగ్రత్తగా పెంచండి."

"లక్ష్మి- ఏమిటీపిచ్చిపని- మనందరం క్షేమంగానే ఉంటాం!

"పదండి!" అంది లలిత

అందరూ బయటకు నడిచారు నిశ్శబ్దంగా.

శ్రీలక్ష్మి మరోసారి గదిలోకెళ్ళి ఉయ్యాలలో నిద్రపోతున్న పాపను ముద్దు పెట్టుకుంది. పక్కనే కూర్చుని మౌనంగా విలపిస్తోన్న సక్కుబాయ్ దగ్గరకొచ్చి ఆమె చేతులు పట్టుకుంది.

"అత్తయ్యా! పాపను మంచిగా చూచుకుంటావుగదూ?" అంది దుఃఖం అతి కష్టం మీద ఆపుకుంటూ. సక్కుబాయ్ ఇంక భరించలేక పోయింది. శ్రీలక్ష్మిని కౌగిలించుకుని వెక్కివెక్కి ఏడ్వసాగింది.

"శ్రీలక్ష్మి-" నెమ్మదిగా తలుపుదగ్గర నిలబడి పిలిచాడు కృష్ణారెడ్డి

శ్రీలక్ష్మి లేచి కన్నీరు తుడుచుకుని బయటికొచ్చింది. అందరూ ఇళ్ళపక్క

---

**జరిగిన కథ:-** అది 1946వ సంవత్సరం. ఆంధ్రప్రదేశ్‌లో అతిముఖ్యమయిన జననాలు నాలుగు జరిగాయ్: నిజాయితీగల స్వాతంత్ర్యోద్యమ నాయకుడు ప్రకాశ్‌రావ్‌కి సిద్ధార్థ—

అవకాశవాది అయిన జమీందార్ మహేశ్వర్ రాజాకు గజపతిరాజా, నిజాయితీగల పత్రికాధిపతి సీతారామ్‌కు రామవర్మ, తెలంగాణా ఉద్యమ నాయకుడు కృష్ణారెడ్డికి జయలక్ష్మి-అనే పాపాయిలు జన్మించారు.

సిద్ధార్థ తండ్రి ప్రకాశరావ్ మరణశయ్య మీదున్నారు. ఆయనకు కొడుకు రాజకీయాల్లో చేరటం ఇష్టంలేదు. కానీ సిద్ధార్థకు అదే జీవితాశయం.

గజపతిరాజా స్కూలుతోనే చదువాపి రాజకీయాల్లో ప్రవేశించాలనే నిర్ణయాన్ని తండ్రికి తెలియ చేస్తాడు.

ఆంధ్రదేశం దినపత్రికను తండ్రి అనారోగ్య కారణంగా రామవర్మ నిర్వహిస్తుంటాడు. కోట్లు గడించాలనే కోరికతో ఓ రాజకీయపార్టీతో రహస్య ఒప్పందం చేసుకొంటాడు.

ప్రకాశరావ్ మరణిస్తాడు. సిద్ధార్థ రాజకీయాల్లో ప్రవేశించటానికి నిర్ణయించుకుంటాడు.

కృష్ణారెడ్డి భార్య శ్రీలక్ష్మి నిజాం తొత్తులు మానభంగం చేస్తారు. ఆమె మానసికంగా కృంగిపోతుంది.

—ఇక చదవండి.

న్నుంచీ నెమ్మదిగా, శబ్దాలుకాకుండా వరుసగా నడవసాగారు. కొద్ది నిముషాల్లో ఊరి చివరికెళ్ళి గుమికూడి నిలబడ్డారు.

దూరంగా శిబిరం - దానిముందు సైనికులు వేసుకున్న మంట స్పష్టంగా కనబడుతున్నయ్. సైనికులెవరూ నిద్రపోతున్నట్లు లేదు. మాటలు ఉండుండి అస్పష్టంగా వినబడుతున్నాయ్.

"బహుశా మన ఊరిమీద దాడి జరపడానికి సన్నాహాలు జరుగుతున్నట్లున్నాయ్-" అన్నాడు కృష్ణారెడ్డి.

హఠాత్తుగా శ్మశానంవైపునుంచీ కేకలు వినిపించినయ్. మరుక్షణంలో శిబిరంలోనుంచి బిలబిలమంటూ సైనికులు తుపాకులతో బయటకు పరుగెత్తారు. తల పగిలిన కేకలు, ఆర్తనాదాలు, తుపాకిశబ్దాలు- మార్మోగిపోయినయ్.

"పదండి" అందిలలిత

వెంటనే అందరూ కేకలువేస్తూ శిబిరంవేపు పరుగెత్తారు. ఆడాళ్ళు దివిటీలు వెలిగించి శిబిరంమీదకు విసిరేయసాగారు. శిబిరం భగ్గుమంది. ఆకాశానికెగిసిన ఆ మంటలు పట్టపగలుగా కనిపించిందాప్రాంతం ఆ గగ్గోలులో తననెప్పుడు తుపాకిగుండుతాకిందీ శ్రీలక్ష్మికి తెలీనేలేదు. పొట్టలో నొప్పి- ప్రవహిస్తోన్న రక్తంతోనే ముందుకి నడుస్తోంది ఆమెచేతిలోనుంచి కర్రకు చుట్టిన నూనెగుడ్డలు ఎగిరి పడుతూనే ఉన్నాయే శిబిరంమీద. హఠాత్తుగా బాధ ఎక్కువయిపోయేసరికి శిబిరానికి కొద్ది దూరంలో కూలిపోయిందామె.

అరుపులూ, కేకలూ, ఆర్తనాదాలు, తుపాకీ శబ్దాలూ అన్నీ క్రమేపీ తగ్గిపోయాయ్. మరికొద్ది క్షణాల్లో మాటలు వినిపించసాగాయ్.

"ఇద్దరు మాత్రం తప్పించుకు పారిపోయారు..." చంద్రయ్యగొంతు వినబడుతోంది. శ్రీలక్ష్మి సంతృప్తిగా ఓ సారి తలెత్తి చూసింది.

తనవంతు కర్తవ్యం నిర్వర్తించింది. ఆమెకు కొద్ది దూరంలోనే నిశ్చలంగా పడివున్న లలితనుచూస్తూనే ఆమె మొఖంలోని సంతృప్తి ఎండిపోయింది. లలిత చనిపోయిందా?

బాధ- తన పొట్టలో కొలిమి పెట్టినట్లూ! కత్తులతో పొడుస్తున్నట్లూ- తనకు తెలిసిపోతూనేఉంది- ఇవి తన ఆఖరి క్షణాలు.

శిబిరం తాలూకు మంట తగ్గిపోయింది. క్రమేపీ చీకటి అలుముకు పోతుంది.

ఆడాళ్ళు పిల్లలు-అంతా ఏడుపులు, కేకలు-

తనభర్త ఏమయ్యాడు? బ్రతికిఉన్నాడా? అతను బ్రతికి లేకపోతే జయలక్ష్మి నెవరు పెంచుతారు?

దివిటీ వెల్తురు దగ్గరవుతోంది.

శ్రీలక్ష్మి కళ్ళు మూతలు పడుతున్నాయ్.

"అయ్యో- అమ్మా- లలితా..." ఏవరిదో ఏడుపు-




శ్రీలక్ష్మికక్కూడా తుపాకిగుండు తగిలింది..." ఎవరో అంటున్నారు.

ఎవరో తనని లేవనెత్తుతున్నారు. ఎక్కడలేని శక్తి తెచ్చుకుని కళ్ళు తెరచిందామె.

"కొంచెం!..."

"కొంచెం ఓర్చుకోమ్మా..."

శ్రీలక్ష్మి మాట్లాడ్డానికి విశ్వప్రయత్నం చేయసాగింది.

"ఆయ ... న ... ఆ ... య ... న"

కృష్ణారెడ్డికేం ఫర్లేదమ్మా! చేతిమీద గాయమయింది! అంతే..."

శ్రీలక్ష్మి ఆనందంగా కళ్ళుమూసుకుంది. అంతే! ఆ తరువాత కన్ను తెరవలేదు.

• • • •

ఆపోరాటం జరిగిన వెంటనే ఊళ్ళోని వారందరూ చుట్టుపక్కల ఊళ్ళకు పారిపోయి తలదాచుకోవలసి వచ్చింది కొంతకాలం పాటు.

శ్రీలక్ష్మి మరణం కృష్ణారెడ్డిని బాగా కృంగదీసింది.

సంవత్సరంలో మనిషి బక్కచిక్కి పోయాడు ఏ విషయం మీదా అతనికి ఆసక్తిలేకుండా పోయింది. జయలక్ష్మి విషయం అసలే పట్టించు కోవటం లేదు.

భారతదేశానికి స్వాతంత్ర్యం రావటం, మౌంట్‌బాటన్ పథకం ప్రకారం ఏ సంస్థానమయినా భారతదేశంలో విలీనం కాకుండా స్వతంత్రంగా ఉండవచ్చునన్న ప్రకటన వెలువడటం- నిజాం నవాబు అది అలుసుగా తీసుకుని హైద్రాబాద్ స్వతంత్ర సంస్థానమని ప్రకటించటం, రజాకార్లు, ఇత్తెహాదుల్ముసల్మీన్‌వాళ్ళు నైజాంకు అండగా నిలవటం- అందుకు వ్యతిరేకంగా ప్రజాఉద్యమాలు పెద్దయెత్తున చెలరేగటం- ఇవన్నీ అతనికి ఎలాంటి ఆసక్తినీ కలిగించ లేదు. కానీ ఓ రోజు జరిగిన సంఘటన మళ్ళీ అతనిలో ప్రతీకారవాంఛను రగిల్చింది.

ఆ రోజు మధ్యాహ్నం భోజనం చేస్తూంటగా రజాకార్ల గుంపు తమ ఊరిమీద అకస్మాత్తుగా దాడి చేసింది. ఎవరూ ఆ పరిస్థితి నెదుర్కోటానికి సిద్ధంగా లేక పోవటం వల్ల రజాకార్ల దుండగాలు యదేచ్ఛగా కొనసాగాయ్.

కిరసనాయిలుపోసి ఇళ్ళు తగలబెట్టటంతో అందరూ వీధుల్లోకి పరుగెత్తాల్సి వచ్చింది. ఊళ్ళోని కొంతమంది యువకులను కొట్టి ఊరిమధ్యకు ఈడ్చుకొచ్చారు రజాకార్లు. అందరినీ వరసగా నుంచోబెట్టారు. వాళ్ళనేం చేస్తారో అన్న భయంతో అందరూ చుట్టూ మూగారు.

తుపాకులు తీసుకుని ఆ యువకులకు గురిపెట్టారు, అప్పుడర్థమయింది వాళ్ళనేం చేయబోతున్నారో! పెద్దఎత్తున ఏడుపులు పెడబొబ్బలు చెలరేగినయ్. మరుక్షణంలో తుపాకిగుళ్ళు ఆ యువకుల గుండెల్లోనుంచి దూసుకు పోయినయ్.

ఆ వీరుల శరీరాలను దహనం చేశాక ఆ రాత్రి చుట్టుపక్కల గ్రామాల వారందరూ కలసి సమావేశం జరిపారు. అప్పటికప్పుడే కృష్ణారెడ్డి నాయకుడిగా గెరిల్లాదళం ఏర్పడింది. మాజీ యూనియన్ సైనికులు కొందరు వారికి సాయుధ పోరాటంలోకి శిక్షణ ఇవ్వటం ప్రారంభించారు. గెరిల్లా దళానికి తుపాకులకోసం విరాళాలు పోగుజేయాల్సి వచ్చింది. 303 రైఫుల్స్ అరడజను సంపాదించాక రజాకార్లమీదకు దాడిజరపాలన్న ఆలోచన మొదలయింది. చుట్టుపక్కల ఊళ్ళల్లో ఉన్న మరికొన్ని గెరిల్లా దళాలు మొదటిసారిగా ఓ రజాకార్ల శిబిరాన్ని చుట్టుముట్టి ఆ శిబిరంలో ఉన్నవారందరినీ కాల్చి చంపారు. దాంతో రజాకార్లకి కూడా భయం భ్రాంతులు కలిగినయ్. నైజాం ప్రభుత్వం పూర్తిగా స్తంభించిపోయింది.

ఖాసిం రజ్వీ నైజాం పరిపాలనా యంత్రాగాన్ని ఉపయోగించుకుని మత విద్వేష పోరాటాలు ప్రారంభించాడు. అతనికి పోలీసులు, మిలటరి సహాయం కూడా లభిస్తోంది. ఈ పరిస్థితుల్లో నైజాం సంస్థానం మీద పోలీస్‌చర్య ప్రారంభించాయ్.

**అప్పుడు జరిగింది భారత కమ్యూనిస్ట్ పార్టీ చరిత్రలో పార్టీ నాయకత్వం చేసిన చారిత్రకమయిన పొరబాటు**

అదేమిటంటే భారత యూనియన్ సైన్యాలకు కూడా వ్యతిరేక పోరాటం జర పాలని నిర్ణయించటం! ఆ నిర్ణయం జరిగిన కొద్ది రోజుల్లోనే యూనియన్ సైన్యాలు అన్ని గ్రామాలను చుట్టు ముట్టాయ్. కృష్ణారెడ్డి పొలంనుంచి ఇంటికి వస్తుండగా యూనియన్ సైన్యం ఆ గ్రామంలో ప్రవేశించింది. గ్రామంలో కమ్యూనిస్ట్ పార్టీకి బద్దులయిన యువకులతో పాటు కృష్ణారెడ్డిని కూడా పట్టుకున్నారు. మిగతా ఊరివా రెవరూ వారికి మద్దతు ఇవ్వలేదు. యూనియన్ సైన్యాలపై పోరాటం జరపటానికి ప్రజలంతా తిరస్కరించారు.

మీకు అరగంట టైమిస్తున్నాను. ఈలోగా కమ్యూనిస్ట్ పార్టీకి రాజీనామా పత్రాలురాసి- భారత యూనియన్‌కు విధేయత ప్రకటిస్తూ ప్రమాణాలు చేసేట్లయితే మీరు ప్రాణాలతో బయట పడతారు" అన్నాడు సైనికాధికారి.




చాలామంది అతను చెప్పినట్లే చేశారు కానీ కృష్ణారెడ్డికది నచ్చలేదు.

పోరాటమే మా ఊపిరి! అప్పుడు భూస్వాములతోనూ, ఆ తరువాత నైజాం పోలీసులతోనూ, రజాకార్లతోనూ పోరాడుతూనే ఉన్నాం! ఈ పోరాటంలో మా ఇళ్ళు ఆస్తులు, ప్రాణాలు ఎన్నో పోయినాయి. కుటుంబాలు కుటుంబాలే తుడిచిపెట్టుకు పోయాయి. ఇప్పుడు కొన్ని త్యాగాలు చేశాక కాంగ్రెస్‌పార్టీ సైన్యాలకు లొంగిపోతారా." అన్నాడు ఆవేశంగా. అరగంట తరువాత కృష్ణారెడ్డితోపాటు మరో ముగ్గురిని కూడా ఊరి మధ్యలోకి లాక్కొచ్చి చంపారు సైనికులు.

ఈ సంఘటన జరిగే నాటికి జయలక్ష్మి వయసు ఆరేళ్ళు.

* * * *

ఆ వయసులోనే ఆమె కమ్యూనిస్టుల ఎన్నికల ప్రచారానికి సాధనం అయింది.

ఆమె నాయనమ్మ సక్కుబాయినే కమ్యూనిస్టుపార్టీ అభ్యర్థినిగా ఎన్నిక చేసింది పార్టీ! ప్రజా పోరాటాలకు తమ అమూల్యమయిన జీవితాన్ని బలిచేసిన కృష్ణారెడ్డి, శ్రీలక్ష్మిల "ముద్దులపాప" అంటూ జయలక్ష్మిని జీప్‌లో చుట్టుపక్కల గ్రామాలన్నీ తిప్పారు కేవలం జయలక్ష్మి మీద జాలి-కృష్ణారెడ్డి శ్రీలక్ష్మిల మీద ప్రేమతోనే సక్కుబాయి అత్యధిక మెజారిటీతో ఎన్నికయింది.

దాంతో ఆరేళ్ళనుంచే జయలక్ష్మి రాజకీయ జీవితం ప్రారంభమయింది. అదే సంవత్సరం ఆమె సికింద్రాబాద్‌లోని కీస్ గార్ల్స్ స్కూల్లో విద్యాభ్యాసం ప్రారంభించింది అయితే చదువుకంటే నాయనమ్మ దగ్గర కూర్చుని అక్కడ జరిగే రాజకీయ మంతనాలు, వ్యూహాలు, చర్చలు గమనించటం ఆమెకు ఎక్కువ ఆసక్తి కలిగించేవి.

**1956** నవంబరు ఒకటవ తేదీన ఆంధ్రప్రదేశ్ ఏర్పడటంతో ఆమె రాజకీయాలను అవగాహన చేసుకోవటం ప్రారంభించింది!

**1957** ఎన్నికలలో కూడా సక్కుబాయ్ కమ్యూనిస్టుపార్టీ అభ్యర్థినిగా పోటీ చేసిందిగానీ ఓడిపోయింది. తిరిగి **1962** ఎన్నికలలో పోటీచేసినప్పుడు ఎలక్షన

ప్రచార సమయంలో జయలక్ష్మికి ఇంద్రకాంత్‌తో పరిచయమయింది. అప్పుడతను అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్‌లో చురుకుగా పనిచేస్తూండేవాడు. అంతకుముందు ఫెడరేషన్ ఎన్నికల సమయాల్లోనూ, విద్యార్థి ఫెడరేషన్ సమ్మెలు, పోరాటాలు, జరిపే సమయాల్లోనూ వారిమధ్య పరిచయం కలిగిందిగానీ జనరల్ ఎలక్షన్స్‌లో సక్కుబాయి తరఫున విద్యార్థి ఫెడరేషన్‌వాళ్ళు ప్రచారంచేసే సమయంలో మరింత సన్నిహితం అయ్యారు. అతని అందమయిన రూపం, పార్టీ మీటింగుల్లో అతను మాట్లాడే తీరూ ఆమెను ఎంతో ఆకర్షించినయ్.

అతని మాటల ధోరణి ఆమెకు విపరీతమయిన ఆశ్చర్యం కలిగిస్తూండేది.

చైనా భారతదేశంతో యుద్ధంచేస్తున్న సమయంలో దేశంలోని అన్ని పార్టీలు చైనాను ఖండిస్తూ దురాక్రమణదారుగా ప్రచారం చేస్తోంటే ఇంద్రకాంత్ చైనాదేమి తప్పులేదనీ-వాళ్ళ దేశానికి చెందాల్సిన భూభాగం వాళ్ళు బలప్రయోగంద్వారా ఆక్రమించుకున్నారనే వాదిస్తూండేవాడు.

ఎన్నికల్లో సక్కుబాయ్ అతి తక్కువ మెజారిటీతో గెలవగలిగింది.

ఆ మర్నాడు సాయంత్రం ఇంద్రకాంత్ జయలక్ష్మికి ఫోన్ చేశాడు.

"మీ నాయనమ్మను గెలిపించినందుకు నాకేం బహుమతి ఇస్తున్నావ్?" అడిగాడతను.

"నేనెందుకిస్తాను? నువ్ పార్టీకోసం పనిచేశావ్! మా గురించి కాదు"

"అది మిగతావాండ్ల విషయంలో కరెక్టేమోగానీ నా విషయంలోకాదు" నవ్వుతూ అన్నాడు.

"నీ విషయంలో ఏమిటిమరి?"

"కేవలం నీకోసం పనిచేసినా!"

జయలక్ష్మి ఆశ్చర్యపోయింది. ఇది మొదటిసారి అతనలా వ్యక్తిగతంగా మాట్లాడటం.

"నేను నిన్నలా చేయమని అడగలేదే?"

"అడిగావని నేననలేదు! నీతో మాట్లాడుతూ, నీ పక్కనే తిరుగుతూ గడపొచ్చని వచ్చాను-"

"అయితే మరింకా నన్ను బహుమతి అడుగుతావెందుకు?"

"అచ్ఛా! సరే అయితే నేనే పార్టీ ఇస్తాగాని జల్దీ రడీఅయి వస్తావా?"

"ఎక్కడికి?"

త్రీవసెస్! నీకోసం ఎదురు చూస్తూంటా!"

జయలక్ష్మి కొద్ది క్షణాలు ఆలోచించింది. అలా అతనితో వెళ్ళటం మంచిదా కాదా-అనేదే తేలటం లేదు. అతనితో మాట్లాడుతూ అతని మాటలు వింటూ గడపాలన్న కోరిక తనకూ ఉంది. కాని...

"ఏమాలోచిస్తున్నావ్?"

"అచ్ఛా! వస్తున్నా-"

"ఎన్నిగంటలకు?"

"ఇంకోగంటలో-"

"........."

జయలక్ష్మి ఫోన్ పెట్టేసి త్వరత్వరగా రడీ అవసాగింది. ఇల్లంతా ఇంకా ఎన్నికల విజయం తాలూకా హడావుడితో నిండివుంది. మావయ్యా, అత్త, పిల్లలు- కొంతమంది పార్టీ వర్కర్లు-

జయలక్ష్మి నాయనమ్మతో చెప్పకుండానే ఇంటినుంచి బయటికొచ్చింది. అదే మొదటిసారి ఆమె అలా- ఇంట్లో ఎవరికీ తెలీకుండా- బయటకు రావటం! ఎందుకో తను ఇంద్రకాంత్‌ని కలుసుకోడానికెళ్తున్న విషయం ఎవరికీ తెలియకూడదని పించింది.

శ్రీ ఏసెస్ దగ్గర ఆటో దిగేసరికి పోర్టికోదగ్గరే నిలబడి కనిపించాడతను. ఇంకా చీకటి పడకపోయినా అప్పటికే ఆ ప్రాంతమంతా లైట్లు వెలుగుతున్నాయ్.

"థాంక్యూ!- అడగ్గానే వచ్చినందుకు!" అన్నాడు ఇంద్రకాంత్ నవ్వుతూ.

ఇద్దరూ లోపలకు నడిచారు.

"నేను బీర్ తీసుకుంటాను. నీ కేంకావాలి?" అడిగాడతను

"ఏదో కూల్‌డ్రింక్-"

అతను బేరర్‌కి ఆర్డర్ ఇచ్చాడు.

జయలక్ష్మికి అతనితో ఆవిధంగా మాట్లాడాలంటే ఏమిటోగా ఉంది. అంతకుముందు ఎన్నికల ప్రచారంలో చాలాసార్లు తామిద్దరూ హోటల్‌కెళ్ళారు- కాఫీ ఫలహారాలు చేశారుగానీ- ఇప్పుడు డిఫరెంట్‌గా ఉంది.

అతను అలవాటు ప్రకారం పార్టీగురించి మాట్లాడటం మొదలుపెట్టాడు.

"...నిజం చెప్తున్నా- మావో ఏమన్నా కరెక్ట్! చైనా కమ్యూనిస్ట్‌పార్టీ అనుసరిస్తోన్న వైఖరే విజయవంతం అవుతుంది. కమ్యూనిస్ట్‌పార్టీ రెండుగా చీలక తప్పదు-"

ఈ సంగతి చెప్పటానికేనా నన్ను పిలిచింది?" నవ్వుతూ అడిగింది జయలక్ష్మి.

"ఓ- అయామ్‌సారీ-"

బేరర్, అతనిముందు బీర్, ఆమెముందు కూల్‌డ్రింక్ ఉంచాడు. అతను బీరు తన గ్లాసులో పోసుకుని మొత్తం సీసా ఖాళీ చేసాడు.

"ఇప్పుడు మాట్లాడతాను జయలక్ష్మీ! ఈ లాస్ట్ వన్‌మంత్‌లో నాకు కొన్ని ఆలోచనలు కలిగాయ్. వాటినిప్పుడు నీ ముందుంచుతాను-"

"ఏమిటవి?"

అతను కొద్దిక్షణాలాగి అన్నాడు.

"అడ్మంవ్‌యూ జయలక్ష్మీ! నా లైఫ్ పార్ట్‌నర్‌గా ఉంటావా?"



జయలక్ష్మి నవ్వింది.

"నా కిప్పట్లో అసలు పెండ్లి చేసుకోవాలన్న ఆలోచనేలేదు"

"థాంక్‌గాడ్! 'నో' అనలేదు." నుదుటిమీద చెమటలు తుడుచుకుంటూ అన్నాడతను.

"నువ్వెప్పుడు చేసుకోవాలనుకుంటున్నావ్" కాసేపటి తర్వాత తిరిగి అడిగాడతను.

"ఏమో- తెలీదు- బహుశా రాజకీయాల్లోకి దిగి- ఓ స్థానం సంపాదించాక- అప్పుడు ఆలోచిస్తానేమో-

"అంటే... నువ్వు పాలిటిక్స్‌లోకి దిగబోతున్నావా?" ఆశ్చర్యంగా అడిగాడతను.

"అవును!" వచ్చే జనరల్ ఎలక్షన్స్‌లో పోటీ చేయాలని అనుకుంటున్నా"

అతనికి ఆమె మాటలు నమ్మశక్యం కావటం లేదు.

"నీలాంటి అందమయిన అమ్మాయి రాజకీయాల్లోకి రావటమా? నాకు ఆశ్చర్యంగా ఉన్నది...

"అందం- రాజకీయాలకు అభ్యంతరకరం కాదుగా?"

"నే ననేదిది అదిగాదు. నిన్ను ఆరాధించేవ్యక్తితో మంచి జీవితం గడపక- ఈ చెడ్డ రాజకీయాల్లోకెందుకు ఇన్‌వైట్ చేస్తున్నావ్?"

"ఎవరి అభిరుచి వాళ్ళది..."

"ఆఫ్‌కోర్స్- ఆ మాట నిజమేగానీ నీకు మన పార్టీటికెట్ దొరుకుతుందని ఏమిటి గారంటీ?"

"మనపార్టీ కాకుంటే వేరొకటి! లేదా ఇండిపెండెంట్‌గా పోటీచేస్తా!"

ఇంద్రకాంత్ మాట్లాడలేదు కొద్దిక్షణాలపాటు.

"అయితే- నా కోరిక తీరనట్లేనా?"

జయలక్ష్మి అతని చేతిని తన చేతిలోకి తీసుకుంటే



*ఒడి పెరిగే ప్రాయం గదా? నా కర్మమవుతుందిగా. వయసులోని ఆడపిల్లకు ఎంత యిబ్బందో—తల్లిని గదా మరి*

# "మా అమ్మాయి కోసం కేర్‌ఫ్రీ ఎందుకు ఎంచుకున్నానంటే"

నిజానికి ప్రతి తల్లికీ తెలుసు అసలు, వయసొచ్చిన కొత్తల్లో, ఆ తరుణంలో, ఆడపిల్లకు ఎలా వుంటుందీ అన్న సంగతి— బాల్యం నుంచి యవ్వనంలోకి అడుగెట్టే ఆ తరుణంలో పడే తొట్రుపాటు, ఏదోలా అనిపించే ఆ యిబ్బందీను.

తల్లిని గదా, నేనూ ఒకప్పుడు ఆ వయసులో వున్నదాన్నే గదా, తెలుసును నాకందుకే. మరందుకే తెలుసును నాకు నెలలోని ఆ అయిదు రోజులూ పడే యిబ్బందీ, తొట్రుపాటూను.

---

నేనైతే ఎప్పుడూ ఆ అయిదు రోజులకోసం యింట్లో తయారు చేసుకున్నదే వాడేదాన్ని. ఎంత ఎబ్బెట్టో చెప్పలేనిక—అదంతా ఉతకడం, ఆరెయ్యడమూను.

---

అదండీ సంగతి, యిన్నేళ్ళబట్టీ యింట్లో తయారుచేసిన దాన్నే వాడేదాన్ని, ఎంతో ఎబ్బెట్టుగా వుండేది—

అదంతా చితకడం, ఆరయ్యటమూను. ఆ 5 రోజులూ మళ్ళీ వచ్చాయండోయ్ అని చుట్టుపక్కల వాళ్ళందరికీ తెలిసేలా చెప్పినట్టుండేది. మరి ఎంతెంతో అసౌకర్యంగా వుండటం...పూర్తిగా రక్షణ వుందనే భరోసా ఉండేదే కాదిక...ఎప్పుడు ఏ 'ఉపద్రవం' చటుక్కని జరుగుతుందోననే భయం—మీ కర్థమవుతుంది అదేదో, నేనేం అనదల్చుకున్నానో.

అయితే యిప్పుడు నాకు క్రమేణా అలవాటైపోయింది అనుకోండి, యింట్లో చేసింది వాడటం. అయినా మా కాలంలో అంతగా పట్టించుకునేవారు కాదు. ఎందుకంటే, ఆ అయిదు రోజుల్లో మమ్మల్నసలు బయటకు వెళ్ళనిస్తే గదా?

---

**మారేయి రోజులు యిప్పుడు—యీ కాలపు ఆడ పిల్లలు, నెలలో యిబ్బంది పెట్టే ఆ అయిదు రోజుల్లో కూడా చలాకీగా ఉండాలనుకుంటారు.**

---

మారేయి రోజులు యిప్పుడు! వచ్చింది మార్పు, యీ కాలంలో కేర్‌ఫ్రీలాంటి ఆధునికమైన, రక్షణనిచ్చేది వుంది గదా.

ఆడపిల్లగా నేను పడ్డ అవస్థ, యిబ్బంది మా అమ్మాయి కూడా పడాలనుకోవడంలో ఏం అర్థం వుంది గనక. అదేగాక మా అమ్మాయి యిప్పటుండే కాలానికీ మా కాలానికీ బోలెడంత తేడా వుంది. నెలలో ఆ 5 రోజులు కూడా సరదాగా చలాకీగా వుండాలనుకుంటారు యీనాటి ఆడపిల్లలు. మా అమ్మాయి సంగతే చూడండి—మేం ఆ కాలంలో చేసిన దానికన్న ఎంతెంతో చేసి నిలదొక్కుకోవలసి వస్తుంది...చదువేమిటి, యితర కార్యక్రమాలేమిటి, ఒకటి కాదయ్యో. అది కాకుండా, ఏ వయస్సులో ఆ ముచ్చట వుండాలని నా ఉద్దేశ్యం—ఆ కాలంలో మాలాగ యింట్లో కూర్చోవడం కాదు.

అందుకే మరి మా అమ్మాయికోసం ఎంచుకున్నా కేర్‌ఫ్రీ. తను ఏం చేయదల్చుకున్నా నిస్సంకోచంగా చేస్తూ, ఆ భద్రతని పొందుతూ సంపాదించుకోవాలని. మరి దాని కోసం కేర్‌ఫ్రీ కన్నా మించినదేముంది! కేర్‌ఫ్రీ అన్నది రెడీ-మేడ్ నేప్కిన్, వాడటానికి ఎంతో వీలు, మార్చడానికీ వీలు. బట్టల్ని మడతపెట్టి, దూది పత్తి పెట్టి దాదరబందీగా సమయం వృథా చెయ్యనక్కర్లేదు. తల్లిగా నేను ఆలోచించేది ఏమిటంటే కేర్‌ఫ్రీ ఆరోగ్యరీత్యా మరింత శుభ్రమైనదని.

కేర్‌ఫ్రీ వుంది గనక, యిక మా అమ్మాయి, చితకడం, ఆరబెట్టడం అనే యిబ్బందిలో పడక్కర్లేదు. ప్రతిసారీ కొత్త శుభ్రమైన, తాజా నేప్కిన్ వాడటమే.

మొదట్లో అయితే యీ రెడీ-మేడ్ నేప్కిన్, అవసరమైన ఆ రక్షణ యివ్వగలుగుతుందా అని సంకోచించా—యిప్పుడు మరి మా అమ్మాయి కొంతకాలంగా వాడుతోంది దీన్ని. నాకు తెలిసిందేమిటంటే, పీల్చుకునే లక్షణం ఉండటానికి, సానిటరీ నేప్కిన్ అనేది అంత పెద్దదిగా, మందంగా ఉండనవసరం లేదనీ—ఒక అమ్మాయిని యిబ్బంది పెట్టే అవాంతరాలనుంచి రక్షణ యివ్వడానికిను. మా అమ్మాయే అంటుంది గదా తనకిది ఎంతెంతో సౌకర్యంగా, భద్రంగా ఉందని...బయటకు వెళ్ళినప్పుడు గూడాను. అందుకే మరింక మా అమ్మాయిని గూర్చి యిక బెంగలేదు.

---

**కేర్‌ఫ్రీ మా అమ్మాయి జీవితాన్ని ఎంతో హాయిగా, తీరుగా చక్కగా వుండేలా చేసిందిక—ఎందుకనంటే అది ఎంతెంతో వీలు గనక.**

---

నిజానికి, కేర్‌ఫ్రీ మా అమ్మాయి జీవితాన్ని హాయిగా, తీరుగా చక్కగా వుండేలా చేసిందిక—ఎందుకనంటే అది ఎంతెంతో వీలు గనక—నాకూ ఎంతో హాయిగా ఉందిక.

మా అమ్మాయికి, మా కాలంలో మాకు లేనిది యివ్వగలిగాననీ నాకెంతో సంతోషంగా వుంది. కేర్‌ఫ్రీ సౌకర్యం. కేర్‌ఫ్రీ రక్షణ. మరి మనం కూడా, మారే కాలంతో బాటు మారద్దా యిక.




*10 వున్న ప్యాక్‌లోనూ, పొదుపైన 20 వున్నవి, 30 వున్నవి గల ప్యాక్‌లలోనూ దొరుకుతుంది.*

**కేర్‌ఫ్రీ ఎక్స్‌ట్రా లార్జ్ 10 గల ప్యాక్ కూడా దొరుకుతుంది.**

*కేర్‌ఫ్రీ శానిటరీ నేప్కిన్స్—పూర్తి సౌకర్యం, పూర్తి రక్షణ, మారుతున్న నేటి కాలంకోసం.*

Johnson & Johnson

అలా ఎందుకనుకుంటున్నావ్? ఆయ్.టూ లైక్ యూ! కానీ నా పర్సనల్ లైఫ్ కంటె నాకు నా యాంబిషన్ ముఖ్యం' మేబి- కొన్ని సంవత్సరాల తర్వాత మనం మారేజ్ చేసుకోవచ్చునేమో!"

"అయామ్‌సారీ జయా లెట్‌మెబి ఫ్రాంక్ విత్‌యూ! "నో" ఆర్ "నెవర్" అనేవి నా పాలసీ సో ప్లీజ్ ఫర్‌గెట్ ఎబౌటిట్-"

జయలక్ష్మి మాట్లాడలేదు.

బేరర్ భోజనం తెచ్చి వడ్డించాడు. ఇద్దరూ మౌనంగా భోజనం చేయసాగారు.

జయలక్ష్మి మనసంతా ఆలోచనలతో నిండిపోయింది.

'నో' అర్ 'నెవర్-' ఏమిటిచేయటం! అతని అందం. అతని ప్రవర్తన, అతని అభిరుచులూ, అతని సిన్సియారిటీ, అతనికి పార్టీ మీదున్న భావాలు- అన్నీ తనకు నచ్చినవే!

'నో' ఆర్ 'నెవర్' అనేదే అతని పాలసీ అయినట్లయితే మాత్రం- తను తేలిగ్గా నిర్ణయం తీసుకోగలదు.

అదేమిటంటే 'నెవర్'!

తన ఆశలు, తన ఆలోచనలు, తన ఆశయాలు, తన భవిష్యత్తూ -ఇవే తనకి ముఖ్యం. పెళ్ళిచేసుకుని వంటచేసిపెడుతూ. పిల్లల్ని కనటం కాదు.

కేవలం ఆ పనికోసమే ఎదురుచూస్తున్న స్త్రీలు చాలామంది ఉన్నారు మన దేశంలో!

భోజనంచేసి ఇద్దరూ బయటికొచ్చారు. ఇంద్రకాంత్ ఆటో రిక్షాను పిలిచాడు.

"థాంక్యూ జయా! ఇంటికి వెళ్ళు."

జయ ఆటోలో కూర్చుంది. "సారీ-ఫర్ డిజపాయింటింగ్ యూ...."

"డిజపాయింట్‌మెంట్ అనేది నా డిక్షనరీలో లేదు. నెక్స్ట్" అనేది ఒక్కటే నా పాలసీ..." ఆటో బయిల్దేరింది.

ఆ తరువాత ఇంద్రకాంత్ మళ్ళీ ఆమె కెప్పుడూ కనిపించనే లేదు.

మరో రెండు సంవత్సరాల్లో కమ్యూనిస్ట్‌పార్టీ రెండు ముక్కలయింది. ఇంద్రకాంత్ మార్క్సిస్ట్ గ్రూపులో చేరినట్లు తెలిసిందామెకి.

ఆ తరువాత కొద్ది రోజులకే డిగ్రీ పరీక్షల ఫలితాలు వచ్చాయ్. ఫస్ట్‌క్లాసులో పాసయింది జయలక్ష్మి.

ఆమెను యూనివర్సిటీలో చేర్పించడానికి ఏర్పాట్లు ప్రారంభించాడు ఆమె మామయ్య రాజేశ్వర్.

"నేను ఇంకా చదవను మామయ్యా!" అందామె ఓరోజు అతని గదిలోకివెళ్ళి

రాజేశ్వర్ ఆశ్చర్యపోయాడు.

"అదేమిటి? ఎందుకట్లా?"

"నేను రాజకీయాల్లో యాక్టివ్‌గా పాల్గొనదల్చుకున్నాను."

అతనేమీ మాట్లాడలేక పోయాడు. ఆ రాత్రే ఆ విషయం సక్కుబాయితో చర్చించాడు.

"దానిష్టం ఎలా ఉంటే అలా చేద్దాం! తల్లీ తండ్రీ లేని పిల్ల" అందామె.

1967 జనరల్ ఎన్నికలకు సికింద్రాబాద్ నియోజక వర్గం నుంచి తన స్థానంలో తన మనవరాలు జయలక్ష్మిని నిలబెట్టాలని సక్కుబాయ్ పార్టీ నాయకత్వానికి సూచించింది. ఆమె అభ్యర్థిత్వం అందరికీ అంగీకారమయింది. అయితే ఆఖరి క్షణంలో జయలక్ష్మి ఇండిపెండెంట్ అభ్యర్థినిగా తన నామినేషన్ని దాఖలు చేసేసరికి అందరూ ఆశ్చర్యపోయారు.

"వారికి ఒకే ఒక్క కారణం సమాధానంగా చెప్పిందామె.

"చూడండి! మన పార్టీ చీలిపోయింది. ఈ పరిస్థితిలో మన ఓట్లుకూడా చీలిపోతాయ్. మన పార్టీకిగానీ, మార్క్సిస్ట్ పార్టీకిగాని గెలిచే అవకాశాలు చాలా తక్కువ. అందుచేత నేను స్వతంత్ర అభ్యర్థినిగా నుంచుంటాను. మీరు నన్ను సపోర్టు చేయండి చాలు! అలాచేస్తే వేరే వాళ్ళ ఓట్లుకూడా సంపాదించుకునే అవకాశం నాకుంది-" అందామె,

ఆమె కోరికకు అంగీకరించారు పార్టీనాయకులు.

ఆ విషయం ధృవపడిన వెంటనే ఇంద్రకాంత్ వివరాలు తెలుసుకోడానికి ప్రయత్నాలు ప్రారంభించింది. వరంగల్లులోని పార్టీ యూనిట్‌లో ఉన్నట్లు తెలిసిందామెకి. అదేరాత్రి జీపులో బయల్దేరి వరంగల్ చేరుకుందామె.

అతని భార్య తలుపు తెరిచింది.

"ఎవరు కావాలి?" అడిగిందామె

"ఇంద్రకాంత్ ఉన్నారా?"

"రండి-కూర్చోండి! భోజనం చేస్తున్నారు."

జయలక్ష్మి లోపలకు నడిచి కూర్చుంది. చాలా చిన్నగది అది! అందులోనే ఓ మూల టేబుల్, దానిమీద మార్క్సిజం పుస్తకాలు పేర్చి ఉన్నాయ్.

ఇంద్రకాంత్ టవల్‌తో మూతి తుడుచుకుంటూ బయటికొస్తూ ఆమెను చూసి ఆశ్చర్యపోయాడు, అతని మనసు శరవేగంతో గతంలోకెళ్ళి తిరిగొచ్చింది.

"నువ్వా!" అన్నాడు నమ్మలేనట్లు.

"ఏం కాకూడదా?" నవ్వుతూ అడిగిందామె.

అతనిలో ఆకర్షణ ఏమాత్రం తగ్గలేదు. జయలక్ష్మి కొద్ది క్షణాలు ఆలోచనలో పడిపోయింది.

ఇంద్రకాంత్‌ని కాదని తను తప్పు చేయలేదు కదా!

"కాకూడదని కాదు; మాలాంటి వాళ్ళ ఇంటికి వస్తావని అనుకోలేదు!" అన్నాడతను.

"మన మధ్య ఉన్నది కేవలం పార్టీ ఫ్రెండ్‌షిప్పేకాదుగదా;..."

ఇంద్రకాంత్‌కి ఆమెమాటల్లోని అర్థం తీయని బాధను రగిల్చింది. ఇంతటి అందాల రాశి తనకు దగ్గరగా తొందరపడి వదులుకున్నాడా? ఎంత అలస్యమయితే అయింది ఆమెకోసం వేచి ఉంటే జీవితం మరింత ఆనందంగా ఉండేదేమో!

అంతలోనే ఆలోచనలను అదుపులోకి తెచ్చుకున్నాడతను- తనకు అన్నింటి కంటె ప్రాముఖ్యం తన నమ్మిన సూత్రాలను ఆచరణలో పెట్టటం ముఖ్యం. డెమొక్రసీ పేరుతో సాగుతోన్న బూర్జువా పరిపాలనను ఏనాటికయినా సమాధి చెయ్యటమె తన ఆశయం. తన పుట్టుకకు సార్థకత కలగాలంటే ఆ పంథాలోనే ప్రయాణం చేయాలి

ప్రేమించిన అమ్మాయిని పెళ్ళి చేసుకుని దానికోసం మిగతా ఆశయాల్ని వదులుకుని ఆనందంగా జీవితం గడిపేయటంలో స్వార్థం తప్పితే మరోటి కనిపించ లేదు తనకు

"ఏమిటింత సడెన్‌గా వచ్చావ్?" అడిగాడు ఇంద్రకాంత్

"నీతో చాలా పెద్దపని పడింది!"

ఆమె చిరునవ్వు నవ్వుతోంటే మరింత అందంగా మరింత సమ్మోహనాకారంగా కనిపించే సరికి ఇంద్రకాంత్‌కి మతిపోయినట్లయింది.

హఠాత్తుగా అతనికి క్లియోపాత్ర గుర్తుకొచ్చింది.

ఆమె అందం ఎన్ని అద్భుతాలు చేసిందో జయలక్ష్మి అందం కూడా అన్ని అద్భుతాలు చేయగలదు

ఇందులో ఎలాంటి సందేహం లేదు.

"ఏమి అలా చూస్తావ్?" చిరుకోపంతో అడిగిందామె.

"ఏమీ లేదు జయా! ఏమిటా పని?"

"నేను సికింద్రాబాద్ నుంచీ ఇండిపెండెంట్‌గా పోటీ చేస్తున్నాను. మీ పార్టీ సపోర్టు కావాలి నాకు"

అతను ఆశ్చర్యపోయాడు.

"కానీ... అదీ చాలా కష్టం అనుకుంటానుజయా..."

"నువ్వు తల్చుకుంటే అంత కష్టం కాదని నా నమ్మకం!"

అతనికి తెలుసు- ఆమెకు "కాదు" అని చెప్పడం తనవల్లకాదు.

"ప్రయత్నిస్తాను..." అన్నాడు కొద్ది క్షణాలాగి.

"థాంక్యూ- ఇంక వెళ్ళిరానా?"

"ఉదయం వెళ్ళకూడదు?"

"ఎన్నికల్లోకి దిగాక ఇంక టైమెక్కడుంటుంది?" ఆమె లేచి నిలబడింది.

ఆమెతోపాటు బయటకు నడిచాడతను.

"విష్‌యూ బెస్టాఫ్ లక్-"

ఆమె నవ్వింది "థాంక్యూ!"

సశేషం

మీ ఆవిడ్ని మంచి చేసుకోడానికీ మీ గర్ల్‌ఫ్రెండ్
ప్రేమ పొందడానికీ మీ ఆఫీసర్ని మచ్చిక చేసుకుని
ఇంక్రిమెంట్లూ ప్రమోషన్లూ కొట్టెయ్యడానికీ
మీరు మంత్రించిన ఉంగరం కొన్నారా?
ఎంత అమాయకులు సార్ మీరు?
మంత్రాలకు చింతకాయలు రాల్తాయా?
మీ కోరికలు తీరాలంటే
ఇదిగో......

## ఇదిగిదిగో మల్లిక్..

సుప్రసిద్ధ కార్టూనిస్ట్ పుస్తకం కొని మీరు ఎవర్ని
మంచి చేసుకోవాలని అనుకుంటున్నారో వాళ్ళకివ్వండి.
అయినా వాళ్ళు నవ్వీనవ్వీ మీకు దాసులైపోతారు
మీరు కూడా మీకోసం ఒక కాపీ కొనుక్కోవడం మర్చిపోకండి
వెల కేవలం 15 రూపాయలు మాత్రమే
ఆంధ్రుల అభిమాన ఆరడుగుల అందాల కార్టూనిస్టు
హాస్యరచయిత అయిన **మల్లిక్** సమర్పించిన
ప్రత్యేక కార్టూనుల సంకలనం- మార్కెట్లో విడుదలైంది
కార్టూనులతోబాటు ఒక హాస్యరచనకూడా ఉందండోయ్!
ఈ హాస్యరచన కేవలం మొదటి ముద్రణ ప్రతులలోనే
ఉంటుంది
అందుకే త్వరపడండి
ప్రతులకు

**ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్**

3237 రాష్ట్రపతిరోడ్, సికింద్రాబాద్-500003

# 'వసుంధర'

**నారాయణమూర్తిగారు వయ**సులో నాకంటే ఎంతో పెద్దకాదు. అయినా నాకాయన గురుతుల్యుడు. అన్నీ తెలుసునని నేననుకున్నప్పుడల్లా ఆయనతో మాట్లాడితే నాకేమీ తెలియదని తెలిసిపోయేది. చదువైపోయి ఉద్యోగం వచ్చేక మేము విడిపోయాం. ఆయనదెప్పుడూ విజయవాడే. నాదిప్పుడు విశాఖపట్నం.

నారాయణమూర్తిగారు సాహిత్యోపాసకులు! ఆయన అన్ని రకాల సాహిత్యాన్నీ చదివి మంచి చెడ్డలు చెబుతూండేవారు. సాహిత్యం గొప్పతనం తెలిసేక నాకు రచయితలంటే ఆసక్తి బయల్దేరింది. క్రమంగా అది ఆరాధనగా కూడా



మారింది. విజయవాడలో రచయితలకు కొదువలేదు. కానీ నారాయణమూర్తిగారి కారణంగా నేను ఒక్క రచయితను కూడా కలుసుకోలేక పోయాను.

"సినిమాచూసి ఆనందించు. టెక్నీషియన్ల వ్యక్తిగత పరిచయం ఆశించకు. స్పోర్ట్సుచూడు క్రీడాకారులు వ్యక్తిగత పరిచయం ఆశించకు. అలాగే రచనలూనూ అన్నాడాయన. అందుకాయన కారణంగూడా చెప్పాడు.

ఒక నటిగానీ, దర్శకుడుగానీ ఓ చలన చిత్రాన్ని అద్భుతంగా రూపొందించవచ్చు. గవాస్కర్ టెస్టు మ్యాచిల్లో 30 సెంచరీలు సాధిరించినా, కపిల్‌దేవ్ జింబాబ్వేమీద 175 పరుగులు చేసినా అవి అద్భుతాలే! ఈ అద్భుతాల కారణంగా ఆయావ్యక్తులను మానవాతీతులుగా భావించడం జరుగుతుంది. అప్పుడు వారితో పరిచయం పెంపొందించుకుంటే- వారుకూడా అందరిలాగే సామాన్య మానవులనీ, ఉన్నత స్థాయికి ఎదిగినా అసూయాద్వేషాలను విడిచిపెట్ట లేదనీ, అహంకారాన్ని జయించ లేదనీ అర్థమవుతుంది. ఒకోసారి వారిలో సామాన్యుల కుండే పాటి సంస్కారంకూడా లోపించవచ్చు.

"కళాకారులు! క్రీడా కారులు చేసే అద్భుతాలను మనం కలకాలం ఆనందించాలంటేవారుమానవాతీతులన్న భ్రమ మనలో ఉండితీరాలి. ఆ భ్రమ మనకు మిగలాలంటే వారికి దూరంగా ఉండడ మొక్కటే గత్యంతరం-" అన్నాడాయన-అందుకు దాహరణగా కొందరు ప్రముఖ గాయకులు, క్రీడాకారులు,

## రియాక్షన్

నటులు, రచయితలు వగైరాల గురించి ఆయన నాకు చెప్పారు.

మిగతావారి విషయ మెలాగున్నా రచయితల విషయంలోనేనిది మానసికంగా అంగీకరించ లేకపోయాను. వారు ఎక్కడెక్కడి మనుషుల మనస్తత్వాలనూ కాచి వడపోసి రచనలు చేస్తారు. అలాంటి వారు తమ మనసును సంస్కరించుకో లేరంటే హాస్యాస్పదంగా తోచిందినాకు. కానీ నారాయణమూర్తి గారితో. వాదించి నెగ్గలేనని తెలుసు అందుకే వాదించ డానికి కూడా ప్రయత్నించలేదు.

ఇప్పుడు నాకు అనుకోకుండా ఒక రచయితతో పరిచయం కలిగింది. అతడు రచయిత అని నాకు ముందుగా తెలియదు. అతడికి స్వోత్కర్ష లేదు. మనిషి చాలాసింపుల్‌గా ఉంటాడు. అతడి రచనలు తరచుగా అన్ని పత్రికలలోనూ వస్తూంటాయి.

నారాయణమూర్తిగారు రచయితల విషయంలో పొరపడ్డారన్న విషయం ఋజువు చేయడం కోసమే నేనతడితో బాగా పరిచయం పెంపొందించుకున్నాను. పరిచయం పెరగ్గానే అతడి వల్ల నాకెంత మేలు జరుగుతున్నదీ అర్థ మయింది. ఎన్నో విషయాల్లో అపడేవున్న అవగాహన, పరిజ్ఞానంనాకు లేవు. ఇదా ప్రపంచం-అని తెలిసి ఆశ్చర్య పడ్డానుకూడా.

ఈ రచయితను నారాయణమూర్తి గారికి పరిచయం చేసి ఆయన దురభి ప్రాయాలన్నీ పటాపంచలు చేయాలను కున్నాను. నాకా అవకాశమిప్పు డానికే ఏమో—ఏదో పనిమీద నారాయణ మూర్తిగారు విశాఖపట్నంవచ్చి మా యింట్లోనే మకాం పెట్టారు-నేను రచయిత గురించి చెప్పగానే "—అలాగా అతణ్ణి తప్పకుండా కలుసు కుందాం-" అన్నారు నేనెంతో సంతోషించాను.

ఒకరోజు సాయంత్రం ఆయన్ను రచయిత యింటికి తీసుకుని వెళ్ళాను. రచయిత మమ్మల్నిద్దర్నీ సాదరంగా ఆహ్వానించాడు.

నారాయణమూర్తిగారు అతడి కొన్ని రచనల గురించి ప్రస్తావించి మెచ్చు కున్నారు. అతను మొహమాట పడ్డాడు. కాసేపవీ యివీ మాట్లాడేక— "రచయితగా మీ గురించి తెలుసుకోవా లనుంది. అసలే మీ రేవిధంగా ప్రేరణ పొందుతారూ, ఏయే పత్రికలకు రచ నలు పంపుతారూ; రచయితగా మీ వ్యక్తిగతాభిప్రాయా లేమిటీ వగైరాలు—..." అన్నారు నారాయణ మూర్తిగారు.

రచయిత గొంతు సవరించుకుని-.... "నా చుట్టూవున్న సమాజమేనాకు ప్రేరణ. అలాగని అట్టడుగు వర్గాలగురించి రాయను. వారికేమీ చేయలేనప్పుడు— కేవలం పేరుకోసం వాళ్ళ గురించి నేను రాయలేను" అన్నాడు రచయిత.

నేను నారాయణమూర్తిగారి వంక గర్వంగా చూసాను. ఆయన నా చూపులు పట్టించుకోకుండా-"మీ రచ నలు బాగుంటాయి. అయితే అవి వాస్త వానికి దగ్గరగా వుంటాయి /ప్రస్తుతం మానవాతీత శక్తుల గురించి వచ్చే రచ నలకు మంచిగిరాకీ వుంది మీరలాంటి వెందుకు రాయరు! అన్నాడు.

అందుకు చాలా కారణా లున్నాయి. మొదటిది విదేశీ సాహిత్యాన్ని కాపీ కొట్టడం నా కిష్టముండదు. రెండవది, ప్రచారమంటే నా కసహ్యం. రచయిత ప్రచారాన్నాశించడం అతడి పతనాన్ని సూచిస్తుంది-" అన్నాడు రచయిత.

"ప్రచారమంటే మీ అభిప్రాయం?"

"ఫోటోలను ముఖ చిత్రాలుగా వేయించు కోవడం. పాఠకులు తనకు రాసిన ఉత్తరాలను అచ్చేయించు కోవ డం. సంపాదకుల కాళ్ళు పట్టుకుని తన గురించి పదే పదే రాయించు కోవడం. పాఠకులతో అర్థం పర్థం లేని ముఖా ముఖీలు నిర్వహించడం. అమ్మాయిలు తనచుట్టూ తిరుగుతున్నారని చెప్పుకో వడం..."

నారాయణమూర్తిగారు వెంటనే-మీరు మీ ఫోటోను పత్రికల్లో వేయించు కోరా?" అన్నాడు.

ఫోటోను పరిచయానికి వాడుకో వడం వేరు ప్రచారానికి వాడడం వేరు. రచనకు బహుమతి వచ్చినప్పుడు ఫోటో పరిచయం తప్పనిసరి. అలాంటప్పుడు నా ఫోటోని ఎవరూ చూడ కూడదని భీష్మించు కోవడమూ నాకు కిష్టం. అలా భీష్మించు కోవడం కూడా ఒక రకం ప్రచారమే! అన్నాడు రచయిత.

"అలాంటప్పుడు—ప్రచార లోపమే మిమ్మల్ని అజ్ఞాత రచయితను చేసిం దంటారా! మీరు చాలా మంచి రచనలు చేసినా రావాల్సినంత పేరు మీకురాలేదు

మరి!" అన్నాడు నారాయిణమూర్తి
రచయిత నవ్వి- "నేను పేరుకోసం కాక స్వయంతృప్తి కోసం రాస్తున్నాను. పాఠకుల నాకర్షింప చేయాలన్నది నా సంకల్పంకాదు. ఆలోచింప జేయాల న్నది నా అభిలాష. ప్రస్తుతం పాఠకులు కోరేది సస్పెన్సు-సస్పెన్సు దేముంది? పదిపేజీలు రాసి-తొమ్మిది పేజీలు మాత్రమే ప్రచురిస్తే ఆ ఒక్కపేజీ సస్పెన్సు...అంతేకదా! అన్నాడు.

"మీ రచనలు పాఠకుల నాకర్షించ దంలేదని మీకు తెలుసా?" అన్నాడు నారాయణమూర్తిగారు.

"అందుకు ప్రయత్నించాలన్న ఉద్దేశ్యముంటే-నేను ముందుగా ఏ ఆడ పేరో కలంపేరుగా పెట్టుకునేవాణ్ణి- అన్నాడు రచయిత.

"ఇప్పుడు మగపేర్లకున్న డిమాండు ఆడపేర్లకులేదు-

"మీరు చెప్పిందీ నిజమే! అయితే నాలుగు కథలురాసి ఓ సంకలనం అచ్చే యించి దానికి పదిమందినీ ఆవిష్కరణ పేరుతో పిలిచి హడావుడి చేయడమూ నాకిష్టముండదు. మరి నా రచనల్లో పాఠకుల కాకర్షణేముంటుంది? అన్నాడు రచయిత.

"రచనలు పాఠకులకోసం. వారి నాకర్షించడం రచయిత డ్యూటీ!"

"నే నొప్పుకోను. ఈ రోజుల్లో రచనలు చదివి ఎవరూ రచయిత నారాధించడంలేదు. రచయిత వ్యక్తి గత జీవితాన్నిబట్టి అతడికి లభించే ప్రచారాన్నిబట్టి అతడి రచనలకు గిరాకీ ఉంటోంది. రచయిత వ్యక్తిగత జీవి




తంలో ఎన్ని తప్పులుండే అదంత ఆకర్షణ......

"పోనీ ప్రచారంకోసం మీరూ కొంత ప్రయత్నం చేయవలసింది......

"అది రచయితకు ఆత్మ హత్యా సదృశం. రచయిత పేరు తెల్సుకునేందుకు రచన ఒక్కటే దోహదం చేయాలి ప్రచారమంటే పార్టీలకు వెళ్ళాలి. పేరున్నవారిచుట్టూ తిరగాలి. మందు కొట్టాలి. మీకు తెలుసో తెలియదో–నేను ఏ కాంతాన్నభిలషిస్తాను. సాహిత్య చర్చలు మినహా మరేవీ యిష్టపడను. నా అలవాట్లంటారా – విస్కీ, బ్రాందీ, బీరు దాకా ఎందుకు? ఆఖరికి కాఫీ, టీలు కూడా తాగను........." అన్నాడు రచయిత.

నేను మరోసారి నారాయణమూర్తి గారివంక గర్వంగా చూశాను. ఆయన రచయితతో చాలాసేపు మాట్లాడేరు.

అక్కణ్ణించి బయటకు వచ్చాక —

"ఈ దెబ్బతో మీరు రచయితలపై అభిప్రాయం మారి ఉంటుంది–" అన్నాను.

నారాయణమూర్తిగారు నవ్వి–"ప్రతి రూలుకీ ఎక్సెప్షెన్సుంటాయి. ఆ విషయం నాకు తెలుసు–అన్నాడు.

"మీకు తెలియదు. తెలిస్తే నాకెప్పుడో చెప్పేవారు. ఇప్పుడు నేను చెప్పిన రచయితను కలుసుకున్నాకనే మీకావిషయం తెలిసింది–" అన్నాను.

"చాలా పొరపాటు. నాకతడిగురించి ఏమీ తెలియనిదే!"

"ముందేమీ తెలియదు, ఇప్పుడు తెలిసిందిగా!" అన్నాను.

"ఇప్పుడూ తెలియదు......"

"మరింతసేపు అతడితో మాట్లాడేరు అతడి గురించి ఏమీ తెలియలేదా"

"అతడు తన గురించి ఏమీ చెప్పందే ఎలా తెలుస్తుంది.

మరి ఇంతసేపూ అతడు మీకు చెప్పిందేమిటి?" అన్నాను అసహనంగా.

"అదా? తనతోపాటే రచనలుచేస్తూ తనకంటే ఎక్కువ పేరు తెచ్చుకున్న సమకాలిక రచయితలగురించిన రిమార్క్స్ అవి...అదే అతడు నాకు చెప్పాడు...అన్నాడు నారాయణమూర్తి గారు.

ఎప్పుడూ యింతే...అన్నీ తెలుసునని నేననుకున్నప్పుడల్లా నారాయణ మూర్తిగారితో మాట్లాడితే నాకేమీ తెలియదని తెలిసిపోతుంది. ㅇ

# మేనంపాటి భాస్కర్ సీరియల్

## తిరిగి చూశాడు శత్రుఘ్న

మొదలు నరికిన చెట్టులా విరుచుకు పడిపోయి ఉన్నాడు పొలిటీషియన్ వెంకట్రావు.

శత్రుఘ్న నొసలు ముడిపడ్డాయి. చకచక అతని దగ్గరికి వెళ్ళి పరీక్ష చేశాడు వెంకట్రావు ఆరోగ్యం బాగానే ఉందనీ, అతనికే రోగమూ లేదనీ, అతను వేస్తున్నవి దొంగ వేషాలని అర్థం కావడానికి ఎక్కువసేపు పట్టలేదు శత్రుఘ్నకి.

ఒంట్లో బాగులేనట్లు నటిస్తే తనని కూడా హాస్పిటల్‌కి తరలిస్తారని ఆశ పడుతున్నాడన్నమాట ఈ మనిషి!

రాజకీయ గుంటనక్క!



చెప్పలేనంత జుగుప్స కలిగించి శత్రుఘ్నకి.

ట్రాన్సిస్టర్ రేడియో ఆన్ చేశాడు వెంకటరెడ్డి.

వార్తలు వస్తున్నాయి. హైజాకర్లను గురించిన వార్త ప్రముఖంగా, లీడ్ అయిటెమ్‌గా చెబుతున్నారు.

పక్కనే ఉన్న ఇక్బాల్ వింటున్నాడు.

ఎక్సయిట్‌మెంటు కలిగించి అతనికి.

సామిరంగ! ఇవ్వాళ ప్రైమ్ మినిస్టరుకంటే తమ విషయమే ముఖ్యమై పోయిందన్నమాట రేడియో వాళ్ళకి!

ఈ సంగతి ముందే ఊహించి, చెప్పాడు శత్రుఘ్న! పేరుకి పేరూ డబ్బుకి డబ్బూ అని!

ఈ సంగతి శత్రుఘ్నకి చెప్పాలి! తక్షణం!

త్వరత్వరగా వచ్చి మళ్ళీ విమానం ఎక్కాడతను.

ఎక్కీఎక్కగానే అతనికి కిందపడి ఉన్న వెంకట్రావు కనబడ్డాడు.

"ఏమయింది దొంగ వెధవకి?" అన్నాడు ఇక్బాల్ కచ్చిగా!

"దొంగ నాటకం!" అన్నట్లు సైగ చేశాడు శత్రుఘ్న.

అది గ్రహించాడు ఇక్బాల్. తల ఊపి,

---

**జరిగిన కథ**

బ్యాంకు కాషియరు సుజాతకి ఢిల్లీలో పెళ్ళిచూపులు ఏర్పాటుచేసి ఉంటారు తల్లి దండ్రులు. ఆమెపని చేస్తున్న బ్యాంకుని దోచుకుంటారు శత్రుఘ్న, ఇక్బాల్, విక్టర్. ఆకేసుని దర్యాప్తు చేస్తుంటాడు ఇన్స్పెక్టరు రెడ్డి.

బ్యాంకు దోపిడీలో ఆశించినంత డబ్బు దొరక్క, ఒక విమానాన్ని హైజాక్ చెయ్యాలని ప్లాన్ వేస్తారు శత్రుఘ్న, అతని ఫ్రెండ్సూ.

విమానాన్ని తన అదుపులోకి తెచ్చుకున్న తర్వాత, ప్రభుత్వానికి తన డిమాండ్స్ తెలియజేస్తాడు శత్రుఘ్న, తమకి పదికోట్ల రూపాయలు ఇచ్చి, పాకిస్తాన్‌కి పోనివ్వాలని అడుగుతాడు. ఆలోచించుకోవడానికి వ్యవధి కావాలని చెబుతారు ప్రభుత్వాధికారులు.

ఈ లోగా, విమానంలో ఫ్యూయెల్ అయిపోతోందని చెబుతాడు పైలట్ సవ్యసాచి.

విమానం ఉపయోగంలో లేని ఒక పాతకాలపు ప్రైవేట్ ఎయిర్‌స్ట్రిప్‌మీద దిగుతుంది.

నిజాయితీ పరుడైన రెడ్డి అంటే గిట్టనివాళ్ళు అతన్ని ఆమారుమూల ఊరికి ట్రాన్స్‌ఫర్ చేయించి ఉంటారు. అక్కడ దిగిన విమానం దగ్గరికి చేరుకుంటాడు రెడ్డి. ప్లేనని హైజాక్ చేస్తున్నది తన స్నేహితుడు శత్రుఘ్న అని తెలుస్తుంది రెడ్డికి.

తన జీవితం బలవత్తరమైన మలుపు తిరగడానికి కారణమైన మోహన అనే అమ్మాయి చెల్లెలే సుజాత అని తెలుస్తుంది శత్రుఘ్నకి.

అనారోగ్యంగాఉన్న పాసింజెర్సుని విడిచిపెట్టెయ్యాలనుకుంటాడు శత్రుఘ్న సుజాతనికూడా వెళ్ళిపొమ్మంటాడు. కానీ ఆమె వెళ్ళదు.

అయోమయం మనిషిలా కనిపించే ప్రొఫెసర్ సుందరం, హైజాకర్లని లొంగదీసుకోవడానికి అమోఘమైన ప్లాను పైలట్ సవ్యసాచికి చెబుతాడు; రహస్యంగా.

---

—ఇక చదవండి—

"ఇప్పుడే న్యూస్ వినిపస్తున్నా... ...షు పెద్దగా.
"ఏమిటి విశేషాలు?"

చెప్పాడు ఇక్బాల్. తర్వాత సానుభూతిగా గొంతుపెట్టి అన్నాడు. "పాపం! ఈ వెర్రి వెంకట్రావు దురదృష్టం చూడు! ఇప్పుడే చెప్పారు వార్తల్లో, ఈయన్ని సెంట్రల్ మినిస్ట్రీలోకి తీసుకున్నారుట. ఈయనేమో ఇట్లా విరుచుకు పడిపోయాడు లేకపోతే ఈయన్ని వదిలేసి ఉండేవాళ్ళం కదా! ఈయనెళ్ళి మన ఆంధ్రాకి ఎన్నో ప్రాజెక్టులు సాధించుకొచ్చేవాడు కదా!"

స్ప్రింగులా లేచి కూచున్నాడు వెంకట్రావు. అతని మొహం "కోటివాట్ల బల్బులా" వెలిగిపోతోంది.

"ఏమిటి! నన్ను సెంట్రల్ మినిస్ట్రీలోకి తీసుకున్నారా? నేముందే చెప్ప లేదూ! నన్నిక పంపేస్యండయ్యా! ప్రమాణ స్వీకారం సంగతి ఏమన్నా చెప్పారా ఇంతకీ!" అని మణికట్టు లోపలికి వచ్చేటట్లు పెట్టుకున్న వాచీవైపు చూసుకుని. "ఇంగ్లీషు న్యూసా?" అన్నాడు.

"అ ఇంగ్లీషు న్యూసే! బీబీసీలో వచ్చింది.

"బీబీసీదే!" అన్నాడు వెంకట్రావు ఉప్పొంగిపోతూ. అంతలోనే అనుమానం తోచింది అతనికి. "బీబీసీనా! నువ్వు చెబుతోంది నిజమా? పరాచికమా?"

"నిజంగా పరాచికం!"

హతాశుడయిపోయాడు వెంకట్రావు.

"ఓరి నీ నోట్లో దుమ్ముపడా! అబద్ధాలు చెప్పి ఇంత ఆశ కలిగిస్తావా?" బక్కకోపంతో వణికిపోతూ అన్నాడు.

"మన వృత్తే అదికదా!" అన్నాడు ఇక్బాల్ దెబ్బతీస్తూ.

భరించలేనంత నిరాశ కలిగింది వెంకట్రావుకి. కేవలం మంత్రి పదవిని ఆశించే రాజకీయాల్లోకి వచ్చాడు. అతని దానికోసమే నానాగడ్డీ తిన్నాడు. గడ్డి తిని పించాడు నమ్మిన వాళ్ళని నట్టేట ముంచుతూ, ఎత్తులకి పై ఎత్తులువేసి ప్రత్యర్థు లని మట్టి కరిపిస్తూ, రాజకీయ నిచ్చెనలో మెట్లు ఎక్కేసి, మంత్రి పదవిని అందుకు నేంత ఎత్తుకి వచ్చాడు.

ఇప్పుడు...ఇప్పుడు...ఒక్క నిముషంసేపు...మంత్రి పదవి తనని వరించే సిందని నమ్మేశాడు. నిజంగానే!

అది నిజంగా నిజం కాదా? పరాచికమా?

కాలకూట విషంలా ఉన్న ఆ చేదు నిజాన్ని భరించలేక పోయాడు అతను

కడుపులో తిప్పుతున్నట్లూ కళ్ళు తిరుగుతున్నట్లూ ఒళ్ళు తూలిపోతున్నట్లూ అనిపించింది

ఈ సారి నిజంగానే స్పృహతప్పి విరుచుకుపడిపోయాడు వెంకట్రావు

పీణ్ణి కూడా వ్యాన్లో వెయ్యాలా?" అన్నాడు ఇక్బాల్!

"వద్దు! వీడితో ఇంకా పని ఉంది ఇక్కడే ఉండనీ!" అన్నాడు శత్రుఘ్న.

వేన్ స్టార్ట్ చేశాడు మెహబూబ్

వెళ్ళి వస్తాను శత్రూ!" అన్నాడు వెంకటరెడ్డి.

మౌనంగా చెయ్యి ఊపాడు శత్రుఘ్న.

ప్రొఫెసర్లనీ, పేషంట్లనీ తీసుకుని వేన్ కదలింది.

సాటి పాసింజర్స్ కొంతమంది స్వేచ్ఛా ప్రపంచంలోకి వెళ్ళిపోతూ ఉంటే తాము బందీలుగా ఇంకా అక్కడే ఉండిపోవలసి రావడం చాలా మందికి దిగులునీ, ఆక్రోశాన్నీ కలిగించింది. ప్రాణభయం వాళ్ళ మనసులని మథించేస్తోంది.

వెక్కి వెక్కి ఏడవడం మొదలెట్టింది. ఎవరో ఒక స్త్రీ.

సూర్యుడు మెల్లిమెల్లిగా ఆకాశంలో పైకి ఎగబాకుతున్నాడు. ఎండ తీక్షణత పెరుగుతోంది.

ఎయిర్ క్రాఫ్ట్‌లో ఎయిర్ కండిషనింగ్ ఆఫ్ అయిపోయింది. ఎండెక్కేకొద్దీ ఎయిర్‌క్రాఫ్ట్ గాడిపొయ్యిలా వేడెక్కి పోతోంది. ఒళ్ళంతా చెమటలు పట్టేశాయి అందరికీ. బట్టలు తడిసిపోతున్నాయి స్వేదంతో. కుతకుత లాడిపోతున్నారు జనం.

అది గమనించాడు శత్రుఘ్న.

"ఇక్బాల్! నువ్వు కిందికి దిగు!" అన్నాడు.

కిందికి దిగి రెడీగా నిల్చున్నాడు ఇక్బాల్.

తర్వాత పాసింజర్సు అందరినీ ఒకళ్ళ తర్వాత ఒకళ్ళుగా కిందికి పంపాడు శత్రుఘ్న.

శాలినిని తాకుతూ నిలబడి ఉన్న విక్టర్‌ని చూసి గదమాయించి, అతన్ని కూడా కిందికి వెళ్ళమన్నాడు. అతని రివాల్వర్ నిర్దయగా అందరినీ గురిచూస్తోంది.

కిందికి దిగిన అందరినీ జాగ్రత్తగా కనిపెట్టి చూస్తున్నాడు ఇక్బాల్.

"దాహం! దాహం!" అని కలవరిస్తూ దిగుతున్నాడు ఒక లావాటి మనిషి



లూజుగా జర జర లాగుతున్న శరీరంతో, పెద్ద బొజ్జతో, చిన్నతలతో ఉన్నాడతను అతని పేరు జైన్. బ్లాక్ మార్కెట్లో కోట్లు సంపాదించాడు. అతని తలమీద నుంచీ చెమట ధారలుగా పడి పిల్లకాలువల్లా కారిపోతోంది. భయంతో, దాహంతో అతని పెదిమలు ఎండిపోయాయి.

"మోనికా" అన్నాడు శతృఘ్న. "ఆ కంటెయినర్స్‌లో ఉన్న వాటర్ అంద రికీ తలో గ్లాసూ ఇవ్వు!"

వెళ్ళి చూసింది మోనికా విమానం అటూ ఇటూ ఒరగడంలో నీళ్ళు చాలా వరకూ దొర్లిపోయాయి. అందరికి తలో అరగ్లాసూ రావడం కూడా అనుమానమే!

అదే చెప్పింది మోనికా.

"సరే! ఆపరేషన్ చెయ్యి! స్నాక్స్ ఏమన్నా ఉంటే అవి కూడా డిస్ట్రి బ్యూట్ చెయ్యి! ఇన్స్‌పెక్టర్ రెడ్డి హాస్పిటల్ నుంచీ ఊళ్ళోకి వెళ్ళి తిండి తిప్పల ఏర్పాట్లు చేసే సరికి చాలా ఆలస్యం కావచ్చు".

"సరే సర్!" అని సందేహంగా ఆగింది. మోనికా.

ఏమిటన్నట్లు చూశాడు శతృఘ్న.

"ఈ స్నాక్స్‌లో..."

నవ్వాడు శతృఘ్న. "విషం కలిసిందేమో అంటావా? లేదు! అది తేల్చుకున్న తర్వాతే చెబుతున్నాను

ఆశ్చర్యంగా చూసి, అనుపమని పిలిచింది మోనికా. ఆ హోస్టెస్‌లు ఇద్దరూ కలిసి మెకానికల్‌గా పర్క్ చేస్తూ అందరికీ స్నాక్స్, మంచినీళ్ళు పంచారు.

స్మితని చూసి చిరునవ్వు నవ్వింది మోనికా. "స్వీటీ! మంచి నీళ్ళు ముందు తాగేయ్! పారబోసుకుంటే ఇంక లేవు!"

తల ఊపి, గ్లాసుని పెదిమలదాకా తీసుకెళ్ళి, మళ్ళీ కిందకు దింపింది స్మిత. నోరు కొద్దిగా తెరిచి, కళ్ళప్పగించి, ఒక దృశ్యాన్ని చూస్తూ ఉండిపోయింది.

వెనక్కి వెనక్కి తిరిగి ఓరచూపులు చూస్తూ విమానం వెనక్కి వెళుతోంది. సినీతార శాలిని. ఆమె వెనకే వెళ్ళాడు విక్టర్.

ఆ వెందుకు వెళుతున్నారు వాళ్ళు?

సహజంగానే కుతూహలంపాలు ఎక్కువగల ఆ పాప కళ్ళార్పకుండా చూస్తోంది.

నెమ్మదిగా శాలిని భుజంమీద చెయ్యి వేశాడు విక్టర్.

వళ్ళు ఝల్లు మన్నట్లు ఒక ఎక్స్‌ప్రెషన్ ఇచ్చింది శాలిని, అచ్చం సినిమాల్లో లాగే తన అందమైన నాసిక మరింత ప్రస్ఫుటంగా కనబడేటట్లూ, తన పొంకాలు మరింత ప్రముఖంగా కనబడేటట్లూ అద్భుతమైన యాంగిల్‌లో ప్రొఫైల్ కనబడే టట్లూ పక్కకి తిరిగి, అరమోడ్పు కళ్ళతో విక్టర్‌ని చూసింది.

జన్మధన్యమై పోయినట్లు ఆనందపడ్డాడు విక్టర్.

కుతూహలం ఆపుకోలేకపోతోంది స్మిత.




చటుక్కున ఆమె చేతిలోని గ్లాసునీ, శాండ్ విచ్ నీ ఎవరో దౌర్జన్యంగా గుంజేసుకున్నారు.

ఉలిక్కిపడింది స్మిత.

బ్లాక్ మార్కెటీర్ జైన్ స్మిత గ్లాసులోని నీళ్ళని ఒక్క గుక్కలో తాగేశాడు. ఆ పాప వాటాకి వచ్చిన రొట్టెముక్కలని కూడా ఆబగా నమిలి మింగేశాడు.

అది చూసి పట్టరాని కోపంతో అరిచారు కొంతమంది. కొంతమంది ఛీత్కారాలు చేశారు.

మెల్లిగా అతని దగ్గరికి వెళ్ళి, చెంప ఛెళ్ళుమనేలా కొట్టాడు ఇక్బాల్.

"కుత్తా' ఎందుకలా చేశావ్రా?"

భయంగా చెంప తడుముకున్నాడు జైన్. "నేను...నేను ఆకలి దప్పులకి తట్టుకోలేక.."

కసిగా నవ్వాడు ఇక్బాల్.

"ఆకలిదప్పులు తీర్చుకోవడంకోసం ఏ తప్పయినా చేస్తావన్నమాట నువ్వు ఆకలి అంటే నీకేం తెలుసురా! సికింద్రాబాదు స్టేషన్ దగ్గర చూశాను ఒకసారి! ఆకలితో వెర్రెక్కిపోయిన మనిషి ఒకడు, ఎవరో కిళ్ళీ నమిలి ఉమ్మేస్తే అందులోని వక్కపలుకులు ఏరుకుతినడం చూశారా నేను! ఈ సోకాల్డ్ పెద్దమనుషులెవరూ వాణ్ణి పట్టించుకోకుండా వెళ్ళిపోతుంటే, కటికవాణ్ణి కసాయివాణ్ణి అయిన నేను మాత్రం ఏడ్చానురా!" మళ్ళీ ఫట్ మని కొట్టాడు ఇక్బాల్. "అదిరా ఆకలి అంటే!"

హడిలిపోయాడు జైన్.

వాచ్ చూసుకున్నాడు శతృఘ్న. అతను చెప్పిన డెడ్ లైన్ దాటిపోయి పది నిమిషాలు అవుతోంది.

ఇంతవరకూ అతని డిమాండ్స్ కి సమాధానం రాలేదు.

కోపంగా పైలట్స్ కేబిన్ లోకి నడిచాడు.

ఎయిర్ పోర్టుతో కంటాక్ట్ ఏర్పడగానే, "టైం ఈజ్ అప్! మొదటి పాసెం

జరుని చంపేస్తున్నాను." అన్నాడు రూడ్‌గా.

"ఎయిర్ పోర్టులో మెహతా గాభరా పడ్డాడు. "ప్లీజ్! ఇంకొంచెం ఓపికపట్టు ఢిల్లీలో అత్యవసర సమావేశం జరుగుతోంది! ఏ క్షణాన అయినా వాళ్ళొక నిర్ణయానికి రావచ్చు!"

"వాళ్ళకి అంత వ్యవధి ఉందనుకోను! ఈలోగా నాపని నేను మొదలెడతాను."

కంగారుగా ఏదో చెప్పబోయాడు మెహతా. కట్ చేసేసి. కిందికి దిగాడు శతృఘ్న.

ప్యాసెంజర్స్ అందరినీ వరసగా నిలబెట్టి ఉంచాడు ఇక్బాల్. అందరూ భయభ్రాంతులయి చూస్తున్నారు.

చావు తమలో మొదటగా ఎవరిని వరించబోతోంది?

ఆ తర్వాత రెండో స్థానంలోకి వచ్చే అభాగ్యులెవరు?

అందరూ చనిపోతారా? కొందరేనా మిగులుతారా? మిగిలే వాళ్ళలో తాము ఉంటారా? ఉండరా?

నరాలు తెగిపోయే సస్పెన్సు!

మృత్యువుని ముఖాముఖీ కలుసుకుంటున్నట్లే ఫీలవుతున్నారు చాలామంది.

ఇక్బాల్ శతృఘ్న దగ్గరికి వచ్చాడు.

"షాట్‌గన్! అందరికంటే ముందు చంపాల్సింది ఈ నీచుణ్ణి. పసిపాపని కూడా మోసంచేసిన పాపాత్ముడు వీడు!" అన్నాడు జైన్‌ని చూపిస్తూ.

అది వినగానే బిగ్గరగా ఆర్తనాదం చేశాడు జైన్! "వద్దు! వద్దు! నన్ను చంపొద్దు! నాకు అప్పుడే చావాలని లేదు!"

"అప్పుడే చావాలనిలేదూ?" అన్నాడు ఇక్బాల్ ఎకసెక్కెంగా "ఇప్పుడప్పుడే




భార్గవ్ ఆర్ట్ ప్రొడక్షన్స్
ముద్దుల క్రిష్ణయ్య
S గోపాల్ రెడ్డి B Sc (Ag)
కోడి రామకృష్ణ

చావవునువ్వు! నిన్ను మా మాంసం దుకాణంలో మేకలని వేళ్ళాడ దీసినట్లు కొక్కానికి తగిలించి విమానానికి వేలాడదీస్తాను. గంటలసేపు భూమ్మీదే నరకాన్ని అనుభవించి చస్తావు నువ్వు!"

పెద్దగా ఏడవడం మొదలెట్టాడు జైన్. చెట్టంత మొగాడు భోరున ఏడుస్తుంటే, ఆ దృశ్యం చూసేవాళ్ళకి హృదయ విదారకంగా ఉంది.

పైగా, అందరికీ తెలుసు! ఇది చివరి చావుకాదు. ఇది మొదలు! అంత మెక్కడో, ఎప్పుడో తెలియదు!

ఇక్బాల్ జైన్‌వైపు నడపబోయాడు.

అతన్ని వారించాడు శతృఘ్న. "ఇక్బాల్! పాపం అతను దాహంతో ఉన్నాడు. ఇంకో గ్లాసు నీళ్ళు తాగనివ్వు!" అంటూ విమానంలోకివెళ్ళి, చేతిలో గ్లాసుతో తిరిగి వచ్చాడు.

ఆ హైజాకర్ హఠాత్తుగా తనమీద అంతదయ చూపించడం అనుమానాస్పదంగా కనబడింది జైన్‌కి.

"ఏమిటిది?" అన్నాడు సంశయంగా.

"మంచినీళ్ళు తాగు.

"ఉన్నట్లుండి మిస్టరీ విడిపోయినట్లనిపించింది జైన్‌కి.

"కాదు. ఇది విషం కలిసిన డ్రింకు! నాకు తెలుసు!"

నవ్వాడు శతృఘ్న. "తాగు!"

వల వల ఏడుస్తూ, నేలమీద సాగిలపడ్డాడు జైన్. చేతులతో శతృఘ్న పాదాలని చుట్టేశాడు. అతని పాదాలు తొక్కుతున్న నేలని ముద్దుపెట్టుకున్నాడు.

"బాబూ! నాకంటే చిన్నవాడి వయినా నీ కాళ్ళమీద పడి ప్రార్థిస్తున్నాను. నన్ను చంపకు బాబూ! వదిలెయ్!"

కాలితో అతన్ని నెట్టేశాడు శతృఘ్న.

వెంటనే ఇక్బాల్ కాళ్ళు పట్టుకున్నాడు జైన్.

కసిగా అతని డొక్కలో తన్నాడు ఇక్బాల్

దిక్కుతోచనట్లు చూసి, స్మిత పాదాలమీద పడ్డాడు!

"నన్ను క్షమించు పాపా! నన్ను రక్షించు పాపా! నాకు చావాలని లేదు! నాకింకా బతకాలని ఉంది! నన్ను చంపొద్దని చెప్పుపాపా!"

ఏదో అనడానికి నోరు తెరిచింది స్మిత.

"తాగు!" అన్నాడు శతృఘ్న స్థిరంగా, అతని నోటివెంబడి మరో మాట రావడం లేదు.

వెక్కుతు, గ్లాసుని పెదిమల దగ్గరికి తీసుకెళ్ళాడు జైన్. తర్వాత ఉన్నట్టుండి గ్లాసునికిందపెట్టేసి, గుండెలు అవిసిపోయేలా రోదిస్తూ, నేలమీద పొర్లాడు.

నిర్దాక్షిణ్యంగా చూస్తున్నాడు శతృఘ్న. అతని చేతిలోని రివాల్వర్ బద్ధకంగా

జైన్ కళ్ళలోకి చూస్తోంది.

ఉన్నట్లుండి శివమెత్తిన వాడిలా లేచికూర్చుని, గ్లాసుని రెండు చేతులతో పట్టుకుని గటగటా తాగేశాడు జైన్.

ఊపిరి పీల్చడం మర్చిపోయి చూస్తున్నారు అందరూ.

శ్వాస అందక అల్లాడుతున్న వాడిలా కనబడ్డాడు జైన్. అతని డొక్కలు ఎగరెగిరి పడుతున్నాయి. కళ్ళు కనురెప్పలలోకి వెళ్ళిపోతున్నాయి. పెదిమల పక్కనుంచీ నురుగు వస్తోంది.

★ ★ ★

**తను చేసిన తప్పులని క్షమించమన్నట్లు అందరిముందూ** మోకరిల్లిన భంగిమలోనే చలనం లేకుండా నీలుక్కుపోయింది జైన్ శరీరం.

శవం తలమీద వెంట్రుకలు మాత్రం విషాదంగా తలలూపుతున్నట్లు గాలికి కదులుతున్నాయి.

అది చూస్తున్న అందరి మనసులనీ భయం మథించేస్తోంది.

"విషం తాగినా వాంతులూ అవీ ఏమీ చేసుకోకుండానే చచ్చాడే వీడూ!" అన్నాడు ఇక్బాల్

నిరసనగా నవ్వాడు శతృఘ్న కడుపులోకి విషం చేరితే వాంతులవుతాయి. గుండెల్లో భయం గూడుకట్టుకుంటే గుండె ఆగిపోతుంది.

ఆ డ్రింకులో విషం కలవలేదు. భయం కలిసింది. దాహమని లబలబలాడుతున్నాడుకదా అని మంచి నీళ్ళు ఇచ్చాను. అది విషం కలిసిన డ్రింకు అనుకుని బెదిరిపోయాడు. నేను అవుననీ చెప్పలేదు. కాదనీ చెప్పలేదు. అంతే! ఫినిష్!

నోరెళ్ళ బెట్టాడు ఇక్బాల్. "ఈ చావు మరీ దారుణం షాట్‌గన్! పచ్చిమంచి నీళ్ళని పరమ విషమనుకుని తాగి పరలోకానికి పాస్‌పోర్టు తీసుకున్నాడా! పాపం!"

"పాపం అనుకోనక్కర్లేదు! లోకంలో ఒక పాపాత్ముడు తగ్గాడని సంతోషించాలి. అంతే! నువ్వు వీళ్ళని కనిపెట్టి ఉండు. నేను ఈ చావు కబుర్ని చల్లగా ఎయిర్ పోర్టుకి చేరవేస్తాను.

కొద్దిసేపటి తర్వాత శతృఘ్నకి ఎయిర్ పోర్టుతో కాంటాక్ట్ ఏర్పడింది.

"మొదట శవం రెడీగా ఉంది." అన్నాడు అతను, అది చాలా మామూలు సంగతి అయినట్లు.

అవతల మనిషి గట్టిగా ఊపిరి లోపలికి తీసుకున్న శబ్దం. కొద్ది క్షణాల మౌనం తర్వాత మెల్లిగా అన్నాడు మెహతా.

"నువ్వు పరమ కిరాతకుడివి."

నవ్వాడు శతృఘ్న, "అని మీరు గ్రహించడమే నాకు కావలసినది. ఇంకో గంటలో రెండో శవం లేస్తుంది. ఇది బెదిరింపుకాదు. హెచ్చరిక అని గుర్తుపెట్టు

కోండి "

రేడియో ఆఫ్‌చేసి, విమానంలో నుంచి కిందికి దిగాడు.

జైన్ చావు ప్రభుత్వాన్ని చచ్చే టెన్షన్‌పెట్టి చంపేస్తూ ఉంటుందని అతనికి తెలుసు.

దూరంగా వినబడింది మోటార్ ఇంజన్ శబ్దం, అది క్రమంగా దగ్గర యింది. పోలీసువ్యాను ఆగగానే ఇన్‌స్పెక్టర్ రెడ్డి, కానిస్టేబుల్ మెహబూబ్ కిందికి దూకి వ్యాను వెనక తలుపు తెరిచి పెద్దపెద్ద డేగిసాలలో ఉన్న పంటకాలు దించారు.

పొద్దుటినుంచీ అకలితో నకనక లాడిపోయిన ప్రయాణీకులకు జైన్ చావుతో ఆకలి చచ్చిపోయింది.

అందుకని, వ్యానులోనుంచి దిగుతున్న ఆహార పదార్థాలని అనాసక్తిగా చూస్తున్నారు వాళ్ళు.

అంతమందికి ఒక్కసారిగా వడ్డించడం కేవలం ఇద్దరు మనుషులవల్ల అయ్యే పని కాదని తెలుసు శతృఘ్నకి.

"వడ్డనకి వాలంటీర్లు కావాలి. ఎవరొస్తారు?" అన్నాడు.

అతను ఊహించిన దానికంటే ఎక్కువమందే చేతులెత్తారు. "నేను...నేను... నేను..." అంటున్నారు గొడప గొడవగా. అతని అనుగ్రహం సంపాదించి, చావు తప్పించుకోవడంకోసం తహతహలాడి పోతున్నారు వాళ్ళందరూ

"సైలెన్స్!" అన్నాడు శతృఘ్న. "వెర్రివేషాలేశారంటే నడుములు విర క్కొడతాను.

భయంతో నీలుక్కు పోయారు ప్రయాణీకులు.

వాళ్ళని పరిశీలించి, కొంతమందిని సెలెక్ట్ చేశాడు శతృఘ్న "ఇదిగో ఓ పొడుగాయనా! నువ్వురా! ఆ పక్కన నాలుగోవాడు! నువ్వుకూడా! ఏయ్ బట్టతలా నువ్వూ రావాలి!.

వాళ్ళంతా వినయంగా ముందుకి వచ్చారు. నాలుగో మనిషికోసం శతృఘ్న చూపులు అందరినీ పరికిస్తూ ముసలాయన సుభాష్ చంద్రబోస్‌ని దాటేసి ముందుకు పోబోయి ఆగాయి.

వడ్డనలోకి తనుకూడా దిగాలని తహతహలాడి పోతున్నట్లు కనబడుతున్నాడు సుభాష్ చంద్రబోస్.

ఆయనకి జిహ్వా చాపల్యం ఎక్కువని గుర్తొచ్చింది శతృఘ్నకి.

నువ్వు కూడా వస్తావా ఏమిటి? సరేరా!...అన్నాడు

తనకేదో మహద్భాగ్యం పట్టినంత మహోత్సాహంతో ముందుకి వచ్చాడు సుబాష్ చంద్రబోస్.

"గబగబ విస్తళ్ళు పరచండి! త్వరత్వరగా వడ్డనా, భోజనాలు పూర్తయి పోవాలి, అందరూ గుర్తుంచుకోండి! అబ్సల్యూటిలీ నో మంకి బిజినెస్! తోకాడిస్తే తల తీసేస్తాను! జాగ్రత్త!"




హడావిడిగా విస్తళ్ళు పరిచేశారు మైదానంలా ఉన్న ఆ ప్రదేశంలో హోరున వీస్తోంది గాలి విస్తళ్ళు ఎగిరిపోకుండా రెండు చేతులతో పట్టుకుని కూర్చున్నారు ప్రయాణీకులు

సుజాత మాత్రం భోజనానికి కూర్చోలేదు శతృఘ్నకి దగ్గరలోనే నిలబడి ఉంది తను

"ఏం! నీకే మొచ్చింది! తిండితిను!" అన్నాడు శతృఘ్న విసుగ్గా,

సుజాత మాట్లాడ లేదు

ఈలోగా ఇన్‌స్పెక్టర్ రెడ్డి శతృఘ్నని సమీపించాడు.

"శత్రూ! ఇది నీకోసం ప్రత్యేకం! మా ఆవిడచేత వండించాను గుమ్మడి కాయ వడియాలు వేసిన పచ్చిపులుసు కందిపచ్చడి నీ ఇష్టాలు నాకింకా గుర్తున్నా యిరా శత్రూ!"

చిరునవ్వుతో అతని మొహంలోకిచూసి, "థాంక్స్ రెడ్డీ!" అన్నాడు శతృఘ్న ఆప్యాయంగా టిఫిన్ కారియర్ అందుకున్నాడు అతను అన్నం కలుపుకోగానే. చిన్న గిన్నెలో ఉన్న నేతిని ధారాళంగా అతని చేతిమీద వంపాడు రెడ్డి

ముద్దచేసి నోటి దగ్గర పెట్టుకోబోతూ హఠాత్తుగా ఆగాడు శతృఘ్న అతని మొహంలో చిరునవ్వు మాయమయింది నోటిదాకా వెళ్ళిన చెయ్యి కిందికి దిగింది,

"వెనకటి రోజులు గుర్తున్నాయన్నావు-దు రెడ్డీ! మరి ఈ సంగతి ఎలా మర్చిపోయావ్! షేర్ చేసుకోకుండా దేన్నీ తినేవాళ్ళం కాదుమనం! అలవాట్లలో పొరబాట్లు రానీయకు రెస్డి! మొదటి ముద్ద నువ్వు తిను!"

రెడ్డి మొహం-చిన్న బోయింది.

"నన్ను అనుమానిస్తున్నావా శత్రూ?" అన్నాడు నెమ్మదిగా.

శతృఘ్న రెడ్డిని అనుమానించినందుకు తనకే ఎక్కువ అవమానం కలిగి నట్లు చరచర ముందుకు వచ్చింది సుజాత

"ఆప్తుల అభిమానాన్ని అనుమానించి అవమానించడం చాలా అల్పత్వం అనిపించుకుంటుంది మిస్టర్ షాట్‌గన్! ఫ్రెండ్‌షిప్ అంటే స్నేహితుడు విషం పెట్టినా తప్పించుకోవడానికి మిష వెదక్కుండా తినెయ్యడానికి సిద్ధంగా ఉండాలి ఇలా తెండి ఆ అన్నం. మొదటిముద్ద నేనే తింటాను"

ఆమెని వారించబోయాడు రెడ్డి. అంతలోనే ఆమె ముద్దనోట్లో పెట్టేసుకుంది.

"సుజాతా!" అన్నాడు శత్రుఘ్న అప్రయత్నంగా.

ప్లేటు శత్రుఘ్నకి అందించింది సుజాత.

"అనుమానం తీరిందా? ఇంక తినొచ్చు మీరు"

తనకు అన్నం అందిస్తున్న ఆ సుకుమారమైన చేతులని తదేకంగా చూశాడు శత్రుఘ్న. చిన్నప్పుడు తనకు అన్నం కలిపి ఆప్యాయంగా తినిపించిన అమ్మ అమృత హస్తాలు గుర్తొచ్చాయి.

కూరలు కొనడానికి డబ్బులేక కారపు మెతుకులు కలిపిపెట్టి, కారం మరీ ఎక్కువయిందేమో అన్న భయంతో ముందు తనొక ముద్దతిని చూసే అమ్మ గుర్తొచ్చింది.

ఈ అమ్మాయీ అంతేనా? రెడ్డి తెచ్చిన అన్నంలో ఏమన్నా కలిసిందేమో అని తనకన్నా ఆమెకే ఎక్కువ భయం ఉన్నట్లూ, లేదని నిశ్చయం చేసుకోవడానికే మొదటి ముద్ద తను తిన్నట్లు అనిపిస్తోంది! అది నిజమా?

తన అక్కయ్య మోహన వైనవైనాలుగా వర్ణించి చెప్పిన ఆ పాత శత్రుఘ్నని మరచిపోలేక పోతోందా ఈ అమ్మాయి పైకి ఎంత నిష్ఠూరంగా మాట్లాడినా?

చలితో రక్తాన్ని గడ్డకట్టించే శీతాకాలం తర్వాత, తాపాన్ని కలిగించే గ్రీష్మానికి ముందు, వేసవిరాకను సూచిస్తూ చల్లటి, మెల్లటి పిల్లతెమ్మెర ఒకటి వీచగా శరీరం సేదదీరినట్లు అతని మనసు ఆహ్లాద భరితంగా అయిపోయింది, కొద్ది క్షణాల పాటు.

బండబారి పోయిందనుకున్న అతని గుండె అతి కొద్దిగా స్పందించింది.

ఇనెస్పెక్టర్ తెచ్చిన ఆఅన్నం తింటే తన ప్రాణానికపాయమేమో అనికూడా భయపడలేదా ఆ అమ్మాయి?

తన స్వంత ప్రాణాలకంటే ఈ రాక్షసుడు ఎక్కువనిపించాడా? ఆర్ద్రంగా చూశాడు శత్రుఘ్న. ఆమె విశాల నయనాలు అతన్నే కనురెప్ప వెయ్యకుండా చూస్తున్నాయి.

ఉన్నట్లుండి, అలర్టుగా అయిపోయాడు శత్రుఘ్న ఆ అమ్మాయి చూపుల్లో ఏదో అసహజత్వం కనబడింది

ఆ అమ్మాయి కనుగుడ్లు మెల్లిగా పై రెప్పలలోకి వెళ్ళిపోతున్నాయి. కింది పెదిమ కొద్దిగా వంకర తిరిగింది. తల బలహీనంగా వాల్చేసి పక్కకి ఒరిగి పోతోంది తను.






ప్రముఖ సినీనటి జయసుధ 27-1-'86 సోమవారంనాడు గోద్రెజ్ కంపెనీ వారి "డెస్టో" సింథటిక్ డిటర్జెంట్ పౌడరును మార్కెట్‌లోకి విడుదలచేశారు.

కార్యక్రమానికి ప్రముఖ తెలుగు రచయిత్రి డాక్టర్ సి. ఆనందారామం అధ్యక్షత వహించారు.



ఫిబ్రవరి 25 న తుమ్మలపల్లి కళాక్షేత్రంలో ప్రసిద్ధికెక్కిన 'గోద్రెజ్ వారి మార్వెల్ బ్యూటీ' సబ్బును శ్రీమతి మైత్రి మంగరాజుగారి ద్వారా విడుదలచేసినప్పటి చిత్రం

ఈ కార్యక్రమానికి ప్రముఖ జర్నలిస్ట్ తుర్లపాటి కుటుంబరావు అధ్యక్షత వహించారు



ఈ రెండు సభలకూ గోద్రెజ్ కంపెనీ దక్షిణప్రాంతపు సేల్స్ మెనేజర్ శ్రీ ఎ కె ఎన్ రావు హాజరై వారి ఉత్పత్తుల వైశిష్ట్యాన్ని వివరించారు

రెడ్డి నిర్ఘాంతపోయి ఇదంతా చూస్తున్నాడు

"సుజాతా!" అంటూ ఒక్క ఉదుటులో ఆమెని చేరి, పగిలిపోకుండా చేతులు చుట్టూ వేశాడు శతృఘ్న

అతని మొహంలోకి చూడడానికి ప్రయత్నించింది సుజాత. కాని దృష్టి కేంద్రీకరించలేక పోతోంది తను

"సుజాతా! సుజాతా! ఏమయింది సుజాతా! మాట్లాడు!"

ఆమె మాట్లాడడానికి ప్రయత్నిస్తూ పెదిమలు తెరిచింది పెదిమలు తెరుచుకునే లోపల కళ్ళు మూతలు పడిపోయాయి నోటి వెంబడి నురుగు వెలుపడలేదు

సుజాతను పట్టుకుని కింద కూర్చుండిపోయాడు శతృఘ్న. ఆమె తలని తన ఒళ్ళో పెట్టుకున్నాడు. ఆదుర్దాగా నాడి చూశాడు. గుండెల మీద చెవి ఆన్చి హార్ట్ బీట్ విన్నాడు.

అంతా నార్మల్‌గానే ఉంది.

మరి?

అతని నొసలు ముడిపడ్డాయి,

నవ్వు ఆపుకోవడానికి ప్రయత్నించి విఫలమవుతున్నట్లు గదిలించాయి సుజాత పెదిమలు.

ఆ అమ్మాయి నాటకమాడుతోందని అతనికి అర్థమయింది. విసురుగా ఆమెని తన ఒళ్లోనుంచి తీసేశాడు.

ఆమె తల గట్టిగా నేలకు తగిలింది. చేత్తో తల తడుముకుంటూ లేచికూర్చుంది సుజాత.

"షేకారయిపోయారా! చిన్న టెస్టుచేసి చూశాను. మీరు లిట్మస్ టెస్టుచేస్తూ ఉంటారు కదండి కెమికల్సుతో. అది మందులమీదా, ఇది మనసులమీదా! అంతే తేడా! మీలో మానవత్వం ఇంకా మిగిలి ఉందో లేదో చూడడానికే ఈ చిన్న పరీక్ష! రిజల్టు పాజిటివ్! సాటి మనిషి చచ్చిపోతుందేమో అన్న ఆరాటం ఇంకా చావలేదు మీలో!"

ఎదుటి మనిషి బలహీనత కనిపెట్టేసినట్లు విజయగర్వంతో వెలిగిపోతోంది ఆమె మొహం ఒక్కొక్క అక్షరం ఒత్తి పలుకుతూ, స్థిరంగా అన్నాడు శతృఘ్న

"నిప్పుతో చెలగాటం నీకు మంచిది కాదు! ఇది ఫస్టు అండ్ లాస్టు వార్నింగ్! టేక్ కేర్!"

అంటూ అన్నం ప్లేటుని అసహనంగా విసిరేశాడు. అది విష్ణుచక్రంలా తిరుగుతూ వెళ్ళి సుభాష్ చంద్రబోస్ నెత్తిమీద పడింది.

అప్పటిదాకా నోరు తెరుచుకుని ఇదంతా చూస్తున్న బోస్ ఉలిక్కిపడి, చేతిలోని గ్లాసువైపు ఒకసారి కంగారుగా చూసుకుని, తేరుకున్నాడు. గ్లాసుని గట్టిగా పట్టుకుని గబగబ మంచినీళ్ళ గంగాళంవైపు నడవడం మొదలెట్టాడు.

అది చూడగానే ఏదో అనుమానం తోచింది శత్రుఘ్నకు

"ఆగు!" అంటూ ముందుకు ఉరికి, బోస చేతిని బలవంతంగా పట్టుకున్నాడు గ్లాసుని లాక్కొని చూశాడు.

అందులో ఏదో కెమికల్ ఉంది. కొద్దిగా చేదువాసన వస్తోంది అది

"ఏమిటిది?" అన్నాడు తీవ్రంగా

తన ప్లాన్ భగ్నమయినందుకు మొహం మటమట లాడించుకుంటూ చూశాడు బోస్

"విషం!" అన్నాడు మంటగా.

తెల్లబోయాడు శత్రుఘ్న.

"విషమా? మంచి నీళ్ళలో కలుపుకున్నావా? ఎందుకు?"

తన ఆట కట్టయిపోయిందని గ్రహించి, ఉన్మాదిలా నవ్వాడు బోస్ "ఎందుకు చేశానంటావా?" అని మొదలుపెట్టి, మాటమాటకీ మనోద్రేకం పెరిగిపోతుండగా చెప్పడం సాగించాడు

(—ఇంకావుంది.)

# ఓ అభిమానీ! దూరం.. దూరం...!!

**'లిఫ్ట్ అవుట్-ఆఫ్ ఆర్డర్'**

—బోర్డు చూస్తూనే గతుకుమంది అపూర్వ.

ఒకటా...రెండా......ఏడు... ఏడంతస్తులు ఎక్కాలి. ఏడంతస్తుల మేడలో ఏడవ అంతస్తులో ఉద్యోగం చేస్తున్నాడు రాకుమారుడు...ఆంధ్రుల అభిమాన రచయిత...యువ రసిక జన మనోభిరామం...కిరీటి,నామదేయుడు,

ఏడుకొండల వాడి దర్శనం కోసం ఏడుకొండలు ఎక్కినట్లు—ఎవ్వరికీ అందక ఎంతో ఎత్తుకి ఎకిగిపోయికూర్చున్న ఓ నా అభిమాన రచయితా—ఏడులక్షల కధిపతి కూతురైన ఈ అపూర్వ కూడా ఏడంతస్తులూ ఎక్కక తప్పదా, అని నవ్వుకుంటూ సణుక్కుంటూ, ఒక్కొక్క మెట్టే ఎక్కసాగింది. ఒక్కొక్క అంత



# తులసి బాలకృష్ణ

స్తే గడుస్తున్న కొద్దీ ఆయాసం, ఆనందం అధిక మవసాగాయి...

...గత సంవత్సరంగా తమిద్దరి మధ్య ఉత్తరాలు సాగాయి అతని ప్రతి రచన చదువుతూనే తను ఉత్తరం వ్రాసేది. నాలుగైదు ఉత్తరాలకు ఒక్క జవాబు ఇస్తుండే వాడు. అక్షరాలు కూడా గబా గబా పరికేసి నట్లు, అలికేసి నట్లు వుండేవి. కాని అవే తన కళ్ళకి ముత్యాలసరాలుగా అగుపడేవి. ప్రతి వుత్తరాన్ని వంద సార్లు చదివేది మొదట్లో ఫ్రెండ్సుకి చూపించేది లక్షాధికారి కూతురువి—ఓ కోటీశ్వరుడితో స్నేహం చెయ్యక పత్రికలో నవలలు వ్రాసుకునే ఓ సామాన్యుడితో స్నేహం ఏమిటి పిచ్చిదానాగ" అని హేళన చేయడంతో, "ఇరవై నాలుగ్గంటలూ రాబోయే మొగుడి గురించిన ఆలోచన తప్పితే మరో ఆలోచన లేని మీకు భావుకత అంటే ఏంతెలుస్తుందేమొద్దుల్లారా" అని వాళ్ళమాటల్ని కొట్టిపారేసి, ఉత్తరాలన్నింటినీ అతిజాగ్రత్తగా పెట్టెలో దాచిపెట్టింది. ఇప్పుడు...కిరీటి ని కలుసుకునేందుకు ఈవూరు వెళ్తున్నానని చెప్పినప్పుడు తండ్రి ఆశ్చర్యపోయాడు. అందులో ఒంటరిగా .పొరుగూరు. .ఒక పురుషుడిని కలుసుకోవడానికి....."మంచిది కాదేమోనమ్మా' అన్నాడు. "నాన్నా — డబ్బులోనే కాక సంస్కారంలో కూడా మనం కొంచెం ఎత్తులోనే వున్నామని అందరితో బాటే నేనూ అనుకుంటున్నాను. అలాగే నేను కలుసుకో బోయే కిరీటి అనబడే పురుషుడు...సంస్కారమున్న పురుషులందు పుణ్యపురుషుడు అని నమ్ముతున్నా. ఇరవై సంవత్సరాల వయస్సూ, వయస్సుకి మించిన సాహసం, ఆలోచనా శక్తి వున్న నేను నిస్సంకోచంగా



వళ్ళొచ్చనుకుంటున్నా" —కాదనలేక పోయాడు తండ్రి రెండువేల రూపాయలు ఆమె బ్యాగులో పెట్టి, జాగ్రత్తగా ఉండమ్మా తల్లీ! ఒకటి, తప్పితే రెండు రోజుల్లో బయలుదేరి వచ్చేయాలి వెయ్యి కళ్ళతో ఎదురు చూస్తూంటాను నేను ఇంకా ఏమయినా డబ్బు అవసరం అయితే... ఇదుగో ఈ అడ్రస్సులు దగ్గరుంచుకో. వీళ్ళలో ఎవ్వరింట్లో అయినా నువ్వు బస చెయ్యొచ్చు ఎంతడబ్బు కావలిస్తే అంతా తీసుకోవచ్చు" అన్నాడు. నవ్వుతూ, తలవూపి, బయల్దేరింది తను. హోటల్ నాగార్జున లో రూం తీసుకుని, రిఫ్రెష్ అయి తన అభిమాన రచయిత దర్శనార్థం ఉరకలు పరుగులుగా వచ్చేసింది సాహసమంటే చిన్నప్పట్నుంచీ తన కిష్టం సాహసకార్యం ఒంటరిగా చెయ్యడమంటే మరీ ఇష్టం తండ్రి చెప్పినట్లు అతనిచ్చిన అడ్రస్సు... ఇళ్ళల్లో బసచేస్తే తనని ఒక్క నిముషం కూడా వాళ్ళు ఒంటరిగా వదలక అతి మర్యాదలతో విసిగించి వదుల్తారు

ఏడవ అంతస్తుకి చేరుకుంది అపూర్వ "అమ్మయ్య" అనుకుంది

గుమ్మం వద్దే నిలబడి హాలు లోపలకి చూసింది ఒక్కటొక్కటిగా వైరుపర్స్ మీద నడిచినట్లు ఆడ, మగ తలలు తనవైపు తిరిగి కదలకుండా అలాగే నిలిచి పోతున్నాయి అంతమంది తనవైపు చూస్తుండటంతో సిగ్గు, బిడియం కమ్మేసాయి అపూర్వని. గుండెలు కూడ వేగంగా కొట్టుకోసాగాయి పెదాలు తడారి పోతున్నా నెమ్మదిగా అడుగులు వేసి ఒక వెంప్లాయీ ని "ఎక్స్‌క్యూజ్‌మి ..రచయిత కిరీటి గారు ." అని అడుగుతూండగనే, అతను చటుక్కున లేచి నిలబడి, కుడి వైపుకి చెయ్యి పొడుగ్గా చాపి చూపిస్తూ, "తిన్నగా వెళ్ళి, ఆ ఎల్లో బోర్డు కనిపిస్తోంది చూశారా. అక్కడ రైట్‌కి టర్న్ అవగానే ఎదురుగా కూర్చుని వుంటాడు" అన్నాడు చిరునవ్వుతో "థేంక్యూ" అంది మర్యాదిగా, ముందుకు కదుల్తూ

అతను త్వరపడి గొంతు సవరించుకుంటూ "ఎ.య్యోక్స్ క్యూజ్ మి" అన్నాడు

ఆగి, అతని ముఖంలోకి చూసింది. "మే ఐ నో యువర్ గుడ్ నేమ్ ప్లీజ్" అన్నాడు, సేమియా పాయసం సేవిస్తున్నంత సరదాగా నవ్వుతూ, నిటారుగా బోర విరుచుకు షోగ్గా నిలబడి

మిగిలిన వాళ్ళు ఇద్దరు ముగ్గురు చెవులు రిక్కించి, కళ్ళప్పగించి చూస్తున్నారు. తన వైపు.

"ఐథింక్ ఇటీజ్ నాట్ దట్ నెససరీ యునో" అని నోటితో నవ్వుతూ జవాబిచ్చి, నొసటితో వెక్కిరించి ముందుకు కదిలింది.

దెబ్బతిన్నట్టుగా కూలబడ్డాడు అతగాడు.

ఎప్పట్నుంచో అతగాడ్ని ఆకర్షించాలని ప్రయత్నించి ఫెయిలయిన కో ఎంప్లాయీ కనక మహాలక్ష్మి 'కిసిక్... కిసిక్' మని నవ్వింది.

ఇంక ఇటూ అటూ వెతుక్కోవలసిన అవసరం లేదు కాబట్టి, తిన్నగా నడవ సాగింది అపూర్వ అనేక కళ్ళు ఆమె అందాన్ని దోసిళ్ళతో జుర్రుకుంటున్నాయి. కొన్ని ఆడకళ్ళు ఆమె వైపు అసూయగానూ, మగవాళ్ళ వైపు గుర్రు



గాను చూస్తూన్నాయి—

'మిస్ ఇండియా' పోటీకి నిలిచే కొల తల శరీర సౌష్టవం కాదు అపూర్వది. ఆమె శరీరపు వంపులు చూపరులను రెచ్చగొట్టవు. ఆమె కళ్ళు కైపెక్కించవు కాని, ఆమె ముఖంలోకి చూస్తూంటే పారిజాతపు చెండు పకపక నవ్వుతున్నట్లుంటుంది. ముద్ద బంతిపూలు గుంపుగా గుసగుసలు పోతున్నట్లుంది. ముద్ద మందారం ముసిముసి నవ్వులు చిందిస్తున్నట్లుంది...తుమ్మెదలు బారులు తీర్చినట్లు పీత్తైన ఉంగరాల జుత్తు, పాలరాతి ఫలకంలాంటి ఫాల భాగం మధ్యలో సంధ్యా సమయపు సూర్యబింబం లాంటి ఎర్రటి బొట్టు, మెత్తటి నెమిలి పింఛం వంటి కనుబొమల క్రింద చంచలించే చురుకయిన కాటుక కళ్ళు సంపెంగ పూవులాంటి నాసిక క్రింద మందార మొగ్గలాంటి చిన్నపెదవులు, ముద్దొచ్చే అరటి పూవులో లింగంలాంటి చుబుకం, ...భావుకత వున్న చూపరులు దృష్టిని తృప్తి పరచి యింక క్రిందకు సాగనియ్యవు—

ఎల్లో బోర్డుని చేరుతూనే కుడి వైపుకి తిరిగి... నిలబడి పోయింది అపూర్వ అడుగులో అడుగు పడుతోంది తడబడుతూ. పెదవులు కొద్దిగా వణకుతున్నాయి. శంఖంలాంటి కంఠం చుట్టూ చిరుచెమట పొటమరిస్తోంది —తలవంచుకుని ఆఫీసు పని చేసుకుంటున్నాడు కిరీటి సీరియస్‌గా.

అతన్ని గతంలో తనెప్పుడూ చూడలేదుగానీ-అతనే అయ్యుండాలి కారణం -ఒకటి-అతనెవరో చెప్పింది ఈ సీటేనని. రెండు-అతనొక్కడు తప్ప మిగిలిన అందరూ తనని మింగేసేలా. ఎప్పుడూ ఆడదాన్నే చూడని వాళ్ళల్లా చూస్తున్నారు అతనుకూడ అందరితో బాటే మొదట తనవైపు చూసివుంటాడు కాని, అంత ప్రాముఖ్యత ఇవ్వక, లేకితనం చూపించక, తలవంచుకుని తన పని తను చేసుకుంటున్నాడు ఒకసారి లెటర్‌లో ఫోటో పంపించమనిఎంతగానో బ్రతిమ లాడుతూ వ్రాస్తే, నలల పిల్లవాడుగా ఒంటిమీద నూలు పోగు కూడా

లేకుండా తీయించుకున్నప్పటి ఫోటో పంపించాడు-కొంచెం వాడు తనని అపార్థం చేసుకోని ఆడపిల్లల దగ్గరజోక్ వెయ్యడమే సంస్కారమున్న మగవారి లక్షణం అందరు ఆడవాళ్ళతోనూ ఒక్కలాగే ప్రవర్తించేవాడు తన వెకిలి తనాన్ని బయట పెట్టుకుంటాడు...కాబట్టి ఇతను తనని క్రొత్త మనిషిగా భావించి, పట్టించుకో లేదు—

"నమస్తే కిరీటిగారు"గొంతుపెగల్చుకుని, వీణ మీటినట్లు పలికింది.

-ఉలిక్కిపడి తలెత్తాడు కిరీటి."న...న్నమస్తే"

"నా పేరు అపూర్వ. మద్రాసు నుంచి వస్తున్నాను."

కిరీటి కనురెప్పలు అరమూత పడ్డాయి భ్రుకుటి ముడి పడింది.

"ఎక్కడో నా పేరు విన్నట్లు గానే అనిపిస్తోంది గాని గుర్తుకు రావడం లేదు కదూ నేను మీ వేలాదిమంది అభిమానుల్లో ఒకరిని. అందరిలోకి నేనే ముఖ్యురాలనని సంబరపడిపోయే అల్ప సంతోషిని"

—గుర్తొచ్చింది కిరీటికి. ముఖం శ్రమేపీ విచ్చుకుంది.

"ఓ మీరా సోసర్ప్రయిజింగ్?"వస్తున్నట్లుగా వుత్తరమయినా వ్రాయకుండా వచ్చేశారే కూర్చోండి" అంటూ చుట్టూ చూసాడు ఖాళీ కుర్చీకోసం. ఖాళీ కుర్చీల్లేవు ఇబ్బందిగా కలియ జూస్తున్నాడు కిరీటి "మరేం ఫరవాలేదండీ-నేను నిలబడతా" అంది అపూర్వ. అబ్బెబ్బే-ఖాళీ వారే..."అంటూండగా కిరీటి చూపు పది గజాల దూరంలో ఒక టేబుల్ దగ్గర వున్న ఖాళీ కుర్చీ మీద పడింది. "వన్ మినిట్.." అని, అపూర్వ పర్వాలేదంటున్నా వినిపించుకోకుండ ఆకుర్చీ కోసం వెళ్ళాడు కిరీటి.

"ఇంతటి రచయిత కోసం ఎడతెరిపి లేకుండా విజిటర్స్ వస్తారని తెలియదా? చుట్టూ పది కుర్చీలు వేయించి ఓ ఫ్యానుని కేవలం ఇతని కోసం నియమించాలని తెలియదా ఈ అఫీసు మేనేజిమెంటు వెధవలకి" అని తిట్టుకుంది. కిరీటి కుర్చీ స్వయంగా తీసుకు వస్తూండగా అతనిని నఖశిఖ పర్యంతం గమనించింది-సామాన్యమయిన ఒడ్డు, పొడుగు, శరీర ఛాయ. విశాల ఫాల భాగానికి పైభాగాన సముద్రకెరటాల్లాంటి నల్లటి జుత్తు కొంచెం దట్టమయిన కనుబొమల కింద లోతుగా చురుకయిన పెద్ద కళ్ళు, పౌరుషానికి, పట్టుదలకీ చిహ్నమేమోనన్నట్లు సూటి ముక్కు చివర పూరించిన నాసికా పుటలు, నల్లటి చిన్న మీసం క్రింద తీర్చిదిద్దినట్టున్న పెదవులు, గుండ్రటి చుబుకం, సమమయిన మెడ. ఆత్మ విశ్వాసానికి చిహ్నంగా ఎదురు తన్నిన ఛాతీ.. ......

"ఓ రియల్లీ సారీ అండీ-మీకు శ్రమ కలిగించాను. మీరెమిటి, నాకోసం కుర్చీ తీసుకు రావడమేమిటీ" అంటూ నొచ్చుకుంది అపూర్వ.

"ఇట్సాల్ రైట్...చెప్పండి. ఎప్పుడొచ్చారు? ఇక్కడ మీ రెలిటివ్స్ ఎవరైనా....అని అంటూండగానే ఫోను బజ్జర్ మ్రోగింది. రిసీవర్ అందుకుని అందుకుని, "హల్లోసర్" అన్నాడు. ఒక షణం పోయాక, "ఓ కే సర్...ఇప్పుడే

వస్తున్నాను" అని గభాలున లేచినిలబడి, అలమార్లోంచి ఏవోఫైల్సు తీసుకుని, "మా ఎ ండి గారు పిలుస్తున్నారు-నేనొక్క అయిదు నిముషాల్లో వస్తాను, మీరు కూర్చోండి మిస్. ,అంటూ ఆగాడు పేరు గుర్తురాక

"...అపూర్వ" చిరునవ్వుతో అందించింది

"ఆ...అపూర్వా! నిజంగా మీ పేరు కూడా అపూర్వమే" అంటూ మెచ్చుకోలుగా నవ్వి, వరండాలోకి పరుగులాంటి నడకతో నడిచి, మెట్ల మీదుగా పైకి పరుగెత్తాడు.

ఒంటరిగా మిగిలిపోయింది అపూర్వ, "థేంక్స్ ఫర్‌ద కాంప్లిమెంట్ అంటూ

అయిదు నిముషాలు గడిచాయి.

కిరీటి రాలేదు.

మరో అయిదు నిముషాలు...ఒక్కొక్క నిముషం ఒక్కొక్క యుగంలా...... అయ్యంది ఎవడో బొత్తిగా బుద్ధిలేని గాడిద ఇంతసేపా పని? ఇక్కడ అభిమానులు వెయిట్ చేస్తూంటారని తెలియదూ? లేకపోతే చక్కగా కిరీటిని కబుర్లలోకి దింపి కథలు చెప్పించుకుంటూ ఎంజాయ్ చేస్తున్నాడేమో తనొక్కడూ-సెల్ఫిష్ ఫెలో! ఫుడ్స్ట! హి నోద ఇంపార్టెన్స్ఆఫ్ మిస్ అపూర్వ?!

మరో పది నిమిషాలు భారంగా గడిచాయి.

కిరీటి జాడ లేదు.

అప్పుడొకడూ అప్పుడొకడూ తన దృష్టిలో పడేలా పోజులుకొడ్తూ, ఇంగ్లీషు సాంగ్స్ కూని రాగాలు తీస్తూ అటూ ఇటూ తిరుగుతున్నారు కొందరు లేని హుషారు నటిస్తున్నారు

ఒక షోకిల్లా రాయుడు స్టయిల్‌గా వచ్చి, తనని పలకరించాలన్న తపనతో తడబడే గొంతుని సవరించు కుంటూ. "కిరీటి ...లేడాండీ? అన్నాడు అసలే ఆలస్యమయిపోతున్నందుకు కుతకుత లాడుతూవ్న అపూర్వ చికాకుని కంట్రోల్ చేసుకుంటూనే ఖాళీ కుర్చీని చూపిస్తూ, అతగాడి వైపు వింత చూపు చూస్తూ, "లేనట్లేగా?!" అని సమాధానంతో కూడిన ఎదురు ప్రశ్న వేసింది. అతను దెబ్బతిని,కవర్ చేసుకోవడానికి, "థేంక్సండీ" అని వెర్రినవ్వొకటి వదలి చల్లగా జారుకున్నాడు అక్కడనుంచి.

ఆ ఫిల్ము లో గొప్ప రొమాన్సు గుప్పించాడు గురూ-అందులో కొంత సెక్సు జోడించి. అఫ్‌కోర్సు-అది నీలాంటి పెళ్ళయిపోయిన ముసలాళ్ళకోసం కాదనుకో. మాలాంటి ఫైలాషచ్చేసు యువ తరం కోసం మాలాగ మాంఛివయసులో వున్న కుర్రాడు జాంపండు లాంటి పిల్లతో జంటగా ఆ సినిమాచూస్తే-ఓహ్ గొప్పథ్రిల్ లే ...." అంటూ, ఓరగా తన వైపు రియాక్షన్ కోసం చూస్తు, మరొక వ్యక్తితోచెప్తూ వస్తున్న బొమ్మల బనీను వాడిని ఒక్కసారి చూసి తలతిప్పుకుంది అపూర్వ -

ఆ మరో వ్యక్తి మర్యాదగా,తనవైపేనా చూడకుండా రేక్సులోంచి ఏవో తనకు కావలసిన ఫైల్సు తీసుకుంటున్నాడు బనీను వాడు తనని మింగేసేలా చూస్తూ, అతన్తో అంటున్నాడు, "ఈ కిరీటి ఏడి గురూ! వీడో ఆయోమయం




మనిషి. ఎప్పుడూ ఏదో ఊహా లోకాల్లో ఎగురుతుంటాడు. అందుకే యండి గారి చేత తిట్లు తింటూంటాడు రోజూ. అయినా పాతికేళ్ళు దాటిన వాడు కృష్ణారామా అంటూ పురాణ కథలు వ్రాసుకోవాలి గాని, ఇంకా లవ్‌స్టోరీసూ, విహార యాత్రలూ ఏవిటండీ- అవన్నీ కావలసిందిమాకూ :"

-అపూర్వకి వంటినిండా తేళ్ళు జెర్రులూ పాకినట్లుంది ఇడియట్-ఎంత చులకనగా మాట్లాడుతున్నాడు వీడు వయసులో వున్నావాడూ, కిరీటి ముసలాడూ అయిపోయాడా? ఇలాంటి వెధవల్నుద్దేశించే మహాకవి అన్నాడు, "కొంతమంది కుర్రవాళ్ళు పుట్టుకతో వృద్ధులూ..." అని

వేరే అతను తన ఫీలింగ్స్ గమనించినట్లున్నాడూ, బనీను గాడితో అంటున్నాడు, "ఇదుగో చూడు మైడియర్ ఇడియట్-నీజెలసీ అంతా అతను లేనప్పుడు ఇలా వెళ్ళగక్కుకునే కంటే, దమ్ముంటే అతన్తోటే అను-నీసరదా తీరుతుంది పైగా పాతిక ముప్పై ఏళ్ళు దాటే సరికే నీలాంటి వాళ్ళలాగా కిరీటి లాంటి వాళ్ళకి వృద్ధాప్యం కమ్మేసి జీవితం మబ్బు పట్టెయ్యదు నిజమైన వృద్ధాప్యం ప్రాప్తించేవరకూ శారీరకంగానూ, అంతకు మించి మానసికంగానూ కూడా పనుల్లోనూ, ఆలోచనల్లోనూ కూడా వాళ్ళు నిత్యయవ్వనులుగానే వుంటారు. అందుకే వాళ్ళకి అంతమంది స్నేహితులా, అంతమంచి అభిమానులు కూడా వుంటారు. మైండిట్" అంటూనే చరచరా వెళ్ళిపోయాడు

-బనీను గాడి మొహం వాచిపోయింది.

'థేంక్యూ సర్-థేంక్యూ'అని లోలోనే ఆ రెండవ వ్యక్తికి కృతజ్ఞతలు తెలియజేసింది అపూర్వ. హ్యాండ్ బ్యాగ్ లోంచి కిరీటి నవల "సంఘర్షణ" తీసి చదవసాగింది.

మరో అయిదు నిమిషాలు గడిచాయి.

"ఓహ్... సారీ. మరచి పోయాను. యండి గారేదో ముఖ్యమైన విషయం డిస్కస్ చేస్తూంటే వుండి పోయాను. మీకు పాపం బోరు కొట్టేసి వుంటుంది" అంటూ, నుదుట పట్టిన చెమటని రుమా

లతో తుడుచు కుంటూ, ఆదరా బాదరా వచ్చి, అలమారు తీసి, చేతిలో ఫైల్ను అందులో వుంచి, మరో ఫైల్ను బయటకు తీసాడు కిరీటి

"ఛ ఛ బోరేంలేదండి.." అంటూ నవ్వింది అపూర్వ.

ఫైలువిప్పి అందులో మేటర్ గబగబా చదువుకుని, చటుక్కున గుర్తొచ్చిన వాడి లాగ, తలప్రక్కకు తిప్పి, "రాములూ" అని పిలిచాడు కిరీటి. జవాబు లేక పోయేసరికి "రా ము లూ" అంటూ మరింత గట్టిగా పిలిచాడు.

కూర్చున్న స్టూలు మీదనుంచి కదల కుండానే కేర్ లెస్ గా తలతిప్పి, "ఆఁ" అన్నాడు ఆ రాములనబడేప్యూను,

"ఒక్క నిముషం ఇటొస్తావా?"

"ఏం కావాలి చెప్పు గురూ"

-అదిరి పడింది అపూర్వ 'ఎంత రెక్ లెస్‌గా, ఎంత అమర్యాదగా,......'

-ఆమె ఫీలింగ్స్ను గమనించిన కిరీటి నవ్వొకటి అరువు తెచ్చుకుని, "రోజు రోజుకీ నీకు బద్ధకం ఎక్కువయి పోతోంది రాములూ. ఇంతకు మునుపు తూనీగలా చలాకీగా తిరుగుదూ క్షణాల్లో..." అంటుండాగానే, "అబ్బా-మొద లెట్టావు సుత్తి-విషయం చెప్పవయ్యా మగడా" అన్నాడు రాములు తలపట్టుకుని.

-విస్తుబోయింది అపూర్వ 'ఏ రచయిత వ్రాసే ప్రతిపదం కోసం లక్షలాది పాఠకులు ఎదురు చూస్తారో... ఏ రచయిత మాటలు వేలాది అభిమానుల గుండెల్లో గులాబులు పూయిస్తాయో... ఆ రచయిత మాటలు ఒక ప్యూనుకి సుత్తి దెబ్బల్లాగ వినిపిస్తున్నాయా?....'

"రెండు కాఫీలు తెచ్చిపెడ్తావేమో నని..." నెగటివ్ రిప్లైని వూహిస్తూ బ్రతిమలాడుతూన్న ధోరణిలో సణిగాడు కిరీటి.

"కాఫీయా-తెస్తాను. కాని, మేనేజరు గారు పిలుస్తే నా తరపున మీరెళ్తారా?"

-బిక్క చచ్చిపోయాడు కిరీటి.

తలలో నరాలు బిగపట్టి నట్టుయి తల దించుకుంది అపూర్వ

బెల్ మ్రోగింది ప్యూన్ లోపలకు వెళ్లాడు-మేనేజరు రూంలోకి.

"నాకు కాఫీ అలవాటులేదు-మీరేం హడావుడి చెయ్యకండి మీతో నాలుగు మాటలు మాట్లాడితేనే నాకు పరమానందంగా వుంది కడుపునిండి పోతుంది "ఇదీ స్వాతంత్ర్యమే" సీరియల్ అమోఘంగా వ్రాస్తున్నారు క్రొత్త నవలేదేనా స్టార్టు... ఆమె మాటలు పూర్తికాకుండా వే ప్యూనొచ్చి, "మేనేజరు గారు పిలుస్తు న్నారు గురూ నిన్ను" అనేసి పోయి, తన సీట్లో కూర్చున్నాడు.

"వన్ మినిట్" అని లేచి, గబగబా మేనేజరు రూంలోకి వెళ్ళాడు కిరీటి.

అప్పుడు చూసింది అపూర్వ మేనేజరు అద్దాల గదివైపు రివాల్వింగ్ ఛైర్ లో కాలుమీద కాలేసుకుని, వెనక్కి విరుచుకుని చేతిలో పెన్ను వ్రేళ్ళమధ్య గిర గిర తిప్పుతూ, కిరీటివైపు కేర్ లెస్‌గా, అద్దాల్లోంచి తనవైపు ఓరగా చూస్తూ ఏదో అడుగు తున్నాడు మేనేజరు కిరీటి నిలబడి వుండే వినయంగా జవాబిస్తూ న్నాడు ఆ జవాబుకి సంతృప్తి చెందనట్టు మేనేజరు తల అడ్డంగా తిప్పుతూ విసుక్కుంటున్నాడు. తను చూస్తున్న

కొద్దీ ఆ మేనేజరు మరింత పోజుకొట్టి కిరీటి మీద మరింత విసుక్కునేలా వున్నాడని గమనించిన అపూర్వ తల తిప్పుకుంది. కిరీటి పరిస్థితి ఆమెకి చాలా బాధని కలిగిస్తోంది. రోజూ పాపం పగలంతా ఆఫీసులో ఇన్నిరకాలు వత్తిడులకు తట్టుకుని, మిగిలిన కొద్దిసమయంలో లక్షలాది మందికి సంతోషాన్ని కలిగిస్తున్నాడా....

తలుపు తెరచుకుని ఒకే పేపర్ తో హడావుడిగా వచ్చి, దగ్గర్లో వున్న ఒక అమ్మాయి దగ్గరకు వెళుతూ, "సుజాత గారూ-ఈ లెటర్ అర్జంటుగా టైపు చేసి స్తారా. మేనేజరు గారు చాల అర్జంటని తొందర పెడ్తున్నారు" అన్నాడు రిక్వెస్టింగ్‌గా.

తెరచిన ప్రక్క-డ్రాయర్లో కిరీటి నవలే పెట్టుకుని చదువుతూన్న సుజాత ఒక్కసారి డ్రాయరు మూసేసి, ముందున్న ఫైలు దగ్గరగా లాక్కుని "అమ్మో-నాకు బోల్డంత పెండింగు వర్కుంది బాబూ" అంది.

"మరెలాగండీ-చాల అర్జంటు"

"బాగుంది-నేనేం చెయ్యను?"

కిరీటి ఆలస్యం చెయ్యక వెళ్ళి, టైపు మిషన్ ముందు కూర్చుని, పేపర్స్ ఫీడ్ చేసాడు. తదేక దృష్టితో టైప్ చెయ్యసాగాడు.

గబగబా వెళ్ళి కిరీటిని ఆపు చేసి, తనుటైపు చేసి పెడ్డామా అనిపించింది అపూర్వకి. సరదా కోసం నేర్చుకున్న విద్య అభిమాన రచయితకు సహాయ పడటంతో ధన్యమవుతుంది. కాని, తనకా అవకాశం లేదు. తాను ఈ ఆఫీసులో పని చెయ్యడం లేదు. సుజాత వైపు అసహ్యంగా చూసింది-స్నేహితులతో, చుట్టాలతో లక్షలాది మందికి అభిమాన రచయిత నీతోదే పని చేస్తున్నాడని గొప్పగా చెప్పుకుంటూవే-ఈ మాత్రం పని చేసి పెట్టలేవా స్టుపిడ్' అన్నట్లుగా వుంది ఆ చూపు.

అటు పైన ఆ చూపు కిరీటి వైపు మళ్ళింది. చెరగని చూపుల్తో చకచక టైపు చేస్తున్నాడు కిరీటి. నుదుట పట్టిన చెమట ముత్యాల్లా మెరుస్తోంది. నెమ్మదిగా వెళ్ళి, వెనగ్గా అతని పనికి ఆటంకం కలగకుండా పయిటు చెంగుతో మెత్తగా సుతారంగా ఆచెమట బిందువుల్ని అద్దాలనిపిస్తోంది. తమ అఫీసులో తమతో సమానంగా కూర్చుని పని చేస్తున్నందుకు సంతోషంతో గంతులేసి, నేనంటే నేనంటూ అతని పనిని పంచుకుని, అతని అభిమానానికి పాత్రులయి, అతని భావుకతలో తనమునకలయి తన్మయులవడానికి బదులు ఈ అభాగ్యులు,, అతన్ని కేవలం తమలో ఒకడి గానేభావిస్తూ, ఏ కొంచెం సహాయాన్నీ అందించక, మానసిక శారీరక శ్రమంకు గురి చేస్తూ,......

మేనేజరు అద్దాల తలుపులు విసురుగా తెరుచుకున్నాయి.

"మిస్టర్ కిరీటి!!" గుమ్మం దగ్గర్నుంచే అరిచాడు.

"సర్" అన్నాడు కిరీటి లేచినిలబడుతూ.

"ఏవిటి నువ్వు చేస్తున్నది. డోస్ట్ యు నో దట్ యు ఆర్ ఏనాఫీసర్? టైపింగ్ నీ డ్యూటీ యా?"




"కాదు సార్. కాని, సుజాత గారు పెండింగు వర్కు......"

"నాన్సెన్స్. దట్ షోస్ యువర్ ఇనెఫిషెన్సీ."

"వాట్ సర్. వాట్ డు యు మీన్? చిన్నబుచ్చుకున్న కిరీటి కొద్దిగా విసురుగానే అడిగాడు.

"ఐ మీన్ యు ఆర్ అన్‌ఫిట్ టు బి ఏన్ ఆఫీసర్" నొక్కి పలికాడు.

"సర్. ప్లీజ్ మైండ్ యువర్ టంగ్. మీరు అర్జంటు అన్నారని నేనే స్వయంగా......"

"డోంట్ టెల్ కాక్ అండ్ బుల్ స్టోరీస్. టైపిస్టుల చేత, క్లర్కుల చేత పని చేయించ లేక నువ్వే చేసుకునే వాడివి నువ్వేం ఆఫీసరువయ్యా? పైగా కాకమ్మ కధలు చెబ్తున్నావు. నీ కధలు వినిఅయిపోయి నిన్నో పెద్ద గొప్ప వ్యక్తిగా భావించే వాళ్ళు. ఆరాధించేవాళ్ళు, అభిమానుల మంటూ వచ్చి కబుర్లు చెప్పే వాళ్ళు,..."

"మేనేజర్!!! యు ఆర్ ఎక్సీడింగ్ యువర్ లిమిట్స్!!!" ఉరిమాడు కిరీటి.

తృళ్ళి పడ్డాడు మేనేజరు. ఒక నిముషానికి తేరుకుని, "కమ్ టు మై రూమ్" అని విసురుగా రూములోకి వెళ్ళిపోయాడు.

అంత విసురుగానూ కిరీటి కూడా అతని వేనకే వెళ్ళాడు.

శిలా ప్రతిమలా కూర్చుండి పోయిన అపూర్వ ముఖం జేవురించి పోయింది. కిరీటికి జరిగిన అవమానం తనకీ, తన కుటుంబ సభ్యులకీ జరిగినట్లుగా వుంది. కన్నీటి ప్రవాహం చెలియలి కట్ట దాటక ముందే బయట పడాలి. తను ఇంక అక్కడవుంటే మేనేజరు గాడు అసూయతో కిరీటి ముందు తను తక్కువ కావడదని మరెంత విరుచుకు పడతాడు కిరీటి కూడా మరింత ఆవేశ పడతాడు.

లేచి, గబగబా తలవంచుకుని అడుగు లేస్తూ, మెట్లమ్మట క్రిందకు దిగసాగింది. అందరూ మరింత వింతగా చూస్తూన్నారని, కొందరు అక్కసుగా ముసిముసి నవ్వులు చిందిస్తున్నారని తెలుసు...

...ఇంత ఘోర అన్యాయమా?! ఎంతో మంది అనునిత్యం ఆరాధించే రచయిత.. అతన్తో మాట్లాడ్డమే ఓ పెద్ద ఎఛీవ్

మెంట్‌గా యువ తరం భావించే గొప్ప వ్యక్తి.. నిలకడలేని యువ హృదయాలపై వన్నీటి జల్లుని కురిపించి కుదుట పరిచే మానసిక వైద్యుడు ..ఇలా యింత దారుణంగా...ఘనత గుర్తింప బడలేని చోట, అసుయాపరులమధ్య... 'అరసికేషు కవిత్వ నివేదన శిరసి మా లిఖ మాలిఖ మాలిఖా' అని ఏడ్చిన కవిలా.

...ఇంటికి వెళుతూనే తండ్రితో గట్టిగా మాట్లాడాలి రాచమర్యాదలతో, చిటికలో పనులు చేసిపెట్టె సేవకులతో, అతను తమ వద్ద పనిచేయడమే ఓ గొప్ప ఎసెట్ గా భావించే మేనేజిమెంటున్న ఆఫీసులో యువరాజులా వెలిగిపోతూంటా ననుకున్న తన అభిమాన రచయిత పడుతూన్న పాట్లు తండ్రికి చెప్పాలి హాయిగా తమవూరొచ్చేసి, పచ్చని చేల మీద స్వేచ్ఛగా ఎగిరే రామచిలుకలా తమ మేడ మీద గదిలో చుట్టూ ప్రకృతి శోభని ఆస్వాదిస్తూ, లక్షలాది హృదయాలకు మరింత ఆనందాన్ని కలిగిస్తూ, తమఇంటిని పునీతం చేయమని కిరీటిని కోరమని తండ్రిని అడగాలి 'ఆయన అంగీకరిస్తాడు తనమాట కాదనడు..

... ... ... ...

రూంకి వస్తూనే బట్టలయినా మార్చుకోకుండా మంచం మీద వాలిపోయి, దిండులో ముఖం దాచుకుని భోరుమని ఏడ్చేసింది అపూర్వ. పది నిముషాలు బాధ తీరేంత వరకూ ఏడ్చే సరికి గుండెలు తేలికయ్యాయి—

'ఒరే మేనేజరూ–నీ అదృష్టంకొద్దీ కిరీటికి పై పోస్టులో వున్నంతలో అతని కంటే గొప్పవాడ్ననుకోకు. మీ ఆఫీసు గుమ్మం దాటితే నీవారు తప్ప మరో వ్యక్తి యెవరూ గుర్తించని నువ్వు కిరీటిని అంతమాటలంటావా? యూజ్‌లెస్‌ఫెలో నువ్వింత కింత అనుభవిస్తావు నువ్వేకాదు ఆ సుజాత పీనుగ, రాముడుగాడు, బిస్ప వెధవ అందరూ కుళ్ళి చచ్చే రోజొస్తుంది' అని కసితీరా తిట్టుకుని, అప్రయత్నంగానే నిద్రలోకి జారి పోయింది. రెండుగంటలకు నిద్ర లేచి భోజనం నాలుగు మెతుకులు కతికి, 'సంఘర్షణ' పూర్తిగా చదివేసే సరికి నాలుగున్నర అయింది. స్నానంచేసి, బట్టలు మార్చుకుని, కొంచెంసేపు వరండాలో కాలక్షేపం చేసి, రూంకి తాళంపెట్టి, ఆటోని పిలిచి బయల్దేరింది కిరీటి ఇంటికి—

తను ఇన్నాళ్ళూ ఉత్తరాలు వ్రాసింది ఇంటి అడ్రస్సుకే, ఇల్లు త్వరగానే దొరికింది ఆటో వాడికి డబ్బులిచ్చి, ఇంటి ముందు నిల్చున్న తాతగారితో కిరీటి కావాలని అడిగింది. ఆయన మెట్లమ్మట పైకి వెళ్ళమన్నాడు చకచకా పైకి ఎక్కింది అపూర్వ. లక్కీద రెండు గుమ్మాలు కన బడుతున్నాయి ఒక గుమ్మానికి తాళం పెట్టుంది మరో గుమ్మం దగ్గరకు వెళ్ళి తలుపు కొట్టింది అపూర్వ.

ఒక నడిపియస్సావిడ బయటకు వచ్చింది.

"కిరీటిగారు...." అని అపూర్వ అడగ బోతూండగానే–"మీపేరుఅపూర్వగారా?" ఎదురు ప్రశ్న వేసిందావిడ.

ఆశ్చర్యంతో, అప్రసన్నంగా తలూపింది అపూర్వ.

టేబుల్ మీద నుంచి ఓ కవరు తీసి అందిస్తూ,–"మీరొస్తే ఈ కవరు "మీక

కిరీటి గారు ఇమ్మన్నారమ్మా" అందావిడ.

ఆత్రుతగా కవరందుకుని, చింపింది అపూర్వ.

అదిదేనో చెప్పదోయి, ఆగడం గమనించి "ఏమిటండీ" అంది.

"భార్యా భర్తలేదో గొడవ పడ్డట్టున్నారమ్మా"

అదిరి పడంది అపూర్వ. కిరీటికి పెళ్ళయ్యిందా?...అయ్యిండొచ్చు...
తనెప్పుడూ అతని స్వవిషయాల గురించి వ్రాయమనలేదు.

ఆత్రుతగా ఉత్తరం విప్పి చదవసాగింది—

అపూర్వ గారికి,

నమస్తే.

మీ రాస్తారని నాకుతెలుసు. అందుకే ఈ ఉత్తరం

మీరు నన్ను మనస్ఫూర్తిగా క్షమించాలి. ఎంతో దూరం నుంచి వ్యయప్రయాసలకోర్చి అభిమానంతో నన్ను కలవడానికని వచ్చిన మీతో ఒక్క నిముషం సేపు కూడా మాట్లాడ లేక పోయాను

చూసారుగా నాజీవితం రచనలని బట్టి వూహించుకునే రచయితగా నాజీవితానికి, అసలు జీవితానికి కొండంత తేడా వుంది కదూ.

నేను ఈ రోజు నా ఉద్యోగానికి రాజీనామా ఇచ్చాను. శారీరక శ్రమని భరించగలను గాని, అవమానాన్ని భరించ లేను అందుకే రాజీనామా ఇచ్చాను పరంవ



## యాజమాన్యం, తదితర వివరాలు

ఫారం 4 (8వ నిబంధన ప్రకారం)

| | |
|---|---|
| ప్రచురణ స్థలం | హైదరాబాదు |
| ఎంత కాలానికొకసారి | నెలకొకసారి |
| ముద్రాపకుని పేరు : | పి రామకృష్ణ |
| జాతి | భారతీయుడు |
| విలాసం | 1-8-4/1/1 చిక్కడపల్లి, హైదరాబాదు-500 020 |
| ప్రకాశకురాలి పేరు | శ్రీమతి వి లీలావతి. |
| జాతి | భారతీయురాలు |
| విలాసం | 1-8-519/11, చిక్కడపల్లి, హైదరాబాదు-500 020 |
| సంపాదకురాలి పేరు | శ్రీమతి వి లీలావతి |
| జాతి | భారతీయురాలు |
| విలాసం | 1-8-519/11, చిక్కడపల్లి, హైదరాబాదు-500 020 |
| పత్రిక యజమానురాలు | శ్రీమతి వి లీలావతి |

పై విషయాలు నాకు తెలిసినంతవరకు వాస్తవమేనని తెలియజేస్తున్నాను

1-8-86 హైదరాబాదు (సం) వి లీలావతి

సానం-అక్కున జేర్చుకుని ఊరడించి ధైర్యం చెప్పవలసిన అర్ధాంగే అలిగి ఇద్దరు పిల్లల్ని తీసుకుని పుట్టింటికి వెళ్ళి పోయింది.

ఇంతకు మించి ఈరోజు జరిగిన విశేషాల గురించి చెప్పి మీకు బోరు కొట్టించడం నా కిష్టంలేదు.

కాని, ఒక ముఖ్యవిషయం-నా కంటే పెద్ద రచయితలు, ఇతర కళాకారులు ఓ ప్రక్క అనేక మంది అభిమానుల చేత ఆరాధించ బడుతూ, మరో ప్రక్క పై ఆఫీసర్ల అహంకారానికి, తోటి పుద్యోగస్తుల అసూయకు లోనయి అనేక బాధలు పడుతున్నారు. అందుకనే రచయితలు ఇంటా బయట ఎదుర్కొంటున్న మానసిక సంఘర్షణ నుంచి బయట పడడానికి తమ రచనల్లో కొన్ని స్వప్న జగత్తుల్ని సృష్టించుకుని, అందులో విహరిస్తూ పాఠకుల్ని కూడా తమతో తీసుకుపోతూ సంతృప్తిని పొందుతుంటారు. కొంత మంది కైనా మోసం చేయగల నిరపాయకరమైన సంతృప్తే వాళ్ళ ఆస్తి.

అభిమానులెప్పుడూ అంత వంత దూరంగా వుండే తమ ఆరాధ్య రచయితల్ని గౌరవించాలి. వాళ్ళ జీవితాల్లోకి తొంగి చూడదల్చితే...అంరాహుళక్కి!!

మీరు ఈరోజే మీవూరు వెళ్ళిపోండి. నా రచనల్ని బాగున్నంత వరకు అభిమానించండి. నన్ను అభిమానించడం అంత అవసరం అనుకోను.

నాకు మళ్ళీ ఏదైనా ఉద్యోగం దొరుకుతూనే నాభార్య,పిల్లలతో సహా నా వెంతకే వస్తుంది, మా యం.డి. గారికి కూడా నామీద వాత్సల్యం వుంది.పిలిచి, చీవాట్లు పెట్టి రాజీనామా విత్ డ్రా చేసుకోమని కూడా అడగవచ్చు. అన్నింటి నీమించిన నా బాధ మిమ్మల్ని సంతృప్తి పరచలేక పోయాననేది. అందుకే ముఖం చూపించలేక పోతున్నాను.

మీకుగాని, మరే ఏ ఇతర అభిమానికిగాని తమకి తమ అభిమాన రచయిత మీదున్న గొప్ప అభిప్రాయం చెదరిపోకుండా వుండాలంటే-ఈ చిన్న వార్నింగ్ మా రచయితలం ఇవ్వక తప్పదు "ఓ అభిమానీ! దూరం......దూరం!!"

క్షమాపణలతో,

కిరీటి.

-సన్నటి కన్నీటి పొర అపూర్వ కళ్ళల్లో ఏర్పడింది.

కిరీటి మీద అభిమానం పదింతలయ్యింది.

"వస్తానండి" అని ప్రక్కింటావిడతో అని, ఉత్తరం పదిలంగా మడిచి బ్యాగ్‌లో పెట్టుకుంటూ మెట్ల వైపు తిరిగింది.

"ఏమయినా చెప్పమంటారా కిరీటి గారికి?" అనడిగింది ఆవిడ.

"ఆఁ...అఁ...ఆయన కంతా మంచే జరుగు తుందని, పైలోకంనుంచి దేవుడూ, ఈలోంకలో నాలాంటి అనేక మంది అభిమానులు అతనికి అండగా వున్నారని, అతని కలం చిందించే అందమైన రచనల కోసం ఎదురు చూస్తూనే వుంటారని చెప్పండి అంటూ చెంగుచెంగున మెట్లు దిగి పోయింది అపూర్వ.

ప్రక్కింటావిడ అయోమయంగా చూస్తూ నిలబడి పోయింది.

# యుగాంతం

రచన
ముదిగొండ

ష వన గానే జనం జం గానే
బంతెమ్మరలు వీచినట్లుగా
తుఫానులో గాలి దుమారంలా
అల్పాయుష్కంలో అయోమయంగా
సమాజం స్థాణువులా నిలిచింది

భూస్వామి జమీందారుగా
బడుగుజీవి బలహీనంగా
కూలిమనిషి వెట్టిచాకిరీకి
వనాలు ఆశ్రమాలకు
స్మశానాలు కాలనీలుగా
పరిణత చెందుతున్నాయి—

ఈ దేశం నాదోయ్ అని ప్రాణాలిస్తే
ఈ రాష్ట్రం మాదేఅని విప్లవాలోస్తుంటే
పదవాకణాలు వందముక్కలుగా
వైషమ్య విషం వ్యాప్తిచెంది
వీధివీధిన పార్టీలు వెలిసే
వాడవాడకో నాయకుడుద్భవిస్తుంటే—

నడిబజారులో ఆడదాని అవమానం
పెళ్ళిళ్ళ అంగడిలో అబ్బాయి అమ్మకం
మాయిదున్న సమాజం పరికించలేక
ప్రతి ఉగాది యుగాంతం అనుకొని
మానవుడు వెర్రిగా చూస్తున్నాడు

# సలహాలు

"అదీ మావయ్యా సంగతి!
ప్పుడు నన్నేంచేయమంటావో చెప్పు"
న్నాడు కాంతికిరణ్, భానుమూర్తితో
భానుమూర్తికి స్వయానా అక్క




కొడుకు కాంతికిరణ్ చదువు పూర్తిచేసి ఆరునెలల క్రితమే ఉద్యోగంలో చేరాడు చిన్ననాటినుంచి అతనికి బాగా చనువు భానుమూర్తిదగ్గర ఉద్యోగంలో చేరిన ఆరునెలలకే అతను విసిగి పోయాడు

ఎంత కాలంనుంచో ఉద్యోగం ఉద్యోగం అని ఎదురుచూసినవాడికి, వచ్చిన ఉద్యోగం సంతృప్తి నివ్వకపోగా ఎక్కడలేని చికాకూ కలిగించింది. ఈ ఉద్యోగం చేయటంకంటే ఏ కిళ్ళీ కొట్టో పెట్టుకోవడం నయమనే స్థితికి వచ్చేశాడతను.

చివరికి అడుక్కొని బ్రతకడంకూడా ఇంతకంటే గౌరవంగా, స్వతంత్రంగా చేయవచ్చుననే అభిప్రాయానికి అతను రావడం.అదే విషయం భానుమూర్తికి ఉత్తరం వ్రాయడం జరిగిపోయాయి. దానికి జవాబుగా భానుమూర్తి వ్రాసిన ఉత్తరం చదువుకొని, రిజైన్ చేసేముందు అతన్ని కలుసుకొందామని మేనమామ ఇంటికి వచ్చాడు.

కుశల ప్రశ్నలయ్యాక, తన ఆఫీసులోని రాజకీయాలు, పై ఆఫీసర్ల విసుర్లు, క్రింది ఉద్యోగుల నిర్లక్ష్యం, తోటి ఉద్యోగుల వెటకారం, ఇవన్నీ ఏకరువు పెట్టాడు ఎంతో ఆవేశంగా.

అప్పటికే పదేళ్ళ సర్వీసు పుటప్ చేసిన భానుమూర్తి మనసులోనే నవ్వుకొన్నాడు. తను ఉద్యోగంలో చేరిన కొత్తలో అనుభవించిన బాధలన్నీ తిరిగి





గుర్తుతెచ్చుకొన్నట్టనిపించింది మేనల్లుడు చెప్పిన మాటలు విన్నాక.

ఏ ఉద్యోగస్థుడికైనా మొదట్లో ఇటువంటి అనుభవాలు తప్పవేమో! అనుకొన్నాడు. తనిప్పుడు చేయాల్సిందల్లా మేనల్లుణ్ణి మెంటల్‌గా ప్రిపేర్ చేయడం. టీపాయ్‌మీద ఉన్న సిగరెట్ పాకెట్ అందుకొని దానిలోంచి సుతారంగా సిగరెట్ తీసి పెదవులమధ్య బిగించి అగ్గిపుల్ల వెలిగించబోతూ అన్నాడు.

"ఇంతేనా, ఇంకేమైనా ఉందా నువ్వు చెప్పవలసింది?"

కాంతికిరణ్‌కు వళ్ళు మండింది—తను గంట సేపటినుంచి వాగినదంతావిని సానుభూతి చూపించకపోగా ఇంకా ఏమైనా ఉందా? అని అడుగుతున్న భానుమూర్తిని చూసి.

సిగరెట్ పొగపీల్చి, రింగులు రింగులుగా పొగ వదులుతూ అన్నాడు భానుమూర్తి, "నువ్వు చెప్పిందంతా విన్నాక నాకు నవ్వొస్తోంది. ఆగు... అలా కోపంగా చూడకు, నేచెప్పేది పూర్తిగా విన్నాక, నీలో ఇంకా కోపం మిగిలిఉంటే అప్పుడు రిజైన్ చేద్దువుగాని." అని తిరిగి చెప్పడం ప్రారంభించాడు, "నీ డ్రాఫ్టింగ్ భయంకరంగా ఉందనికదూ మొదటిసారి మీ బాస్ తిట్టాడన్నావు? మీ బాస్ క్వాలిఫికేషన్ ఏమిటో చెప్పగలవా నువ్వు?"

"ఏమో....? నేనెప్పుడూ ఆలోచించలేదు."

"అక్కడే పొరపాటు పడ్డావ్! నీ బాస్ విద్యార్హతలు నీకు తెలిసిఉండాలి. ఇది మొదటి పాయింట్. ఎందుకో చెబుతాను. నీకు ఇంగ్లీషు బాగా వ్రాయడం, మాట్లాడడం వచ్చని నాకు తెలుసు. ఇదే

విషయం మీ బాస్ కూడా గ్రహించే ఉంటాడు. అయినా నీ డ్రాఫ్టింగ్‌లో అతను తప్పునెన్నుతున్నాడంటే బహుశః ఏ.ఎస్.ఎస్.ఎల్.సి.నో అయ్యుంటాడు, ఇప్పుడు కుర్రకారేంచేస్తున్నారంటే, తమ ప్రతిభ నిరూపించుకోవడంకోసం - డిక్షనరీలు తిరగేసి సాధారణంగా వాడని పదాలను గొప్పగా - ఉ దా హ ర ణ కు 'మారేజ్' అనేది ఈ రోజుల్లో ఇంగ్లీషు చదువుకోనివాడికూడా అర్థమయ్యేంత తేలికపదం. అదే 'మెట్రిమొనీ' అన్నావనుకో! చదువుకొన్నవాళ్ళే కాస్సేపు ఆలోచిస్తారు. అవునా? మీ కుర్రవాళ్ళు సరిగ్గా అటువంటి పదాలు వాడుతూ ఉంటారు-మీ వొకాబులరీ చూపించుకోవడంకోసం.

నువ్వువ్రాసిన నాలుగులైన్ల డ్రాఫ్ట్‌లో అటువంటి పదాలు ఓ నాలుగున్నాయనుకో అవిచాలు మీ బాస్ మొ హం లో ని రంగులు మారిపోవడానికి. సాధారణంగా చాలామందికి తమకన్నా ఎక్కువ చదువుకొన్నవాడిని చూస్తే ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్ తలెత్తుతుంది. అలా ఎక్కువగాచదువుకొన్నవాడు తమక్రింద పనిచేస్తూ తన తెలివి తేటలు నిరూపించుకోవాలని ప్రయత్నిస్తే అగ్నికి ఆజ్యం తోడవుతుంది.

నీ కేస్‌లోనూ ఇదే జరిగింది. కనుక జాగ్రత్తగా గుర్తుపెట్టుకో. నీ తాహతుకు మించి ప్రతిభ ప్రదర్శిస్తే నిన్ను అభినందించకపోగా నిన్నెలా కంట్రోల్‌లో ఉంచాలా? అని ఆలోచిస్తాడు నీ బాస్. అతని మనసులో నువ్వు తనకన్న ఎక్కువ అనే భావన ఉన్నపుడు నేచురల్‌గా ఇల్‌ట్రీట్‌మెంట్ ప్రారంభమవుతుంది.

సో....నువ్వతనికా అవకాశం ఇవ్వకూడదు. మీ బాస్ ఏదైనా విషయం తప్పుగా మాట్లాడినా నువ్వు నవ్వుతూ "యస్‌సార్" అనడం నేర్చుకోవాలి. కుక్కను చూపించి అది నక్క కదూ! అన్నా ఆవేశపడిపోకూడదు. ఆఫ్ట్రాల్ ప్రతీవాడూ తాను గొప్పవాడిననే అనుకొంటాడు, చాలా సందర్భాల్లో.

నువ్వు మీ బాస్‌ను అలా అనుకోనివ్వడంవల్ల నీకొచ్చిన నష్టం ఏమీలేదు సరికదా అతన్ని సంతృప్తి పరచినవాడివవుతావు. దెన్.........సెకండ్ పాయింట్..." ఆఖరిదమ్ము లాగి సిగరెట్ పీకను యాష్‌ట్రేలో పడవేస్తూ అన్నాడు భానుమూర్తి, "నీ బాస్‌వాగుడుకాయ అనుకో. అప్పుడు నువ్వు తప్పనిసరిగా అతను చెప్పే విషయాలను ఎంతో శ్రద్ధగా వినాలి. నాకు తెలుసు-నువ్వు చాలా మితభాషివనీ, అవసరానికి మించి ఒక్కమాటకూడా మాట్లాడడం, వినడం రెండూ నీకు ఇష్టముండదని.

నీ బాస్ ఎక్కువగా మాట్లాడడం వలన అదివింటే నీకు తలనొప్పివస్తుంది. నిజమే! కానీ అతను మాట్లాడిన మాటలు నువ్వు వినకపోతే ఆ తలనొప్పి అతనికి వస్తుంది. ఇక్కడ ఎవరి తలనొప్పికి విలువ ఎక్కువ? అంటే ఖచ్చితంగా మీ బాస్ తలనొప్పికే!

బికాజ్ ఈ బాస్‌లు ఎ టు వం టి వాళ్ళంటే, నువ్వు మీ అమ్మకు వంట్లో బాగోలేదని శెలవు పెట్టినా నిరాకరించిన వ్యక్తే తన పెళ్ళానికో, పిల్లలకో కాలికి

ముల్లు గుచ్చుకొంటేబాలు, నానా హడావుడీచేసి-అంతకుముందు ఆఫీసులో అర్జంటుగా చూడాల్సిన విషయాలున్నాయన్నవాడే ఓ వారం శెలవు పెట్టేస్తాడు.

అతని దృష్టిలో మీ అమ్మ ఆరోగ్యం కంటే వాళ్ళావిడకో, పిల్లలకో కాలికి ముల్లు గుచ్చుకోవడమే ఎక్కువ సీరియస్. అయినా దగ్గరుండి స్వయంగా చూసుకోవాల్సిన విషయంకనుక నీ తలనొప్పి విలువ, మీ బాస్ తలనొప్పి విలువకంటే ఎన్నో రెట్లు తక్కువ.

సో....నువ్వు కడుపునొప్పితో బాధపడుతున్నా సరే...మీ బాస్‌కు తలనొప్పి రాకుండా చూసుకోవాల్సిన బాధ్యత నీమీద ఉంది.

వాగుడుకాయలు ఎదుటివారినుంచి ఎక్కువగా ఏమీ ఆశించరు. వాళ్ళకు కావల్సిందల్లా తాము చెప్పేది ఎదుటివాడు శ్రద్ధగావినడం-ఓపికుంటేమధ్యలో అలాగా........అవునుసార్.......చాలా బాగుంది' అనగలిగితే ఫలితం ఇంకా బ్రహ్మాండంగా ఉంటుంది.

ఈ టెక్నిక్ నువ్వు ఫాలో అయినపుడు నీ లీవ్ శాంక్షన్ కాకపోవడమంటూ ఉండదు. నువ్వు లీవ్‌లెటర్‌లో వ్రాసిన కారణంగురించి ఆలోచించాల్సిన అవసరం నీ బాస్‌కి ఉండదు. నువ్వు అప్పటికే తనని శాటిస్‌ఫై చేశావుకనుక.

ఈ లోకంలో ఎవడూ ఉపకారం చేసినవాడికే ప్రత్యుపకారం చేద్దామని ప్రయత్నిస్తాడుకానీ అపకారం చెసినవాడికి ఉపకారం చేయాలని చూడడుకదా! కాలాన్నిబట్టి నిర్వచనాలు మారతాయి.

నువ్వోసారి మీ అమ్మకు వంట్లో



బావుండక, లీవ్‌కోసం అప్లికేషన్ పెడితే "నాట్‌శాంక్షన్డ్" అని రాశాడన్నావు కదూ! ఈ ట్రిక్ ప్రయోగించిచూడు. అప్పటికీ అతని ప్రవర్తన మారకపోతే అప్పుడు చెప్పునాతో. నువ్వు రిజైన్ చేయడంకాదు, నీకు తప్పుడు సలహా ఇచ్చినందుకు నేను రిజైన్ చేస్తాను సరేనా? ముచ్చటగా మూడోపాయింట్ ఏమటంటే....వసూ, కాఫీ...." అని అరిచాడు ఖానుమూర్తి.

గంటగంటకూ కాఫీ పడితేనేగాని మెదడు పనిచేయదు అతనికి. భర్త అలవాటు తెలిసిన వసుంధర సాయంత్రం ఫ్లాస్కునిండుగా కాఫీపోసి ఉంచుతుంది రోజూ. భర్తమాట వినగానే ఫ్లాస్క్ తెచ్చి టీపాయ్‌మీద ఉంచింది.

"గుడ్" అని మెచ్చుకోలుగా భార్యవైపుచూసి కప్పులోకి కాఫీ వంచి మేనల్లుడికిచ్చి, తనో కప్ తీసుకొని సిప్ చేస్తూ కొనసాగించాడు. "చూశావా.... మీ అత్తయ్య కొత్తల్లో నేను అస్తమానమూ "కాఫీ"అని అరిస్తే చికాకు పడిపోయేది. అలా చిరాకుపడడం తనకే

నష్టంఅని క్రమేణా గ్రహించిందేమో, నేనడిగీ అడక్కుండానే రెడీగా ఉంచుతుందిప్పుడు. నా కోరిక ఆమె తీరుస్తోంది కనుక నేనూ నా శాయశక్తులా ఆమె ముచ్చట తీర్చడానికి ప్రయత్నిస్తున్నాను.

అలాగే మీ బాస్ తిండిపోతని కదూ అన్నావ్! నీకు చిరు తిండిఅంటే సుతరామూ కిట్టకపోవచ్చు. కానీ నీ బాస్‌కు నిత్యమూ ఏదో ఒకటి నవుల్తూ ఉండకపోతే బుర్ర పనిచేయదు-నీ పరిశీలన ప్రకారం, అవునా?

అతని టేస్ట్‌నుబట్టి ఒకాశీలో, పిడత కింద పప్పో, మిరపకాయ బజ్జీలో, జాంగ్రీలో, లడ్డూలో....ఇలా ఏదో ఒక ఐటమ్ వారానికోసారి కొనుక్కొని వెళ్ళి అతని డ్రాయర్‌లో పెట్టు, చేతికివ్వకు! దాన్ని మరోలాభావించి అతను నెగిటివ్‌గా రియాక్ట్ అయ్యే ప్రమాదం ఉంది. డైరెక్ట్‌గా అతని చేతిలో ఆ పొట్లం పెట్టావంటే.

ఇలా చేయడంవలన మహాఅయితే నెలకో పది రూపాయల ఖర్చు నీకు, కానీ ఆ పదిరూపాయల విలువ?...... ఇప్పుడు నీకర్థంకాదు. నువ్వలాచేసి చూశాక నీకే అర్థమవుతుంది.

ఇంకా, మీ బాస్ వేసుకున్న డ్రస్ పరమ ఛండాలంగాఉన్నా సమయం చూసి, "చాలా బాగుందిసార్, మీ టేస్ట్ సుపర్బ్" అను. "ఈ డ్రస్‌లో మీ వయసు పదేళ్ళతగ్గినట్టుగా వున్నారు" అనికూడా అనగలిగావంటే ఇంకా బాగుంటుంది.

దుబాయ్‌నుంచి నీ ఫ్రెండ్ పంపించిన పెన్ జేబులో పెట్టుకొని అతని దగ్గరకు వెళ్ళావనుకో! అతని దృష్టి దానిమీద పడితే దాన్ని తీసి అతని చేతికివ్వు. మీ బాస్ "చాలా బాగుందోయ్ ఎక్కడ కొన్నావ్" అన్నాడంటే అది నీదికాదని నిశ్చయానికి రావాలి వెంటనే. "ఏదో లెండిసార్...మా ఫ్రెండ్ పంపించాడు. నిజానికి మీకివ్వాలనే తెచ్చానుసార్" అన్నావనుకో. ఆ అయిదురూపాయల పెన్ను విలువ...అనంతం. సూక్ష్మంగా చెప్పాలంటే దీనంతటినీకలిపి 'కాకాపట్టడం' అంటారు.

నీ బాస్ కరుణ నీమీద ప్రసరించిందని తెలిస్తే నీ సహోద్యోగుల వెటకారం, నీ క్రింది ఉద్యోగుల నిర్లక్ష్యం అన్నీ మాయమైపోతాయి. నువ్వేంచేసి నీ బాస్‌ను అకట్టుకొన్నావో వాళ్ళకు తెలియదు కనుక, అప్పుడునువ్వు ద్రోణాచార్యుడివీ, వాళ్ళంతా ఏకలవ్యులూ అవుతారు. వళ్ళు విరుచుకొంటూ లేచాడు భాసుమూర్తి.

నూతనోత్సాహంతో భాసుమూర్తి చెప్పిన విషయాలు మననం చేసుకుంటూ ఆ రాత్రి స్వాప్నలో కలలు కన్నాడు కాంతికిరణ్.

○ ○ ○ ○

రోజూ ఆఫీస్‌నుంచి ఇంటికొచ్చాక, పక్కింటి నారాయణతో కలిసి బీచ్ కెళ్ళడం అలవాటు భానుమూర్తికి. ఆరోజూ నారాయణతో కలిసి బీచ్ రోడ్‌లో కొంతదూరం నడిచాడోలేదో అతనికళ్ళు మెరిశాయి. ఆడవాళ్ళను చూస్తే అతనినోరు ఊరుకోదు.

వాళ్ళను వర్ణిస్తేతప్ప అతనిలోనితపన చల్లారదు. తమముందు నడిచి వెళుతోన్న జవరాలి జడ పిరుదులమీద అటూ ఇటూ

ఊగుతోంటే ఇక తట్టుకోలేకపోయాడు భానుమూర్తి.

"అబ్బ చూడుగురూ ఎంతపొంకంగా ఉందో! దీన్ని చేసుకొన్నవాడెవడోగానీ మహా అదృష్టవంతుడు. ఇటువంటిది ఒక్కసారి ఊఁ అంటే......ప్చ్....ఇది మొగాణ్ణి లెక్కచేసేరకంలా కనిపించడంలేదు. ఆ నడక చూడు ఎన్ని వయ్యారాలు పోతోందో? దీన్ని ఎవడుమాత్రం కంట్రోల్ చేయగలడు? మొగుణ్ణి ఇంట్లో తాళంపెట్టి షికారుకు బయల్దేరుంటుంది నాలాంటివాడెవడన్నా దొరుకుతాడనేమో? ట్రై చేయమంటావేమిటి?" వెకిలిగా నవ్వుతూ అన్నాడు భానుమూర్తి.

నారాయణకు అతని మాటలు వినడం మహాప్రీతి, అతనికి స్వతహాగా కామెంట్ చేయడం రాదు. కానీ భానుమూర్తి కామెంట్ చేస్తే అది తనే చేస్తున్నట్టుగా తాదాత్మ్యం చెందుతాడతను. భానుమూర్తి మాటలు వింటూ ఏవో లోకాల్లో తేలిపోతూ "ఊ...."అన్నాడు అన్యమనస్కంగా.

భానుమూర్తి ఒకడుగు ముందుకువేసి ఆమెతో ఏదో మాట్లాడబోయేంతలో వెనుకనుంచి ఓ వ్యక్తి విసురుగావచ్చి ఆమె పక్కన నిలబడి, "కమాన్... వెధవలు ఎంతవస్తేఅంతే నోటికి!"అంటూ ఆమెను లాక్కుపోయాడు. భానుమూర్తి వైపు తీక్షణంగా చూస్తూ.

భానుమూర్తి గుండెలు దడదడలాడాయి. సుడిగాలిలా వచ్చి వెళ్ళిపోయిన వ్యక్తి వాళ్ళ ఆఫీస్ మేనేజరు హనుమంతరావు కావడమే అందుకు కారణం.

హనుమంతరావుకు అనుంగు శిష్యుడు భానుమూర్తి. హనుమంతరావు దృష్టిలో క్షణం క్రితంవరకూ, భానుమూర్తి నోట్లో వేలు పెట్టినా కొరకలేని బుజ్జిపాపాయి. భానుమూర్తి ప్రవర్తన అలా ఉంటుంది మరి ఆఫీసులో.

అంతవరకూ తను కామెంట్ చేసింది తన బాస్ తాలూకు మనిషిననే విషయం తెలియగానే నిలువు గుడ్లు పడ్డాయి భానుమూర్తికి.

వాళ్ళు ఇద్దరూ బీచ్‌కు కలిసే బయల్దేరి ఉంటారు. మధ్యలో అతనే సిగరెట్లు కొనుక్కోవడానికో ఆగి ఉంటాడు. దాంతో ఆమె కొంచెం ముందుగానడుస్తూ ఉండిఉంటుంది. తాము పరిసరాల్ని గమనించలేదు. సరిగ్గాచూస్తే అతను కనపడి ఉండేవాడే!

కానీ ఎదురుగా మతిపోగొట్టే పెర్సనాలిటీతో ఓ చీర నడిచి వెళుతుండేసరికి యధాప్రకారం తమకళ్ళు పరిసరాల్ని పట్టించుకోవడం మానేసి ఆమెవెనుకే దారి తీశాయి.

తను అన్న ప్రతి మాటా వినే ఉంటాడు హనుమంతరావు. రేపు ఆఫీసులో ఎలా??

అవాక్కయి నిలబడిపోయిన భానుమూర్తినిచూసి అన్నాడు నారాయణ, "ఏమిటిగురూ...ఈ మాత్రానికే అంత భయపడిపోతావు! మనకిది రోజూమామూలేగా. అదిగో చూడు....అవైపు ఎవరో వెళుతున్నట్టుగా ఉంది." అంటూ ఇరవై గజాలదూరంలో రెపరెపలాడుతున్న ఆకాశంరంగు చీరవైపు చూపించాడు నారాయణ.

భానుమూర్తి బాధ అతనికెలా అర్థమవుతుంది-తన తెలివి తేటల్తో బాస్‌ను గ్రిప్‌లో పెట్టుకొన్న భానుమూర్తి ఆరోజు సాయంత్రంనాటి అనుభవంతో హనుమంతరావు గ్రిప్‌లోకి వెళ్ళిపోయాడని? అంత బాధలోనూ నాలిక కరుచుకొన్నాడు భానుమూర్తి- "ఆడవాళ్ళను కామెంట్ చేసేముందు వాళ్ళని బాస్ తాలూకు వాళ్ళోకాదో కన్ఫర్మ్ చేసుకొని మరీ ప్రొసీడ్ కావాలి నాయనా!"-అని తన మేనల్లుడికి చెప్పడం మరచానని. ●






కలర్

కె బాపయ్య టి వెంకటసుబ్బయ్య బి.ఏ డా॥ డి.వి.యస్.రాజు

పరుచూరి బ్రదర్స్ చక్రవర్తి వెంకట్ భాస్కరరాజు కోటగిరి వెంకటేశ్వరరావు టి అశోక్‌కుమార్

కృష్ణా శ్రీవెంకటలక్ష్మీ ఫిలింస్, నైజాం శ్రీవెంకటకృష్ణా ఫిలింస్, సీడెడ్ జయలక్ష్మీ ఫిలింస్,



# ఆరుద్ర గళ్లనుడికట్టు 23




చిరునామా Sanaswata Niketanam

**అర్థం:**

1 ఆదిలో ఆంధ్రుల తత్త్వం, 6. తల్లి; 'చదువు' నవలలో కాపు. చిన్నారి పాత్ర వర్ణక్రమము 7. రాజమార్గం కాదు; పొదచుట్టు భ్రమణం 9. గుట్టు 10. ధూ: మోసకత్తె. 12. శ్రీనాథుని తిరిగి పెసలు పనిపోయినవి. 13. పక్కకో. కిందకో ఒరగు సంతకం, 15. దక్షిణాఫ్రికాలో జాత్యహంకారుల దృష్టిలో

నల్లవాళ్ళు.

## నిలువు:

2. కట్టుకొన్నవాడు చేసే శేషపూరణ 3. చీసుకారె కథకాదు రసజ్ఞత 4. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు 5. చేదోడు దేవతలు కారు, కాకతమ్మ ఏకవీర: తోబుట్టు దేవతలు. 6. మిన్నుముద్దెట్టు కొన్నవి. అల్లసానివారి ప్రకారం 8. పేరు ముందు వేళాకోళపు పెట్టుకు పట్టా ఉదా: 'రంగ మార్జాం' 11. నాయికా నాయకుల తొలిచూపులో కంటికింపు 14. దేవాసురసంరంభములో ఈ 'అప్సరస కోసం వెతకండి.

## ఆరుద్ర గళ్ళనుడికట్టు 22 విజేతలు.

1. ఐ. వి, రఘురామమూర్తి, మాచర్ల
2. జి. రేవతీ కుమార్, నెల్లూరు
3. కె. కోదండరామయ్య, గుంటూరు
4. వి. శ్రీరామమూర్తి, తూ॥ గోదావరి
5. డా. కె. వి. నరసింహారావు భోపాల్
6. ఎమ్. శివరామమూర్తి, విశాఖపట్నం
7. అంబడిపూడి లక్ష్మీరమణ, సికింద్రాబాద్
8. జి. నాగపద్మావతి, గుంటూరు
9. ఎ. వి, కామేశ్వరశర్మ, విజయవాడ
10. ఎన్. నిర్మలకుమారి, తిరుపతి
11. బి. బి. ఆర్. కృష్ణమూర్తి, శ్రీకాకుళం
12. డి. గోపీచంద్రస్వామి, గుంటూరు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 చు | క్క | ■ | 2 కే | 3 వ | ల | 4 కు | టీ | 5 రం |
| ట్టు | ■ | 6 లం | ■ | డ | ■ | టి | ■ | క్షు |
| 7 కా | న | జా | యి | న | కా | రి | ని | ■ |
| ల | ■ | డ | ■ | ము | ■ | న | ■ | 8 జా |
| 9 త | మ్ము | రా | జు | ■ | 10 మ | ల్లె | [illegible] | డు |
| బ | ■ | హా | ■ | 11 తం | ■ | రో | ■ | స్వా |
| ■ | 12 శ్రే | ష్ఠ | త | తా | క | గ | [illegible] | ము |
| 13 సా | ■ | న | ■ | ర | ■ | ము | ■ | లా |
| 14 ము | ద్దు | ము | ద్దు | టు | ట | ■ | జా | రు |

## నిబంధనలు

1. ప్రతినెలా పూరించిన గళ్ళనుడికట్టు మా కార్యాలయానికి 20వ తేదీకి చేరాలి.
2. సంచికలో గడినే వాడాలి. విడికాయితాలపై గప్పగీసి నింపరాదు.
3. గళ్ళనుడిపై మీ చిరునామా రాయడం మరపకండి.
4. నుడికట్టు పంపే కవరుపై "ఆరుద్ర గళ్ళనుడికట్టు" అని విశిగా రాయాలి.

# మన్నెం శారద సీరియల్




# నెవర్ మీటే స్ట్రేంజర్

రాత్రి పదిగంటలు దాటుతుండగా ఇల్లు చేరిన శివప్రసాద్

నీరసంగా వ్రేలాడి పోతున్నట్లున్న కొడుకు ముఖం చూడగానే అనసూయమ్మ తల్లి హృదయం తల్లడిల్లి పోయింది.

"కాస్త టిఫిన్నా చేయమంటే చేయకుండా ప్రొద్దున్నేగా వెళ్ళేవు. ఇప్పటిదాకా ఏం చేస్తున్నట్లు?" అంది కాస్త కోపంగా.

"కాస్త అర్జెంటుపని తగిలితే..." అన్నాడు శివప్రసాద్ తల్లివైపు తిరిగి నవ్వుతూ.

మరోసారయితే ఆమె గుంటూరు చేంతాడంత దండకం చదివేదే! కాని శివప్రసాద్ బయట కెళ్ళి పోయేక ఆమెకు అర్జునరావునుండి వుత్తర మొచ్చింది. ఉత్తరంతో పాటూ అతను పంపిన ఫోటో చూసి ఆమె మొదట దిగ్భ్రమ చెందింది.

ఉత్తరం చదివేక ఆ అమ్మాయి సాక్షాత్తు అర్జునరావు కూతురని తెలిసేక ఆమె ఆనందం అంతా యింతా కాదు. సింహాచలంలో తన కొడుకుతోపాటూ కలిసి తిరిగిన పిల్లే అతగాడి కూతురు కావడం ఎంతో అదృష్టంగా భావించిందామె. ఈ పెళ్ళికి కొడుకు ఒప్పుకు తీరతాడని ఆమె నమ్మకం. అందుకే ఈ విషయం ఎప్పుడెప్పుడు కొడుకు చెవిని వేయాలాఅని ఎదురు తెన్నులు చూస్తూ కూర్చుంది.

తన గదిలోకి వెళ్ళి బాగ్ టేబుల్‌మీద పెడుతుంటే అతని దృష్టి టేబుల్‌మీద నున్న ఫోటోపై పడింది!

ఆశ్చర్యంతో అరవబోయి గబుక్కున గొంతులోనే నొక్కిపట్టేడు దాన్ని.

కొడుకు ముఖంలో మారుతున్న రంగుల్ని అవతలి గదిలోంచి క్రీగంట గమనిస్తున్న అనసూయమ్మ మనసులోనే నవ్వుకుంది. 'పిచ్చిసన్నాసి', అని మనసులో అనుకుంటూ.

కొడుకు టేబుల్‌మీదున్న ఫోటోని ఒకలాంటి దిగ్భ్రమతో చూడటం క్రీగంట వంటగదిలోంచి గమనిస్తూనే వుంది అనసూయమ్మ.

కొడుకుని యింకా యిబ్బంది పెట్టడం యిష్టంలేక చేతులు కొంగుకి తుడుచు కుంటూ వచ్చి "ఎలా వుందిరా అమ్మాయి?" అంది అనసూయమ్మ.

"ఈ ఫోటో... ఈ ఫోటో యిక్కడికెలా వచ్చింది?" అన్నాడు శివప్రసాద్ ఆశ్చర్యంగా.

"నేనే పెట్టేను, రాగానే చూస్తావని!" తాపీగా జవాబిచ్చింది అనసూయమ్మ.

శివప్రసాద్ తల్లివైపు అనుమానంగా చూసేడు.

కొడుకు కళ్ళలో ప్రస్ఫుట మౌతున్న ఆశ్చర్యాన్ని, అనుమానాన్ని చదవ గల్గిందావిడ.

కొడుకువైపు ప్రేమగా చూస్తూ "ఆ అమ్మాయి ఎవరో కాదు. వరుసకు వాళ్ళ నాన్న నాకు వేలు విడిచిన అన్నయ్యవుతాడు. మనతో బంధుత్వం కలుపు కోవాలని ఉబలాటపడి కూతురి ఫోటో పంపించేడు నీ కిష్టమయితే తాంబూలాలు పుచ్చుకుందాం." అందామె టూకీగా.

శివప్రసాద్ వెంటనే ఏం మాట్లాడలేక పోయేడు.

"అయినా నా పిచ్చిగాని... నువ్వు క్రొత్తగా ఇష్టపడేదేమిటి? మీ యిద్దరూ ప్రేమించుకున్నారటగా" అంది అనసూయమ్మ చిరునవ్వుతో.

"అవునుగాని శివా! నువ్వదేంటో పుస్తకాలు రాస్తావంటగా. అర్జునరావు రాసేవరకు నాకు తెలిసి ఏడిస్తేగా. అవిచదివే "మా అమ్మాయి మీ వాణ్ణి ప్రేమించిం దట. అతన్ని తప్ప మరొకణ్ణి పెళ్ళి చేసుకోనని తెగేసి చెప్పిందని వ్రాసేడురా! మీ అబ్బాయే అతగాడు కావడం నా అదృష్టం!" అంటూ వ్రాసేడు. ఇంతకీ ఏం పుస్తకాలురా నువ్వు రాసేది?" అంటూ అడిగింది అనసూయమ్మ కొడుకు మంచం వైపు చూస్తూ.

శివప్రసాద్ నుండి జవాబు రాకపోవడంతో "నిద్రపోయినట్లున్నాడు! పగ

బంతా అలిసి తిరుగుతాడు!" అనుకుంటూ కళ్ళు మూసుకుందావిడ.

కొద్దిగా మగతగా నిద్రపోతున్న శివప్రసాద్‌కి తల్లి అన్న చివరిమాటకి ఛెళ్ళున కొట్టినట్లు మెలకువ వచ్చేసింది.

"అతణ్ణి తప్ప మరొకణ్ణి ఛస్తే చేసుకోనంది." అన్నమాట అతని చెవుల్లో హోరెత్తినట్లు వినిపిస్తోంది.

అలేఖ్య ప్రేమిస్తున్నది తనలోని రచయితని కాని తనని కాదు! ఈ నిజాన్ని ఎన్నాళ్ళో కప్పిపుచ్చాలని ప్రయత్నించడం తన తెలివితక్కువ తనం. నిజం తెలిసిన రోజు ఆమె తనని తోటకూరలో పురుగులా విదిలించి కొడ్తుంది. ఆ దురదృష్టం తనకి పట్టకూడదంటే తనే ముందుగా ఆ నిజాన్ని ఆమెకు చెప్పేయాలి!

ఇక ఫాల్ గేమ్‌ని పొడిగించకూడదు.

ఆమె తనని తిట్టినా, చంపినా నిజం చెప్పేసి గుండెబరువు తగ్గించేసుకోవాలి!

కొద్దిరోజులే అయినా... ఈ అబద్ధాల బ్రతుకు తనని ఎంతో క్రిందకి క్రుంగ జేస్తోంది!

ఈ ఊబిలోంచి బయట పడాలి!

రేపే విశాఖపట్నం వెళ్ళాలని నిర్ణయించుకోగానే అతనికి కొంత మనశ్శాంతి లభించింది.

* * * *

ఆమె యిల్లు దగ్గరవుతుంటే అతనికి కాస్త వణికేయి చిన్నగా.

ఒక్క క్షణం తనకి తెలియకుండానే గేటు దగ్గర నిలబడి పోయేడు శివప్రసాద్.

మరో క్షణంలో తలుపు తెరుచుకుంది.

ఎదురుగా అలేఖ్య!

అప్పుడే తలస్నానం చేసినట్లుంది. పొడవైన ఆమె కురులు నీటి భారంతో బరువుగా వూగుతున్నాయి.

ఆమె తలనుండి కారుతోన్న నీరు ఆమె విశాల ఫాలభాగాన ముత్యాల్లా నిలబడ్డాయి!

అతన్ని చూడగానే ఆమె కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యేయి.

"మీరా!" అంది అతనివేపు విభ్రమంగా చూస్తూ

ఆమె ముఖం చూడగానే శివప్రసాద్ ముఖం పాలిపోయింది.

ఆమె మాత్రం ఆ సంగతి గ్రహించినట్లు లేదు.

"రండి రండి!" అంటూ అలేఖ్య డ్రాయింగ్ రూమ్‌లోకి దారి తీసింది,

శివప్రసాద్ ఆమె వెనుక ప్రాణంలేని మనిషిలా లోనికి నడిచేడు.

"కూర్చోండి! నేనిప్పుడే కాఫీ తీసుకొస్తాను." అంటూ లోనికెళ్ళిందామె.

శివప్రసాద్‌కి కాఫీ తాగాలని లేకపోయినా కాస్సేపు ఆమె లోపికెళ్తే తను




విషయాన్ని ఎలా మొదలు పెట్టాలో ఆలోచించుకోవచ్చని ఊరుకున్నాడు.

నిజానికి విషయాన్ని ఉత్తర రూపంలో వ్రాసి పడేస్తే...తనకీబాధ, టెన్షన్ వుండేవి కావు!

కాని దొంగలా దాక్కుని-ఆమె గుండెల మీద వెయ్యి టన్నుల భారంపెట్టి తప్పించుకోవటం ధర్మం కాదనిపించిందతనికి. అందుకే ఆమె తనని తిట్టినా, దండించినా సరేనని ముఖాముఖీ ఆమెకు చెప్పాలని వచ్చేడతను.

ఆమె అతనికి కాఫీ అందించి కూర్చుంది.

"నాన్నగారు వ్రాసిన ఉత్తరం మీకు అందే వుంటుంది" అందామె చిన్నగా నవ్వుతూ.

శివప్రసాద్ కాఫీ తాగుతూ ఆమె వైపు క్రీగంట చూసాడు.

అలా చెబుతున్నప్పుడు ఆమె బుగ్గలపై ఆవరించిన ఎరుపురంగు అతనికి స్పష్టంగా కనిపిస్తోంది.

"ఆయన నన్ను చూసారు ఫోటో అవసరం లేదంటే...నాన్నగారు వింటేనా! ఆయన మాటంటే మాటే. మీ అమ్మగారయినా చూస్తారని పంపించారు." అంది అలేఖ్య.

ఇది వరకు అతనితో మాట్లాడుతున్నప్పుడున్నంత నిశ్చలత ఇప్పుడామె కళ్ళలో లేదు.

అవి మాటిమాటికి అతని వంక చూడలేనట్లు వాలిపోవడం అతను గ్రహించాడు.

"తలుచుకుంటే నాకు విచిత్రంగా వుంది. ఎక్కడి మీరు! ఎక్కడి నేను! తమాషాగా స్నేహం కలిసి అది పెళ్ళిదాకా దారి తీయడం! మీకెలా వుందో కాని నాకు చెప్పలేని థ్రిల్‌గా వుంది. మీరు రచయిత! ఇలాంటి సందర్భాల్ని చక్కగా

కాగితం మీద గ్రాఫ్ చేయగలదు!" అంది ఆలేఖ్య ఒకలాంటి తన్మయత్వంలో మునిగి తేలుతూ.

ఇంతా ఎక్కువగా ఆమెని మాట్లాడనివ్వటం మంచిది కాదనిపించింది శివప్రసాద్‌కి.

"నాన్నగారు లేరా?" అన్నాడు చుట్టూ చూస్తూ.

"ఏం ఆయనతో మాట్లాడాలా?" అంది అలేఖ్య నవ్వుతూ.

"అదికాదు..." అంటూ నసిగేడు శివప్రసాద్.

"కట్నమేమైనా అడగదల్చుకొన్నారా? తొందరపడి అలాంటి గొంతెమ్మ కోరికలు కోరి అసలుకు మోసం తెచ్చుకోకండి! ఈ ఆస్తంతా నాదే నేను నాన్నగారి ఏకైక పుత్రికని!" అంది అలేఖ్య కాస్త గర్వంగా.

"అది కాదు" అన్నాడు శివప్రసాద్ మళ్ళీ.

ఆమె గలగల నవ్వేసింది.

"తమాషాకి అన్నాను. కోపం తెచ్చుకోకండి. మీ లాంటి ఆదర్శ భావాలు కల ప్రముఖ రచయిత ఆడపిల్ల సొమ్ము ఆశిస్తారా? మీకు భార్యని కాగల్గటం నా అదృష్టం!" అంది అలేఖ్య పరవశంగా.

శివప్రసాద్‌కి విషయం చెప్పాలంటే గొంతు పట్టేసినట్లవుతోంది.

ఒక్కో క్షణం ఆలస్యం చేసేకొలది అమె ముందుకి వచ్చేస్తున్నది.

అతనామె వంక అదోలా చూసేడు.

"నాన్నగారితో మాట్లాడాలా? ప్రొద్దుటే ఏదో పనిమీద కాకినాడ వెళ్ళేరు. రావడానికి వారం రోజులు పడ్తుంది. ప్రస్తుతం యింటిని పరిపాలిస్తున్న మహారాణిని నేనే!" అందామె కవ్వింపుగా.

"ఆయనతో కాదు. మీ తోనే ఒక ముఖ్య విషయం మాట్లాడాలని." అంటూ నసిగేడు శివప్రసాద్.

"చెప్పండి." అందామె నవ్వుతూ.

"విని మీరు నన్ను అసహ్యించుకోకూడదు!" అన్నాడు ఆమె కళ్ళలోకి భయంగా చూస్తూ.

ఆమె అతని వైపు ఆశ్చర్యంగా చూస్తూ "మిమ్మల్ని అసహ్యించుకోవడమా?" అంది.

శివప్రసాద్ మాట్లాడలేదు.

ఎలా మొదలు పెట్టాలో అతనికే అర్థం కావడం లేదు.

"చెప్పండి!" అందామె అతని వైపు చిలిపిగా చూస్తూ.

"మీరంతా విని అప్‌సెట్ కాకూడదు." అన్నాడు ఎటోచూస్తూన్నట్లుగా.

ఆమె భ్రుకుటి ముడి పడింది

"నన్ను... నన్ను పెళ్ళి చేసుకోవడం మీకు అభ్యంతరమా?" అంది అతని వైపు సూటిగా చూస్తూ.




"అవి కాదు... నేను... నేను... మీ రనుకుంటున్న రచయిత శివప్రసాద్‌ని కాను" అన్నాడు మెల్లిగా.

ఆమె గట్టిగా నవ్వి మీ జోక్‌ల సంగతి నాకు తెలుసు మహానుభావా! ప్రొద్దుటే నా మీద ప్రాక్టికల్స్ చేయడానికి హైదరాబాదునుండి పనిగట్టుకొచ్చేరా?" అంది.

శివప్రసాద్‌కి వెంటనే ఏం మాట్లాడాలో తోచలేదు.

నాలుక తడారి పోతుంటే ఆమెవైపు జాలిగా చూసేడు.

"ఇది జోక్ కాదు నూటికి నూరుపాళ్ళు నిజం! నా పేరు శివప్రసాదే! కాని నేను మీరనుకున్న రచయితని మాత్రం కాను!" అన్నాడు గబగబా.

అలేఖ్య నవ్వుతూ అతనివైపు చూసి "ఈ మాటలు నన్ను నమ్మమనే చెబుతున్నారా? మొన్న మీరు కాకినాడ నుండి హైదరాబాదు వెళుతూ మా కాలేజీ గ్రూప్‌కి ఆటోగ్రాఫ్స్ యివ్వటం అబద్ధమంటారా?" అంది.

"ఈ సంగతులన్నీ నాకు తెలిసి పోయినందుకు ఆశ్చర్యపడుతున్నారా? మా ఫ్రెండ్ ఫోన్లో అంతా చెప్పింది" అంది అలేఖ్య.

"మిమ్మల్నెలా నమ్మించాలో నాకు తెలియదు. కాని యిప్పటికన్నా నిజం చెప్పడం నా బాధ్యతగా భావిస్తున్నాను. నిజంగా నేను రచయిత శివప్రసాద్‌ని కాను. అంతా యాదృచ్ఛికంగా జరిగిపోయింది. ఆ క్షణం నే నెందుకో ప్రలోభపడిననూటి వాస్తవమే! ఏ దెయ్యం సన్నాహపరించి నా నోరు నొక్కేసిందో నాకు తెలియదు. కాని... మీ ఉత్తరాలు చదివేక నాకు మీ మనసు అర్థమయ్యింది. మీ రతనిపట్ల పెంచుకొన్న ప్రేమానురాగాలు అర్థమయ్యాయి. నేను చేసిన పొరపాటుకి ఎంతగానో సిగ్గుపడ్డాను. ఆరోజే నిజాన్ని మీకు చెప్పాలనిపించినా మీకు నా ముఖం చూపించలేక వెంటనే వెళ్ళిపోయేను. తిరిగి సింహాచలంలో చెబుదామని ప్రయత్నించినా అవకాశం యివ్వలేదు మీరు!" అన్నాడు శివప్రసాద్ తలదించుకొని

ఈ సారి అలేఖ్య నవ్వలేక పోయింది
ఆమె మొహంలోని ప్రసన్నత శ్రావణ మాసపు నీరెండలా మాయమయ్యింది
శివప్రసాద్ జోక్ చెయ్యడం లేదన్న సంగతి ఆమెకు అర్థమయిపోయింది
విద్యుద్ఘాతం తగిలిన మనిషిలా చలించి పోయిందామె!

"నన్ను క్షమించండి నేను దుర్మార్గుణ్ణి కాను ఇందుకు మీరే శిక్ష విధించినా సంతోషంగా అనుభవిస్తాను" అన్నాడతను మరింత కృంగిపోతూ

ఆమె మాట్లాడలేదు
అలాగే శిలలా కూర్చుంది చలన రహితంగా,
అతను అయిదునిముషాలు అలాగే కూర్చున్నాడు- బలవంతంగా
ఆమె తనని తిట్టినా బాగుండుననిపించిందతనికి
కాని అతని ఆశ నిరాశే అయ్యింది.
అతను లేచి నిలబడి 'వస్తాను' అన్నాడు గొణిగినట్లుగా
ఆమె అప్పటికీ మాట్లాడలేదు
అతను మరో అయిదు నిముషాలు తటపటాయించి బయటికి వచ్చేడు మెల్లిగా
ఆమె అతన్ని 'ఆగు' అంటూ గద్దించలేదు
గొల్లుమని ఏడ్చి గోల చేయలేదు
ప్రాణంలేని మనిషిలా కూర్చుండి పోయింది భావరహితంగా,

సశేషం




అబ్బ అబ్బ ఏం ఆత్మవిశ్వాసమండీ. ఇట్టాంటి సీన్ ని సెన్సార్ వాళ్ళు వదిలేస్తారన్న మీ నమ్మకానికి ఓ షేక్ అబ్బా



అభినందన సంస్థ 9-2-86 రవీంద్రభారతిలో ప్రఖ్యాత సినీనటుడు శ్రీ చంద్ర మోహన్‌ను నటచంద్ర బిరుదునిచ్చి సన్మానించారు సభకు ముఖ్యఅతిథి గవర్నర్ శ్రీమతి కుముద్ బెన్ జోషి, అధ్యక్షులు శ్రీ. టి. సుబ్బిరామిరెడ్డి.



## మండు వేసవి..

ప్రచండ భానుడికి తామేమీ తీసిపోమని ప్రళయ ఝంఝా మారుతాల్ని మరీచిక వీచికల్తో పోటీపడి వీస్తున్నాయి వడగాలులు. సూర్యుడి కఠోర తీక్షణ వీక్షణాలను తాళలేక భూమి కన్నీరు రేపునిధార పోస్తోన్నాంటే, అది ఆవిరి రూపంలో ఆకాశంలోకి దూసుకెళ్తోంది.

ఊతకర్ర చేత బట్టుకుని, నడిబజార్లో, ఎర్రనెండలో ఎవరికోసమో ఎదురు తెన్నులు చూస్తోందా ముసలవ్వ! పైన మాడు చుర్రుమంటోంది. క్రింద కాళ్ళు మంటలెత్తుతున్నాయి. ఆమెలో చలనం వుంది. తనలో తానే గొణుగుతోంది. తల పైకి చీర చెంగును లాగింది. తునాతునకలైనట్లున్న చెప్పుల మీద అతికష్టం మీద



# కడుపు తీపి

సర్దుకు ఎల్చుండాలని ప్రయత్నం చేస్తోంది

ఎంతో ఆశగా, ఆదుర్దాగా ఎదురు చూస్తోందామె

ఎవరి కోసమో ?!

అటుగా వస్తోన్న పోస్టుమాన్‌ని చూశాక ఆమె కళ్ళలో ఆనంద రేఖలు వెలిగాయి కాయలుకాచిన కన్నులపుండి బయల్పడిన కాంతిరేఖలవి!

"ఉత్తరాలేమీ రాలేదవ్వా!" అనుకుంటు సైకిల్‌తో తుర్రుమన్నాడా పోస్ట్ మాన్

ఇంతసేపు తనుపడ్డ కష్టానికి ఫలితం వుంటుందనుకున్న ఆమెకు నిరాశే మిగిలింది

"అయ్యో! రానేలేదానాయనా?" అంది అవంభారంగా నిట్టూరుస్తూ

"హుం ఏం పాట్లో నాయనెట్లున్నాడో, ఎన్నికష్టాలు పడుతున్నాడో ఏకవున్నాడో, ఎలానెగ్గుకొస్తున్నాడో వుట్టి అమాయకుడు ఎన్ని ఇబ్బందులలో ఏమో ఉత్తరాలేయడానికయినా తీరికుందో లేదో."

ఎక్కడో దూరాతి దూరంగా వున్న కొడుకు గురించి ఆమె అంతరంగం పరిపరి విధాల బాధపడుతోంది

కాల చక్రం అదే పనిగా గిర్రున తిరిగిపోతుంది అందని కాలానికై ఆరాటంగా అర్రులు చాస్తూ అదే పనిగా పరుగెత్తుతున్నాయి ఎన్నెన్నో జీవితాలు!

ఋతు గతుల్, ప్రాకృతిక వికాస ధృకుల్ రొటీన్‌గా సైక్లిక్ ప్రాసెస్‌లో తమ డ్యూటీగా తిరుగుతూనే వున్నాయ్!

కుండపోతగా కురుస్తున్న వర్షం ఆగిపోయింది పర్జన్య గర్జలింకా విన్పిస్తూనే వున్నాయ్ మిళుక్, తళుక్ మని మెరుపులు ఛూ క్, ఝణక్ మంటున్నాయి రోడ్లవెంట వర్షపునీరు కాలువలై పరుగెత్తుతోంది

రివ్వున వీచే చల్లగాలికి ఒళ్ళు జివ్వుమంటున్నా, తపతప పడుతున్న తుంపరకు మేని తడిసి పోతున్నా, నెత్తికి కొంగును గట్టి, చేతను కర్రను బట్టి ఆదే పనిగా చూస్తోందా అవ్వ-దూరంగా దారివెంటే-

వర్షపుకోటు వేసుకుని సైకిల్‌పై వస్తూన్న పోస్ట్‌మానని చూడగానే సంబరపడిపోయింది అవ్వ, "కనీసం ఈ రోజైనా తన నిరీక్షణ ఫలించకపోదు" అనుకుంటూ

"ఏమీలేదవ్వా! వుంటే ఇస్తానుగా?!" అనుకుంటూ వెళ్ళిపోయాడు పోస్ట్‌మాన్

బాధగా తల వాల్చుకుంది అవ్వ కళ్ళుమూసుకుంది నిస్తేజంగా మనసొకమారు గజిబిజి ఆలోచనలకు కళ్ళెంవేసి స్తబ్ధురాలయ్యింది అప్రయత్నంగాఅడుగు

శివం

వెనక్కేసింది అవెంటనే దుఃఖం గుండెల్లోంచి ఉబికి ఉబికి వచ్చింది కన్నకడుపు శోకమేదో కంటిసీరై గుంటలు పడ్డ చెంపలవెంట జారింది మనసు మళ్ళీ ఆలోచించడం మొదలెట్టింది

ఏ కల్లోలపు వర్షాకాలం కుంభవృష్టి తుఫాను భీభత్సాలు ఎక్కడె వరున్నారో ఎవరికీ తెలియరాదు నాయనెట్లున్నాడో ఎంత కష్టంగా బయట తిరుగు తున్నాడో ఏం తింటున్నాడో సమాచారమే తెలియకుండే...అయ్యో..!!

ఆమె మౌన రోధనకు అంతే లేకుండా పోయింది.

శీతగాలి అతి లాఘవంగా వీస్తోంది.

కుంపటికడ కూర్చున్న అవ్వ ఆనందంగా పరిపరి విధాల ఆలోచిస్తోంది. మాటిమాటికి లేచివెళ్ళి గోడకు తగిలించి వున్న ఫోటోల్ని బుడ్డిదీపం వెల్తురులో అదేపనిగా చూస్తూ... "నాయనా... నాబాబూ"...అనుకుంటోంది.

చేత్తోకొడుకు ఫోటోని తాకి తలని నిమురుతున్న ఆనందానుభూతిని పొందుతోంది.

కొంగున కట్టుకున్న ఉత్తరాన్ని తీసి అదేపనిగా ముద్దుపెట్టుకుంది.

ఏదో గుర్తొచ్చిన దాన్లా కాగుల్లో దాచిన మూటల్ని విప్పి, సంతృప్తిగా శ్వాసపీల్చి మళ్ళీ సర్దేసింది.

నింగి కెగిసిన చందమామ సైతం అవ్వ పెదవుల మీద చిరునవ్వు అమృతమనుకుంది మెరిసే వెన్నెల సైతం అవ్వ కళ్ళ కాంతికి అబ్బురపడింది.

అవ్వ ఇంటి చుట్టూ పూలచెట్లను ప్రేమగా నిమిరింది. వడిచుట్టూ చెల్లాచెదురంతా తీసేసి శుభ్రంగా ఊడ్చింది

చాలా కాలం నుండి తన యెదుట లేని తన ముద్దుల కొడుకు త్వరలో తన ముంగిట వ్రాలబోతున్నాడని తెలిసినప్పుడు అవ్వసంతోషం అవధులు దాటింది ఆమెహృదయంలో ప్రేమ సాగరం హోరుగా పొర్లింది

అవ్వ ఉత్తరాన్ని పరికించి చూసి మళ్ళీమళ్ళీ ముద్దాడింది ఆరోజు

ఎప్పటిలాగే ఉత్తరం కై ఎదురు చూస్తోన్న అవ్వకు నిరాశ దరి జేరలేదు. ఉత్తరం తెచ్చిన పోస్ట్‌మాన్ చదివి మరీ వెళ్ళాడు. ఇంకో నెలరోజుల్లోకు కొడుకు తన వద్దకు వస్తున్నాడుట-అదీ విషయం. పరవళ్ళు త్రొక్కిన సంతోషంతో అవ్వ ఆ వార్తను వాడంతా మ్రోగించింది. తన కొడుకును చూడాలని ఉబలాట పడ్తోన్న బంధువులందరికీ ఆ విషయం ఎరుకపరిచింది.

అరుదుగా వస్తోన్న అతగాడి దర్శన భాగ్యం గురించి తెలిసి ఆ ఇల్లు పులకించి పోయింది.

అవ్వకదలికల్లో చైతన్యం వెల్లి విరుస్తోంది. కొడుక్కి ఇష్టమైన రకరకాల తినుబండారాలెన్నో చేయడం మొదలెట్టింది. "దేశం కాని దేశంలో వుంటున్నాడు...ఏం దొరుకుతాయో...ఏం తింటున్నాడో ఏమో..." అనుకుంటూ.. గోరంత ముద్దలంటూ ఆప్యాయంగా కొడుక్కి తన చేతుల్తో తినిపించిన కాలాన్ని కళ్ళమీద నెమరేసుకుంటూ... పలురకాల తినుబండారాల్ని బహు ప్రేమగా తయారు చేస్తూ...

"తోడెవరున్నారో లేరో...ఒకింటి

ఎన్నిసార్లు తిన్నా యింకా,యింకా
తినాలనిపిస్తుంది
















# క్రేన్

## వక్కపొడి

దీనికి సాటి మరొకటి లేదు.

TARA - CBNPW - 1310 83 - TEL

వాన్ని చెప్తే ఆచ్చబా ముచ్చటా తీరి పోవు..." ననుకుంటూ వుంటే, దూరమయిన దగ్గరి చుట్టం పిల్ల "లక్ష్మీ"ని తన కొడుక్కిస్తామంటూ వచ్చిన చంద్రన్న గుర్తుకువచ్చి...కొడుకువచ్చే సరికి వాళ్ళను కూడా రమ్మని వ్రాసింది.

అవ్వ సంతోషానికి అంతే లేదు-రేపే తన కొడుకురాక ముసలి తల్లి ఒడలంతా పులకరింతల్లో పునీతమైపోతుంది. చుట్టు ప్రక్కల వాళ్ళంతా సత్యంని చూసే అదృష్టంకై ఎదురుచూస్తూ వున్నారు.

ముద్దుగా ముస్తాబైన ఆ ఇల్లు స్వాగత సందేశాన్ని అదేపనిగా సాగ సంపుతోంది.

బోసిపోయిన ఆ ఇల్లు రేపు సందడిలో కళకళలాడుతుందని తోచి ఆ వ్వ ఆనందం అంబరాని కెగిసింది.

ఆరోజు రానే వచ్చింది.

పదేపదే దారివైపు చూస్తోంది అవ్వ. ఇంట్లోపలురకాలు వస్తువుల్ని తట్టి లేపుతోంది.

గంట...రెండు గంటలు...రోజు గడిచి పోయింది.

కొడుకు రానే లేదు.

"ఏమాయెనో, కొడుకు రాలేదు?" అని పరిపరి విధాల బాధపడి శోకతప్తతి అయ్యిందా తల్లి.

ఎదురు చూసిన వాడ వారికి నిరాశే ఎదుట నిల్చింది.

కొడుకు ధ్యాస మీద గతాన్ని నెమరేసు కుంటూ మధన పడుతోన్న అవ్వను సమీపించి,

"క్షమించవ్వా! సత్యం వాళ్ళఇల్లు ఇదేనా?" అని అడిగాడు రాజేష్.

"అవునయ్యా! ఎవరు మీరు." అన్నది అవ్వ.

"మీరు సత్యం తల్లిగారా? నమస్కారం సత్యం రావాలి కాదా, వచ్చాడా?"

"రాలేదు...మీరు...."

"నేను సత్యం మిత్రున్ని వాడూ,నేనూ ఒకేచోట చదువు కున్నాం, ఒకేలా బ్రతికాం, వాడు అన్నందుకు మన్నించండి, మాది అంత ప్రాణ స్నేహం..."

అవ్వ ఆప్యాయంగా అతని కేసి చూసింది-తనకొడుకంత ఉన్నాడు. ముఖంలో చిరునవ్వు, అచ్చు అతడి లాగే...అవ్వ మనసు పురి విప్పిన నెమలిలా విప్పారింది. కళ్ళలో మెరుపు కాంతులు విరిశాయి-మాతృప్రేమ. ఆంతరాంత రాళ్లోంచి పొంగి పొర్లింది. ఆ అనుభూతితోనే ఆతన్ని సమీపించి నుదుటిపై చుంబించి అక్కున చేర్చుకుంది.

"సత్యం నీప్రాణమైతే ఆ సత్యం నువ్వేరా...రా నాయనా ఎట్లా వున్నావో, ఏమో...కాళ్ళకు నీళ్ళిచ్చింది.

రాజేష్ ఆమె చూపించిన వాత్సల్యానికి కొంతకంగారు పడి, తొట్రుపడ్డా ఆ అనుభూతిని బయట పడనీయలేదు. అవ్వకు అనుగుణంగా ప్రవర్తించడానికి సిద్ధమయ్యాడు.

అవ్వ త్రాగడానికి మంచి నీరిచ్చింది

తన కొడుకొస్తాడని ప్రేమగా చేసి వుంచిన తినుబండారా లన్నింటిని, ఒక్కటొక్కటే ముందుంచింది. రాజేష్ తను తినలేనని ఎంత వారించినా, ఎంత ప్రాధేయ పడినా —

"తిను కొడుకా, తిను...ఇది కన్న తల్లి కడుపు తీపి నాయనా ..ఈ చేయిని

వారించకు...." అంటూ అందించింది

"అవ్వా!" అన్నాడు రాజేష్ అంత గొప్ప ప్రేమానుభూతిని భరించ లేక,

"మాతృత్వం వత్సల్యంలో భ్రాతృత్వం నీకుంది కొడుకా...

సత్యం వస్తాడని ఎన్నాళ్ళుగానో ఎదురు చూసి, ఇలా సిద్ధం చేస్తే వాడి రాక నిరాశగానే మిగిలింది. నీవైనా ఈ సంతృప్తిని నిలువనీయి నాయనా..."

అవ్వ కొసరి కొసరి తినిపిస్తూనేవుంది.

రాజేష్ గారాబు చేస్తూ, గతాన్ని కెలుకుతూ ఆరగిస్తూ వున్నాడు.

'బిడ్డా-సత్యం ఎందుకు రాలేదో నీవైనా చెప్పగలవా?'

"చెప్పలేదమ్మా. ఉత్తరాలు బాగనే వ్రాసేవాడు కానీ ఎందుకో చాలా రోజుల్నుండి వ్రాయడమే లేదు. ఈమధ్య తను వస్తున్నాడని, తప్పకుండా వచ్చి కలువమని వ్రాస్తే వచ్చాను. ఎందుకు రాలేదో...?"

"ప్చ్...వాడి ధోరణి మారిపోయింది. ఎక్కడి చదువులో పాడు చదువులు-చదివిన కాలంలో కూడా నాదగ్గర లేడు బిడ్డడు. ఉద్యోగం అంటూ వచ్చింది. అదీ అంతే...ఎడతెగని చదువేంటో కానీ వాడి ధ్యాస ఎప్పుడూ చదువే...ముసలి తల్లి ఏడ్చి చస్తుందన్న జాలి అయినా వాడికి-లేదు కనీసం ఉత్తరాన్నైన వ్రాయడు. పిల్లలిద్దరూ పట్నంకే పోయిరి-ఒంటరిగా బిక్కుబిక్కుమని బ్రతుకుతున్నా నిక్కా...వస్తానని ఆశ పెట్టితీరా రానే లేదు చూడు..."

అవ్వ ఆవేశానకు తల్లడిల్లి పోయాడు రాజేష

కళ్యాణిఖని
తేదీ 31-12-83

డియర్ సత్యం,

నేనెంత అదృష్టవంతున్నంటే, ఈ ప్రపంచంలో బహుశా నాకన్నా అదృష్టవంతులు వేరొకరు వుండరు. ఉద్యోగరీత్యా నేనిప్పుడు మీఊళ్ళోనే వున్నాను

కన్నతల్లిని చిన్న వయసులోనే పోగొట్టుకున్న నేను, ఎంతో పెద్దయ్యాక ఈనాడు ఓతల్లి "కడుపు తీపి"ని పంచుకుంటున్నాను. ఆ తల్లి ఎవరో కాదు నీ తల్లియే. తల్లి ప్రేమకు దూరమై బ్రతికే నీ దురదృష్టాన్ని తిట్టుకున్నా, ఆ ప్రేమను పంచుకుంటున్నందుకు నన్ను మనసారా క్షమిస్తావని ఆశిస్తాను.

యువర్స్ బ్రదర్లీ
రాజేష్

ఉదయం ఆరింటికి బయట కెళ్తే, సాయంత్రం ఎప్పుడు తిరిగి వచ్చేదీ తెలియని సత్యం. కాలకృత్యాలకే సహకరించని కాలినడకలు, కంపెనీకి ప్రయాణాలు, ఉద్యోగ బాధ్యతలు, శక్తికి మించిన పనులు, పై చదువులకు పరిశ్రమ, సాహిత్యం, సంగీతం, పరిశోధన, వగైరా బోల్డు దౌర్భాగ్యపు హాబీల్తో అనుక్షణం సతమతమయిపోతున్న సత్యం ఉత్తరం చదివి తల్లి ఫోటో వైపు చూశాడు. తల్లి కళ్ళలోంచి వచ్చిన కరుణ కటాక్ష వీక్షణ కాంతి పుంజాలు గుండెలు తాకి పరమానందభరితుడయ్యాడు. 'శుభమస్తు' అనుకుంటూ తన పనిలోకి జారిపోయాడు సత్యం.

# సందర్భప్రే(రణ)లాపనలు

LOVE క్యం.

కళాకారుడిగా
జన్మ నొందడం ప్రాప్త్యం
ధన్యమొందడం వైప్రాప్త్యం
'ఓ-పికరవం'

ఏ పనైనా
తొందరగా చేయుటం వేరు
తొందర పడి చేయుటం వేరు
మొదటిది వరం
రెండవది క్షవరం.

—రాజి

ఈ నెల



# నవలానుబంధం

తో

మహిళా మటాష్ ఆపషన్

-ఆదివిష్ణు

మా ఇల్లు అద్దెకిస్తాం

-రావికొండలరావు

# మహిళా మటాష్ లోషన్

## ఆదివిష్ణు



**పాత్రలు :**

గోపాలకృష్ణ : (30-35 సం॥ల వయస్సు)
సత్యానందం : (30-32 సం॥ల వయస్సు)
మంగపతి : (30-31 సం॥ల వయస్సు)
సుబ్బారావు : (55-60 సం॥ల వయస్సు)
సావిత్రి : (25-27 సం॥ల వయస్సు)
స్వాదువ్వ ; [40 45 సం॥ల వయస్సు]

(ఈ నాటికను ముందుగా ఎవరు ప్రదర్శించాలనుకున్నా—ముందుగా రచయిత లిఖిత పూర్వకమైన **అనుమతి తీసుకోవాలి**)

[సత్యానందం ఇల్లు. అలకరణ సర్వసాధారణంగా వుంది. ఒక గదిలోంచి సత్యానందం పేపర్తో హాల్లోకి వచ్చాడు. కుర్చీలో కూర్చుని తాపీగా మనుసంగా చదువుతున్నాడు. అకస్మాత్తుగా లేచి నించున్నాడు. ఎంతో కుతూహలంగా ఒక ప్రకటన చదువుతున్నాడు.]

**సత్యా:** అఖిలాంధ్ర భార్యా బాధితుల సంఘం (వంటగదిలొకి తొంగిచూసి, ఆ తర్వాత మరింత బిగ్గరగా చదువుతున్నాడు) అఖిలాంధ్ర భార్యా బాధితుల సంఘం ఇన్నీసుపేట రాజమండ్రి. భార్యలచేత బాధింపబడే భర్తలకు శుభవార్త. మీ భార్య చేతిలో మీరు కీలుబొమ్మలా? ఆవిడ చెప్పినట్లల్లా తలూపే గంగిరెద్దులా? దిగులు పడకండి. వెంటనే భార్యా బాధితుల సంఘంలో చేరండి. మంచిరోజులు మిమ్మల్ని వెతుక్కుంటూ వచ్చేస్తాయి. (ఆనందం పట్టలేక అనుకున్నాడు) అహా...ఇంక నేను భయపడ నక్కర్లేదు. మొగుళ్ళ మొర ఆలకించిన ఆపద్బాంధవా? నీకు శతకోటి వందనాలు. (మళ్ళీ చదివేసు) భార్యా బాధితుల సంఘంలో చేరగానే భార్యలను లొంగదీసుకునే చిట్కాలు మొదటి వారంలో చెప్పబడతాయి. రెండోవారం వాటిని ప్రయోగించ బడతాయి. ముచ్చటగా మూడోవారం నుంచే సత్ఫలితాలు పొందుతారు. మీ సభ్యత్వం కోసం వెంటనే సంప్రదించండి.—ఒక మాజీభార్యా బాధితుడు. డోరు నెం. 123, ఇన్నీసుపేట రాజమండ్రి.

(సత్యానందం పేపరు మడిచి అటూ ఇటూ తిరుగుతూ అనుకుంటున్నాడు) ఇన్నీసుపేట రాజమండ్రి. రాజమండ్రి ఇన్నీసుపేట.

(లోపల్నుంచి సావిత్రి వస్తోంది. అతని వరస గమనించింది క్షణం సేపు. ఆ తర్వాత అక్కడ నిలబడి అతన్ని పిలిచింది).

**సావి:** ఏమండీ?

**సత్యా:** (తిరుగుతూనే వున్నాడు) ఇన్నీసుపేట రాజమండ్రి.

**సావి:** (ఆశ్చర్యంగా) ఇన్నీసుపేట.

సత్యా: రాజమండ్రి.
సావి: ఏమిటా దండకం?
సత్యా: ఇన్నీసుపేట రాజమండ్రి.
సావి: (అరిచింది) ఇదుగో... మిమ్మల్నే!
(ఆ అరుపుకి సత్యానందం ఉలుకుపడ్డాడు. తక్షణం ఆగిపోతాడు. భార్యని చూస్తూ క్షణంసేపు మాటాడలేదు. ఆ తర్వాత వినయంగా అడిగాడు)
సత్యా: పిలిచావా సావిత్రీ?
సావి: కాదు. అరిచాను! (వస్తూ) మాయదారి గోలంట. మాయదారిగోల. ఇన్నీసుపేట రాజమండ్రి అంటూ ఎక్కాలు చదువుతుంటే నా పిలుపులేం వినిపిస్తాయి? ఇంతకీ ఇన్నీసుపేటేమిటి? రాజమండ్రేమిటి?
(సత్యానందం పేపరు దాచేస్తూ, దిగులుగా అన్నాడు)
సత్యా: ఓ! అదా! అదీ?
సావి: ఊ... అదే! ఏమిటని అడుగుతున్నాను.
సత్యా: అదే! ఇవాళ ఆదివారం గదా!
సావి: ఊ... అయితే?
సత్యా: ఆదివారంనాడు ఇన్నీసుపేట రాజమండ్రి అంటూ ఇరవైసార్లనుకుంటే-
సావి: ఊ... అనుకుంటే?
సత్యా: ఆ భర్త తన భార్యకి చేసే సేవలన్నీ సక్రమంగా వుంటాయిట.
సావి: (ఆనందంగా) మరి చెప్పరే? ఆ మంత్రాన్ని ఇప్పటికి ఎన్నిసార్లను కున్నారు?
సత్యా: పదిహేడు!
సావి: ఊ... కానివ్వండి. మిగతా మూడుసార్లూ గబగబా అనేసుకోండి. ఎంచక్కా నాకు సేవలు చేసుకోవచ్చు.
సత్యా: అట్లాగే! ఇన్నీసుపేట రాజమండ్రి. రాజమండ్రి ఇన్నీసుపేట ఇన్నీసుపేట రాజమండ్రి అమ్మయ్య అయిపోయింది సావిత్రీ!
సావి: బాగానే వుంది. బస్సు కండక్టరులాగా బాగానే అన్నారు?
సత్యా: ఎగతాళి చెయ్యకూడదు సావిత్రీ! ఇదొక వ్రతం. భార్యావ్రతం. ఎంత నిష్టగాచేస్తే ఆ భర్త ఆ భార్యకి అంత దాసానుదాసుడవుతాడు.
సావి: మంచి వ్రతమే! ఇంతకీ ఆ వ్రతం గురించి చెప్పిన పుణ్యాత్ముడెవరో?
సత్యా: (పేపరు చూపెడుతూ) వివరాలన్నీ ఈ పేపర్లో వున్నాయి.
సావి: అట్లాగా! ఏదీ ఇల్లా ఇవ్వండీ?
సత్యా: (చేసిన పొరపాటు గుర్తొచ్చింది భయపడ్డాడు. పేపరు దాచేస్తూ) వద్దులే! మొత్తం నే చదివేసాగా?
సావి: ఏం చదివారో ఏమో? నన్నుకూడా చదవనీండి.

సత్యా: సావిత్రీ! (భయంగా అన్నాడు)
సావి: మామూలు వ్రతంకోసం కాదు. భార్యావ్రతం! వ్రతంలో చెప్పినవన్నీ మీచేత శ్రద్ధగా చేయించాలంటే నేను కూడా చదవాలిగా! ఇవ్వండి.
సత్యా: (భయంగా) ఊహు...వద్దు!
సావి: (గద్దించింది) ఇవ్వమంటుంటే-
(పేపరు లాక్కుంది. ప్రకటన చూస్తోంది. సత్యానందం అటు తిరిగి జుట్టు పీక్కుంటున్నాడు.)
సావి: అఖిలాంధ్ర భార్యా బాధితుల సంఘం!
(సత్యానందం చెవులు మూసుకున్నాడు)
సావి; ఇన్నీసుపేట. రాజమండ్రి. భార్యలచేత బాధింపబడే భర్తలకు శుభవార్త.
సత్యా: (అరిచాడు) భగవాన్!
సావి: మీ భార్య చేతిలో మీరు కీలుబొమ్మలా? ఆవిడ చెప్పినట్లల్లా తలూపే గంగిరెద్దులా? దిగులు పడకండి! (భర్తతో) ఏమిటి వీడి పిండాకూడు రాతలూ వీడూను! భార్యకి భయపడని భర్త భూలోకంలో అసలుంటాడా?
సత్యా: (అరిచాడు) ఎందుకుంటాడూ? వుండడు!
సావి: మరెందుకీ పిచ్చిరాతలు?
(అని పేపరు నేలమీదికి విసిరి కొట్టింది.)
సావి: ఇలాంటి పాపిష్టి రాతలు చదివి చెడిపోవాలను కుంటున్నారా?
సత్యా; ఊహూ-చెడిపోను.
సావి: చాల్లే ఊరుకోండి. కడుపులోకుట్రపెట్టుకుని నన్ను మాయచేయాలనుకున్నారు గదూ! ఇదుగో...ఇప్పుడే చెప్తున్నా! మళ్ళీ ఇంకో తడవ ఇన్నీసుపేట పేరెత్తినా ఆ దిక్కుమాలిన పేటలో అడుగుపెట్టినట్లు తెలిసినా-మీకు పుట్టగతుల్లేకుండా చేస్తాను జాగర్త.
(అని వంట గదిలోకి వెళ్ళిపోయింది. సత్యానందం కుర్చీలో కూలబడిపోతూ అనుకున్నాడు.)
సత్యా, గోవింద! ఇంకేం వెడతాను ఇన్నీసుపేట? నేనికైనా ప్రాప్తముండాలి. ఇందుకే కాబోలు!
(సావిత్రి బియ్యం చేటతో తిరిగొచ్చింది)
సావి: ఊ...తీసుకోండి.
సత్యా: ఏమిటిదీ?
సావి: చేట. కనిపించడం లేదా?
సత్యా: కనిపిస్తూనే వుంది. అందులో బియ్యం కూడా వున్నట్లున్నాయి.
సావి: బియ్యంలో రాళ్ళు కూడా వున్నాయి. తీసుకోండి ముందు.
సత్యా: (తీసుకోకుండానే) తీసుకుని ఏంచేయాలి?

సావి: రాళ్ళు ఏరాలి?
సత్యా: ఎవరు?
సావి: మీరే?
సత్యా: (షాకై పోతాడు) సావిత్రీ...చివరికి నన్ను బియ్యమేరే లెవెల్లో పారేసావా?
సావి: ఎందుకట్లా గాబరా పడతారూ? కొండలు పిండిచేయమన్నానా? కాలువలు పూడ్చమన్నానా? బియ్యంలో రాళ్ళు ఏరమన్నాను. అంతేగా.
సత్యా: అంతే అనుకో! కానీ-దీనికంటే కొండల్ని పిండిచేయడం, కాలవల్ని పూడ్చి పెట్టడమే బెటరు! (చేటవేపు చూపెడుతూ) ఇదేమొ...ఆడంగులు చేసేపని కాబోలు!
సావి: ఏం ఫర్లేదు. మగాళ్ళు కూడా చేయచ్చు. అయినా-మగాళ్ళు బియ్యంలో రాళ్ళేరకూడదని రూలేమైనా వుందా?
సత్యా: లేదనుకో!
సావి: మరింకే! తీసుకోండి,
(తీసుకోక తప్పిందికాదు. తీసుకుంటానే అన్నాడు)
సత్యా: ఇవాళ ఆదివారంగదా-ఎవరైనా ఇంటికొస్తారేమో సావిత్రీ!
సావి: వస్తే ఏమవుతుందిట?
సత్యా: వాళ్ళముందు ఈ చేటపని ఏం బావుంటుంది చెప్పు?
సావి: ఎందుకు బావుండదూ! మన ఇంటిపన్లు మనం చేసుకుంటే తప్పా?
సత్యా: తప్పు కాదనుకో! ఎంతైనా ఇది చేట. నా చేతిలో వుంటే ఆడంగి వెధవను కుంటారేమో?
సావి: ఇంటి పనుల్లో ఆడామగా తేడాలుండవని చెప్పానా?
సత్యా: చెప్పావు!
సావి: అంచేత ఇక నసపెట్టకండి. అంతెందుకూ- మా కుసుమ మొగుడు లేడూ?
సత్యా: వున్నాడు. అతను కూడా బియ్యంలో రాళ్ళేరుతూ వుంటాడా?
సావి: అంతేకాదు. అంట్లుకూడా తోముతాడు.
సత్యా: మరి చెప్పవే! అతనికంటే నేనే బెటరు. బట్టలు మాత్రమే ఉతుకుతాను! కదూ?
సావి: అంటే? అంట్లు తోమరా?
సత్యా: అని కాదనుకో!
సావి: అనుకోడాల్లేవు! అవసరమైతే తోమాల్సిందే!
సత్యా: అట్లాగే! తోముతాను. ఎందుకు తోమనూ!
సావి: ఊ...ఊ... ముందు చెప్పినపని కానివ్వండి.
సత్యా: చేటపనికదా! చేస్తాను. అంటూ (వెళ్ళబోతాడు)
సావి: ఆగండి! (ఆగాడు) అటెక్కడికి?
సత్యా: తలుపేసి వస్తాను సావిత్రీ!

సావి: ఏవక్కర్లేదు. తెరిచే వుంచండి!
సత్యా: ఎవరైనా మగాళ్ళు వస్తారేమో?.
సావి: (మొగుడు మీదికి రయ్యిన వెళ్ళింది) ఇందాకట్నుంచీ చూస్తున్నాను. అసలేమిటి మీ ఉద్దేశం? బియ్యమేరడం, అంట్లు తోమడం, పప్పు రుబ్బడం-ఇవన్నీ ఆడంగి పనులనుకుంటున్నారా?
సత్యా: నేనా? రామరామ! ఆఫీల్డులో పండిపోయినవాడ్ని! నేనెందుకనుకుంటానూ? గిట్టనివాళ్ళు చూస్తే అనుకుంటారేమోనని-
సావి: ఎవరండీ ఆ గిట్టని వాళ్ళు! మచ్చుకి ఒక్కళ్ళని చూపించండి. అందరూ వాళ్ళవాళ్ళ ఇళ్ళల్లో చేసే పనులే ఇవి.
సత్యా: కొందరు చేయరేమోనని డవుటు సావిత్రీ!
సావి: చాల్లే వూరుకోండి. డవుటు ముందుపుట్టి తర్వాత మీరు పుట్టారు. ఇల్లాలంటే ఏమనుకుంటున్నారు?
సత్యా: ఇంటికి దీపమని మొన్నేగా చెప్పావు. మరిచిపోలేదు.
సావి: అవునా మరలాంటి దీపంలాంటి ఇల్లాలిమాట వినకపోతే ఇల్లు చీకటైపోతుంది. మీ కళ్ళు పేలిపోతాయి. ఊ...ఊ... ముందు బియ్యంపని చూడండి.
[సత్యానందం గబగబా రాళ్ళేరుతున్నాడు]
సావి: ఆపని అయ్యాక బియ్యం కడిగి ఎసట్లో వేయండి.
సత్యా: అంటే? ఇవాళ వంట కూడా నన్నే చెయ్యమంటావా?
సావి: తప్పదుమరి! నేను మార్నింగ్‌షోకి వెడుతున్నాగా.
సత్యా: (ఆనందంగా) మార్నింగ్‌షోకా? నేకూడా వస్తే ఎలా వుంటుంది?
సావి: ఏడ్చినట్టుంటుంది! మార్నింగ్‌షోలు ఆడవాళ్ళకోసమే వుంటాయి.
సత్యా: అలాంటప్పుడు వాటిని మార్నింగ్‌షోలనే దానికంటే మహిళాషోలంటే బెటరేమో!
సావి: ఏ పేరుతో పిలిచినా అవి మాకోసమే వేస్తారు హైదరాబాదు వెళ్ళిచూడండి. మగాళ్ళంతా ఆఫీసుకెళ్ళిపోయాక-ఆడాళ్ళంతా మార్నింగ్‌షోకి వెళ్ళిపోతారు.
సత్యా: హైదరాబాదు పద్ధతి ఈ ఊరుక్కూడా వచ్చేసిందా?
సావి: రాకూడదనే రూలేమైనా వుందా? ఆడవాళ్ళు ఆడవాళ్ళే. ఎక్కడున్నా వాళ్ళ పద్ధతుల్లో మార్పులుండవు.
సత్యా: అసాటి ఐక్యత మగాళ్ళలో వుంటే-ఈ చేట పనులు తప్పేవి!
సావి. (టైం చూసుకుంది) అమ్మో! టైంలేదు మీతో వాదన పెట్టుకుంటే అక్కడ ఇంటర్వెల్లవుతుంది. వెళ్ళి వంటపని చూడండి.
[టేబిల్ దగ్గరకెళ్ళి వేనిటీబాగు తీసుకుంటో, చెప్పులు తొడుక్కుంటో చెబుతోంది]
సావి: సినిమా అయ్యేసరికి మధ్యాహ్నం ఒంటి గంటవుతుంది! ఆవేళకి కడుపులో ఎలుకలు పరుగెడతాయి. అంచేత వంటచేసి సిద్ధంగా వుంచండి.

సత్యా: అట్లాగే!

సావి: [వెళ్ళిపోతూ చెబుతోంది] పగటిపూట ఆఫీసులో నిద్రపోతున్నట్టు-ఇంట్లో కూడా నిద్రపోకండి, వంటపని ఆగిపోతుంది. వస్తా!

[అని ఆమె సుడిగాలిలా వెళ్ళిపోయింది. సత్యానందం క్షణం అట్లాగే నిలబడి ఆ తర్వాత గుమ్మంవేపు నడుస్తూ గొణుక్కుంటున్నాడు]

సత్యా: ముందు తలుపు బిగిస్తే సేఫుగా వుంటుంది. తలుపు వేసి వస్తూ హాల్లో ఒక చోట ఆగిపోతాడు. తండ్రిఫోటో చూస్తూ అన్నాడు. చేతితో చేట హారతిలా పట్టుకున్నాడు.] చూడు నాన్నా! బాగా చూడు! నా చేతిలో చేటపెట్టి తాను సినిమాకి వెళ్ళిపోయింది. ఇందుకేనా నన్ను పెళ్ళిచేసుకోమన్నావ్? చచ్చి ఎక్కడున్నావో గాని ఫాదర్-నాకు పెళ్ళిచేసి నన్నుకూడా చంపేశావ్! మా ఇద్దర్లో మొగుడెవరో పెళ్ళామెవరో తెలీక అల్లాడి పోతున్నాను. ఈ గజ్జల గుర్రాన్ని నాకు అంటగట్టి నువ్వు బాల్చి తన్నేసావ్. ఇదేమో రోజుకో రకంగా నామీదెక్కి స్వారీచేస్తోంది. స్వారీ...

[తలుపు శబ్దమైంది. ఉలిక్కి పడ్డాడు. ఇంకా శబ్దమవుతోంది. చేతిలో చేటనిచూసి గుటక వేసాడు.]

సత్యా: ఎవరదీ!

బయటవ్యక్తి: తలుపుతీయ్.

సత్యా: ఎవరంటుంటే?

వ్యక్తి: నేనురా! గోపాలక్రిష్ణని!

సత్యా: [గొణుక్కున్నాడు] అమ్మో! ఈ గోపిగాడు ఆకాశవాణిలాటివాడు. నన్నీస్థితిలో చూశాడంటే చచ్చినంత పనవుతుంది.

గోపా: తలుపు తీయరా!

సత్యా: [ఖంగారుగా] వుండుండు వస్తున్నా!

[బియ్యం చేటని వంటగదిలో పెట్టేసి-చేతులు దులుపుకుంటూ వచ్చాడు]

గోపా: ఒరేయ్...తలుపు తీయరా!

[సత్యానందం తలుపు తీసాడు. గోపాలకృష్ణ చేతులు వెనక్కి పెట్టుకుని దర్జా ఫోజులో వస్తూ పరిసరాలు పరిశీలిస్తున్నాడు. సత్యానందం భయపడుతున్నాడు].

గోపా: ఇంతసేపూ ఏంచేస్తున్నావురా?

సత్యా: [వళ్ళుమండి అన్నాడు] గోళ్ళు గిల్లుకుంటున్నాను!

గోపా: గోళ్ళా?

సత్యా: లేకపోతే ఏమిటి నీ చచ్చు ప్రశ్న!

గోపా: అహ! ఎంత బాదినా తలుపు తీయక పోతేనూ-ఏదైనా చెప్పకూడని కార్యక్రమం పెట్టుకున్నావేమోనని-

సత్యా: చెప్పకూడని కార్యక్రమం అంటే? [భయంగా అడిగాడు]

గోపా: అదివారంగదా! చెల్లాయితో కులాసాగా-

సత్యా: చంపేస్తానొరేయ్. పిచ్చిపిచ్చిగా మాటాడకు. ఎప్పుడు పడితే అప్పుడు

పెళ్ళాంతో సరసాలాడటానికి నేను చవటన్నేం కాదు!

**గోపా.** ఆపని చవటలే చేస్తారా?

**సత్యా** పెళ్ళాన్ని మెప్పించి ఆవిడ కరుణా కటాక్షాలు కోరేవాళ్ళంతా ఆపనే చేస్తారు మన్సంగతి అట్లాకాదు చెటాఫట్! ఇంతకీ ఎందుకొచ్చినట్టు?

**గోపా** [అటూఇటూ చూస్తూ] చెల్లాయి యింట్లో లేదా ఏమిటి?

**సత్యా** వుంది ఇంట్లో వుండక ఎక్కడ చస్తుంది! ఇంట్లోనే వుంది!

**గోపా:** అబ్బ ఏం నోర్రా!

**సత్యా:** అంతేమరి! నాకు మామూలు మాటలురావు. ఇంతకీదాన్తో నీకు పనేమిటి?

**గోపా:** మరేం లేదు! తలుపు నువ్వు తీస్తేనూ?

**సత్యా:** [బెదిరి అన్నాడు] అదా! అదంతేలే! వంట గదిలోంచి కదలొద్దని ఆర్డరు వేశాను.

**గోపా:** అనుకూల దాంపత్యమంటే అట్లా వుండాలి? ఒరే-నిన్ను చూస్తుంటే ఈర్ష్యగా వుందిరా సత్యానందం! ఆర్డర్లేసి కాపరాన్ని ఆనందంగా సాగిస్తున్నావ్!

**సత్యా:** థేంక్యూ! నేనొకటి చెప్తా విను. కాపరం తగలబడిపోయినా-కళకళలాడు తున్నా-దానిక్కారణం ఆడదే! అలుసిస్తే నెత్తినెక్కుతుంది. ఆ దెబ్బతో కాపురం దివాళా తీస్తుంది! ఆడదానికి కళ్ళెంవేసి అదుపులో వుంచావనుకో-ఆ ఇల్లు హరివిల్లవు తుంది!

**గోపా:** కళ్ళెం గట్రాలు వేయాలంటే అప్పుడప్పుడు చెయ్యి చేసుకోవాలేమో గదరా!

**సత్యా:** తప్పని సరైతే తప్పదుమరి! అంతెందుకూ ఇప్పుడేం జరిగిందో తెలుసా? మార్నింగ్‌షోకి వెడదామంది మా ఆవిడ....మార్నింగూ లేదూ. మ్యాట్నీ లేదూ నోరు మూసుక్కూచోమన్నాను, కొంచెం మారాం చేసింది. అంతే! గబగబా నాలుగిచ్చే శాను ఫినిష్. బుద్ధిగా పొయ్యిముందు కూచుంది!

**గోపా:** ఏమిటోరా! పాడు ఆదివారం! మా ఇంటోనూ ఇదే గొడవ. మా మాలతి కూడా మార్నింగ్‌షోకి వెడతానంది. వీల్లేదన్నాను. ఇల్లుకదిలావంటే కాళ్ళు విరగ్గొడతా నన్నాను. ఒక మూలచేరి గొణుక్కుంటుంటే నాక్కోపం వచ్చింది. బెల్టుతీసి ఉతికే శాను.

**సత్యా:** సెభాష్...మగాడన్న తర్వాత ఆపాటి స్పీడు వుండాల్సిందే!

**గోపా:** ఏమి స్పీడో...చితక బాదేసానేగాని-అదెంత ఏడుస్తుందోనని యిప్పుడు ఫీలై పోతున్నాను.

**సత్యా:** అదే తప్పు! మా ఆవిడ్ని ఎప్పుడు కొట్టినా నేనసలు ఫీలవ్వనే అవ్వను. ఎంచేత అడుగు?

**గోపా** ఎంచేత?

**సత్యా** ఫీలవుతున్నట్టు తెలుస్తే కధ అడ్డం తిరుగుతుంది గోపాలక్రిష్ణా! ఎంత ఉడుకుతున్నా మొగుడు ఉత్త వీక్ వెధవని పసిగట్టేసి మెలోడ్రామా డైలాగుల్తో

వాడి మనసు కరిగించేసి ఆ పైన వాడినెత్తి నెక్కుతారు.

*గోపా:* నిజానికి మా మాలతి మంచి ఆడదేరా! ఉత్తమ ఇల్లాలు. కాకపోతే ఈ పాడు సినిమా యావతో నాకు చిరాకు వచ్చేస్తుంది. చిరాకొచ్చిందంటే నన్ను పట్టుకో లేదు. శివతాండవం చేస్తానన్నమాట. కాలే వాడతానో చెయ్యే వాడతానో నాకే తెలీదు. పచ్చడి పచ్చడి కింద చితక బాదేస్తేనేగాని చిరాకు తగ్గదు. ఇవాళ అగ్గి చేశాను.. ఇంటో ఒక్కర్తీ ఏ విషాదపు పాటలు పాడుతుందో ఏమో పిచ్చి మాలతి!

*సత్యా:* గోపాలక్రిష్ణా ఫీలవమాకు! చేకిటీజీ! నీక్యూటీ నువ్వు చేశావు! ఆ మాట కొస్తే ప్రతి ఆదివారంనాడు మా ఆవిడ్ని ఉతికేస్తుంటాను. ఎంచేతో అడుగు.

*గోపా:* ఎంచేత?

*సత్యా:* అట్లా ఉతకడంవల్ల వారంలో మిగతా రోజులు ఏ గొడవా లేకుండా హాయిగా గడుస్తాయి.

*గోపా.* నిజమే అనుకో! మనం కొట్టే దెబ్బలు భరించలేక వాళ్ళేదైనా అఘాయిత్యం చేస్తేనో?

*సత్యా* అంటే?

*గోపా.* అదేరా? బ్రతుకుమీద విరక్తి పుట్టి కిరసనాయిలు పోసుకుని అంటించుకో వచ్చుగదా!

*సత్యా:* అందుకే మా యింటిలో కిరసనాయిలు వుంచను.

*గోపా:* నూతిలో దూకితేనో?

*సత్యా:* నెవ్వర్...మాదొడ్లో నుయ్యిలేదు. అయినా ఒరే గోపాలక్రిష్ణా-చస్తాను చస్తానని బెదిరించే ఆడది ఛస్తే చావదు. అది రూలు. మొగుడు కొట్టినంత మాత్రానికే నూతులూ గోతులూ చూసుకుంటే-ప్రతిరోజూ వేలా లక్షల్లో ఛస్తారు పెళ్ళాలు!

[గోపాలక్రిష్ణ ఏదో మాటాడ బోయాడు. దిగులుగా లోపలికి వస్తున్న సుబ్బారావుని చూసి మాటలాపేశాడు. సుబ్బారావు ఎవర్తోనూ మాటాడకుండా తిన్నగా వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు. సత్యానందానికి దవుటు కలిగింది. అందుకే అడిగాడు సుబ్బారావుని]

*సత్యా:* ఏమిటా పోజు దివాళా తీసినట్టు!

[సుబ్బారావు మొహాన్ని చేతుల్తో కప్పేసుకుని ఘొల్లున ఏడ్చే ప్రయత్నం చేయబోతాడు గోపాలక్రిష్ణ గాభరా పడిపోతున్నాడు]

*గోపా* ఏడవకురా! ఏడవకు! అసలేం జరిగిందో చెప్పు!

*సుబ్బా.* [ఇద్దరివేపూ చూసి దిగులుగా అన్నాడు] మా ఆవిడ నాకు అన్నం పెట్టనంది!

*సత్యా:* అమ్మో! అంత మాటనేసిందా?

*గోపా* ఎంత ధైర్యం! కట్టుకున్న మొగుడుకి అన్నం పెట్టనందా? బెల్టూడదీసి కొట్టాల్సింది!

**సత్యా:** కరెక్టు! అదే సరైన ట్రీట్మెంటు!
**సుబ్బా** కొడదామనే అనుకున్నాను కానీ తిరగబడి కొడుతుందేమోనని భయ పడ్డాను.
**సత్యా** ఓరి చచ్చు పీనుగా! భయపడితే ఇంతంతే నువ్వు బానిసత్వం కల్ల!
**సుబ్బా** హో! ప్రేమించి పెళ్ళిచేసు కున్నందుకు బాగానే బుద్ధి చెప్తోంది. ప్రేమించే రోజుల్లో ఆవిడ నా కంటికి ఒక దేవతలాగా—అనురాగ జ్యోతిలాగా కనిపించేది. పెళ్ళయ్యాక దెయ్యంలాగా మారిపోయింది.
**సత్యా:** సుబ్బారావ్—దీన్నే మాయ అంటారు. ప్రేమ వేరు పెళ్ళి వేరు ప్రేమ ఎక్స్పరమెంటు బిళ్ళలాగా తియ్యగా తిమ్మిరిగా ఉంటుంది. పెళ్ళయ్యాక రుచి మారు తుంది పరమ చేదుగా తగలడుతుంది! ఈ సూత్రం అర్థం చేసుకుని తగిన జాగ్ర త్తలు తీసుకున్నవాడే మగవాడు
**గోపా.** అసలు మీకు తగువెందు కొచ్చిందిరా!
**సుబ్బా** రీజను సింపులే! కాకరకాయ వేపుడు చెయ్యమన్నాను
**సత్యా:** అంటామండీ! మగపుట్టుక పుట్టిం తర్వాత యిష్టం వచ్చిన కూరలు చేయిం చుకు తింటాం!
**సుబ్బా;** కానీ మా ఆవిడ కాకరకాయ వేపుడు వేయనంది నచ్చినాసరే చేయనంది.
**గోపా:** ఎంత అసహ్యమైతే మాత్రం—మొగుడికోసం వండాల్సిందే!
**సత్యా;** ఫరెక్జాంపుల్! మా ఆవిడన్నే తీసుకో! సావిత్రీ చేపల పులుసు పెట్టూ అన్నా ననుకో! ఫినిష్. నిమిషాల్లో తయారు చేస్తుంది.
**సుబ్బా:** మీరు శాకాహారులు గదా—చేపల పులుసంటావేమిటి?
**సత్యా:** అదేమరి! ఎంత శాకాహారులమైనా, నాకు తినాలనిపిస్తే కుక్కని చూసి కూరవండమన్నాననుకో! వండేస్తుంది! అల్లావుండేనే భార్య! వుండకపోతే గెటవుటే!
**సుబ్బా:** అమ్మో! అంతమాట నేను అనగలనా?
**గోపా:** అనాలిరా! మగాడికి ఆ హక్కుంది. నీ దిక్కున్నచోట చెప్పుకో పొమ్మని మెడపెట్టి గెంటేస్తేనేగాని ఆడదానికి బుద్ధిరాదు.
**సుబ్బా:** మా మావ పోలీసు ఇన్స్పెక్టరుగదా! బొక్కలో తోస్తాడేమోరా
**సత్యా:** ఎంత ఇన్స్పెక్టరైతే మాత్రం? అనుకూలంగా వుండాల్సిన మనిషిమగాకాదు చేస్తున్నప్పుడు పొమ్మనడానికి లా అండ్ ఆర్డరు అడ్డంరాదు!
**సుబ్బా:** నన్ను కొంచెం పట్టుకుంటారా?
**గోపా:** ఏ' మా మాటలు విని భయపడ్తున్నావా?
**సుబ్బా:** కాదు! ఆకలికి కళ్ళు తిరుగుతున్నాయ్! ఫోంచేసి రెండు రోజులైంది!
**సత్యా:** అంటే? రెండు రోజుల్నుంచీ నీకు మీ ఆవిడ అన్నం పెట్టడం లేదా?
**సుబ్బా:** లేదు!
**గోపా:** ఈ విధంగా ఎన్ని రోజులు నీ కడుపు మాడుస్తుంది?
**సుబ్బా:** తెలీదు!

సత్యా పోనీ—తను భోంచేస్తోందా,
సుబ్బా సుబ్బరంగా చేస్తోంది! నా కిష్టమైన కాకరకాయ వేపుడు కూడా వేసుకుని నన్ను ఊరిస్తూ తింటోంది.
సత్యా ఛీ ..ఛీ...ఏం బతుకు బతుకుతున్నావురా సుబ్బారావ్? వెధవబతుకు.
గోపా పోనీ హోటల్లో భోంచేయవచ్చు గదరా!
సుబ్బా వచ్చు! కానీ, ఆ సంగతి మా ఆవిడికి తెలుస్తే యింకా ఏమైనా వుందా ఇంటో అడుగు పెట్టనీదు' అరుగుమీదే కాలక్షేపం చేయమని దిండూ దుప్పటీ బయట పారేస్తుంది!
సత్యా ఆ బాపతు శిక్ష యింతకు ముందెప్పుడైన అనుభవించావా?
సుబ్బా నెలలో సగం నేను అరుగు మీదే కాలక్షేపం చేస్తుంటా!
గోపా. చెప్పుకోడానికి సిగ్గులేదురా?
సుబ్బా. చెప్పుకుంటే కొంత బరువు తగ్గుతుంది గదా! సిగ్గనుకుంటే ఎట్లా? సత్యానందం కొంచెం కాఫీ యిప్పించవూ?
సత్యా (బెదిరాడు) కాఫీయా! అట్లాగే! (వంటగది వేపు కదిలి ఆగి) కాఫీయేగదా! (ఆగిపోయి అరిచాడు) సావిత్రీ! మూడు కాఫీ! క్విక్!
సుబ్బా. అదృష్టవంతుడివి! హోటల్లో అరిచినట్టు అరుస్తున్నావ్!
సత్యా: ఎంచేతని అడుగు.
సుబ్బా. ఎంచేత?
సత్యా మాది అనుకూల దాంపత్యం. ఆ మాట వీరు కూడా అన్నారు. (గోపాల క్రిష్ణతో) ఏరా, అన్నావుగదూ!
గోపా ఇప్పుడు మన సంగతి ఎందుకులేరా? ముందు వీడికి కాఫీ ఏర్పాటుచూడు.
సత్యా (మళ్ళీ అరిచాడు) సావిత్రీ-నీకే చెప్తూంట! మూడు కాఫీలు!
గోపా: సమాధానం రాదేమిరా? (సత్యానందాన్ని అడిగాడు)
సత్యా మాటాడొద్దని ఆర్డరేసానుగదా! (అరిచాడు) సావిత్రీ-
సుబ్బా. (భయంగా) తొందర పెట్టకు. నా మూలంగా నువ్వు కష్టాల పాలవడం ఇష్టంలేదు
సత్యా: వెర్రిగా మాటాడకు! ఓ ఆవిడ నాకు ఎదురు చెబుతుందనా నీ ఉద్దేశం? (అరిచాడు) సావిత్రీ-(ఫ్రండ్సుతో) జస్టేమినిట్. కాఫీ ఎంత వరకు వచ్చిందో చూసి వస్తాను.
(అని అతను వంట గదిలోకి వెళ్ళిపోయాడు.)
సుబ్బా: తలదాతని ఇట్టే పెళ్ళాలొస్తారని ఎక్కడో చదివాను సత్యానందం చాలా అదృష్టవంతుడు.
గోపా: నా మట్టుకు నేనూ అదృష్టవంతుడ్నేరా? మా మాలతి కూడా నన్ను చూస్తే వణికి ఛస్తుంది. మొన్నీ మధ్య కోపమొచ్చి కళ్ళెర్ర చేసాను. అంతే జ్వరమొచ్చి

మంచ మెక్కింది పిచ్చి మాలతి!
(వంట గదిలోంచి సత్యానందం అరుపులు వినిపిస్తున్నాయి)
**సత్యా** ఏమిటిది? వాట్ ఈజ్ దిస్? (ఫ్రెండ్సు మొహమొహాలు చూసుకుంటు న్నారు) కాఫీ పెట్టమంటే టీ ఎందుకు చేశావ్? డోంటాక్. పారెయ్. నీకే చెప్తాం..! విసిరి పారేయ్!
(కప్పూ సాసర్లూ పగిలిన శబ్దం కంచం కూడా భళ్ళుమన్నది)
**సత్యా.** చెప్పింది చెప్పినట్టు చెయ్యకపోతే డొక్క చించేస్తానని తెలీరా? ఊ..., నోరెత్తావంటే పీక పిసికేస్తా జాగర్త! ఫ్రెండ్సు (భయపడుతున్నారు) కాఫీ అని గొంతు చించుకుంటే టీ చేస్తావా? టీ? మొన్న 'కూడా అంతే! సెవెంటీ సెంటీగ్రేడులో నీళ్ళు కాయమన్నాను వంద సెంటీగ్రేడుపెట్టి నాదుంప తెంచావ్? అట్లా బేలచూపులు చూడకు నేను భస్మే కరగను ఇప్పుడు నువ్వు చేసిన తప్పుకి శిక్షేమిటో తెలుసా? ఏడవకు...ఏడ్చావంటే ఎగిరి తంతాను జాగ్రత్త ఫుట్‌బాల్‌ని తన్నినట్టు తన్నేస్తా నంతే! ఎప్పుడు నువ్వెం చెయ్యక్కర్లేదు ఈ ఇంటో నేనుగానీ మా ఫ్రెండ్సుగానీ కాఫీ తాగనే తాగం! ఎంచక్కా హోటల్లో తాగుతాం' తప్పుకో నాకాళ్ళు విడిచిపెట్టు ఊ ..నీకే చెప్తూంట!ఊ...
(అని ఊపులో బయట కొచ్చేసాడు ఉగ్రమూర్తిలా ఉన్న సత్యానందాన్ని చూసి మిత్రులు బిక్కమొగం పెట్టేశారు).
**సుబ్బా** సారీరా! అనవసరంగా ఇబ్బంది పెట్టేశాను
**సత్యా** ఇట్సాల్‌రైట్...దాన్ని గురించి నువ్వు వర్రీ కావద్దు ఆ కాఫీ ఏదో హోటల్లోనే తాగుదాం పదండి
(ముగ్గురూ వెళ్ళిపోతూండగా మందుల మంగపతి భుజాన సంచితో వచ్చాడు ముగ్గురూ ఆగిపోయారు)
**సత్యా** ఎవరండీ మీరు? ఎవరు కావాలి?
**మంగ** నా పేరు మంగపతి! మందుల మంగపతి!
**గోపా:** మేమడిగింది మీపేరు కాదు ఇక్కడ మీకెవరు కావాలని?
**మంగ:** ఆ మాటకొస్తే మీరంతా కావలసిన వాళ్ళేనయ్యా!
**సత్యా** మాతో మీకేంపని?
**మంగ.** చెప్తా! (అని అందరి మధ్యకూ వచ్చి ఒక సీసా తీసాడు) ఈ మందుపేరు మహిళా మటాష్ లోషన్!
**సత్యా** మహిళా...
**మంగ** మటాష్ లోషన్!
**గోపా** ఇక్కడ మహిళలు ఎవరూ లేరు!
**మంగ:** తెలుసునయ్యా! ఇది మహిళా మటాష్ లోషన్ అయినా-దీన్ని వాడవల సింది మగవాడే!

సత్యా: వాడితే ఏమవుతుంది!

మంగ. ఏమవుతుందో అనకాపల్లి అప్పారావు దొరగారిని అడుగు. బందరు బసవ రాజు గారి నడుగు

సుబ్బా. అబ్బా! వాళ్ళని అడిగే ఓపిక మాకు లేదండి! మీరే చెప్పండి.

మంగ చెప్తాను చెప్పేముందు మీకు ఆడదాని గురించి తప్పకుండా చెప్పాలి. ఆడది ఆటంబాంబు లాంటిది! నీకు భార్యగా వస్తుంది. నీ గుండెల్లో ధామ్మని పేలు తుంది.

సుబ్బా నాకు అట్లాగే పేలుతోంది!

మంగ. క్షణంలో నవ్వుతుంది. ఉత్తర క్షణంలో ఏడుస్తుంది. ఈ విధంగా ఏడ్చి నవ్వి నీతో చెడుగుడు ఆడుతుంది. అసలు-భార్యంటే ఏమిటో

సుబ్బా. ఆటంబాంబు?

మంగ: ఆ అవతారం ఎందుకు ఎత్తింది.

సత్యా: బుద్ధిలేక.

మంగ తప్పు నాయనా! సృష్టి రహస్యం తెలీక అజ్ఞానంగా మాట్లాడుతున్నావు. కిందటి జన్మలో ఆవిడ నీకు బద్ధ విరోధి ఆ జన్మలో నిన్నేం చేయలేక-ఈ జన్మలో నీకు భార్యగా పుట్టి నీచేత నీళ్ళు తాగిస్తుందన్న మాట!

సుబ్బా ఇదా సృష్టి రహస్యం?

మంగ అవున్నాయనా! అసలు తంతు పెళ్ళికివేసే శుభలేఖల్నుంచే తగులుకుం టుంది. శుభలేఖ అంటే అర్థం ఏమిటి?

గోపా. వెడ్డింగు కార్డు!

మంగ నా బొందకార్డు! శుభలేఖ అంటే అరెస్టు వారెంటని అర్థం! పెళ్ళి పేరిట నిన్ను అరెస్టుచేసి సంసారమనే జైల్లో నిన్ను శాశ్వతంగా బంధిస్తుందన్నమాట- పెళ్ళిరోజున ఆమె మెళ్లో మూడుముళ్ళు వేసేది నువ్వే అయినా ఆ తర్వాత రోజుకో ముడి నీకే వేస్తుంది నీ దుంప తెంచుతుంది. అమాయకపుప్పురుగు నాయనా మగాడు! అతన్ని కుక్కపిల్లనిచేసి కొంగున కట్టుకు తిరిగేది ఆడది! అట్లాంటి మనిషికి బుద్ధి చెప్పడం ఎట్లా?

సత్యా బడితపూజ చెస్తేసరి!

మంగ ఆ ధైర్యం మీకుందా?

గోపా. మాకుందిగానీ (సుబ్బారావుని చూపెడుతూ) వీడికి లేదు!

సుబ్బా, అవును స్వామీ నా బతుకు బాగుపడేదెట్లా?

మంగ మహిళా మహేష్ లోషన్! నీ కోసమే కనిపెట్టాను నాయనా! కొంచెం నాలుక మీద రాసుకో

సుబ్బా రాసుకుంటే-

మంగ ఆటోమేటిగ్గా వీర మొనగాడివై పోతావు. ధైర్యం తన్ను కొస్తుంది. పులై

పోతావు. కట్టుకున్నదాన్ని గడగడలాడిస్తావ్.
గోపా (సుబ్బారావుతో) ఇదేదో బాగానే పుచ్చుకుంటుందిరా! ట్రయి చేస్తావేమిటో
సుబ్బా: ఆ మందేమిటంట్నారు?
మంగ మహిళా మిటాష్ లోపస్...
సుబ్బా రేటెంత?
మంగ రేటులేదు ఉచితం మగజాతిని ఉద్ధరించే ప్రయత్నంలో ఉన్నాను దీనికి రేటుండదు.
సుబ్బా: కొంచెం నా నాలుకమీద రాసుకోవచ్చా స్వామీ?
మంగ: రాసుకో నాయనా!
[అని సీసా యిచ్చాడు. కొంచెం నాలుక మీద రాసుకున్నాడు మంగపతి విజిల్ వేశాడు. సుబ్బారావు మారిపోతున్నాడు ఒక గుండీతీసి ఒచి నిలబడి ఛాతీని పొంగించి ఆకాశంవేపు చూస్తూ అరిచాడు].
సుబ్బా: శకుంతలా!
మంగ: శకుంతలెవరు నాయనా?
సత్యా: వాడి వైఫు!
మంగ: శుభం! పనిచేస్తుంది-మహిళా మటాష్ లోపస్!
సుబ్బా: (కోపంగా) శకుంతలా! రెండు రోజుల్నుంచి అన్నం పెట్టకుండా ఉపోష్ట పెడుతున్నావు గదూ-చూడు నిన్నేం చేస్తానో? కూడెందుకు తింటాను శకుంతలా! నిన్నే సుబ్బరంగా భోంచేస్తాను.
[అని వేగంగా వెళ్ళిపోతున్నాడు. మిగిలిన ఇద్దరితో చెప్తున్నాడు మంగపతి]
మంగ: ఆ మందు పసరు ఇకవైనాలుగ్గంటలు-ట్టుంది ఘోరపద్ధు పనిచేస్తుంది ఇతగాడు ఇంటికివెళ్ళి చేయబోయే కార్యక్రమం ఏమిటో చెప్పనా?
సత్యా: వేరే చెప్పనక్కర్లేదు. అర్థమవుతోంది.
మంగ: నీక్కూడా యివ్వమంటావా?
సత్యా: ఛీ...ఛీ... మందులు పుచ్చుకునే ఖర్మ నాకేంలేదు. వీడికేమైనా కావాలేమో అడగండి.
గోపా: ఛ...ఛ...ఏ మందూ లేకుండానే మా మాలతిని ఏలికేస్తున్నాను. ఇకమందు కూడా పడితే అది చచ్చిపోతుంది.
మంగ: మంచిది నాయనా వెళ్ళొస్తా!
[అని కదిలేడు.]
సత్యా: వెళ్ళొండంతే! మళ్ళా రావద్దు!
(మంగపతి వెళ్ళిపోయాడు. గోపాలక్రిష్ణ అన్నాడు)
గోపా: ఒకవేళ వీడు మా వీధికిగాని వెళతాడేమో.
సత్యా: వెళ్ళనివ్వు!

**గోపా:** అమ్మో! ఆ పీపేలో మగాళ్ళంతా నాలాగే సింహాల్లా వుంటారు. వాళ్ళతో పూహాచితే ఇతని గాలి తీసేస్తారు. అటు వెళ్ళద్దని చెప్తారా? వుంటా.
(అని గోపాలకృష్ణ కూడా వెళ్ళిపోతాడు)
**నత్యా:** మహిళా మహాష్ రోషన్! [తండ్రి ఫొటో దగ్గరికి వెళ్ళాడు] చూసేవా నాన్నా! అవసరమైన మందుకూడా కొనుక్కోలేని పరిస్థితిలో పడిపోయి-బంగారం లాంటి ఛాన్సు పోగొట్టుకున్నాను. ఫ్రెండ్సు ముందు అడిగితే అలుసైపోతానని అడగ లేను. ఆఫ్టరల్ సుబ్బిగాడు సిగ్గువిడిచి అడిగాడు. ఛందశాసనం ముండాకొడుకై పోయాడు. ఆపాటి అదృష్టం కూడా నాకు లేదా నాన్నా?
[అని కళ్ళు తుడుచుకుని తలుపు వేసేందుకు వెళ్ళబోతుంటే సావిత్రి వచ్చేసింది]
**నత్యా:** అప్పుడే వచ్చేసావ్? సినిమా అయిపోయిందా!
**సావి:** [నిష్టూరంగా] లేదు. ఏడుస్తూ పంపించారుగా! టిక్కెట్లు అందలేదు.
**నత్యా:** అయ్యొయ్యో!
**సావి:** మీరేం విచారించక్కర్లేదు లెండి. పస్టుషోకి రిజర్వు చేసుకుని వచ్చాం!
**నత్యా:** వచ్చాం అంటున్నావు. నీకో తోడు కూడా వున్నారా ఏమిటి?
**సావి:** వుంటే తప్పా?
**నత్యా:** అనికాదు! ఈ విధంగా పంతంపట్టి సినిమాలకెళ్ళే ఉత్తమ ప్రేక్షకురాలు ఎవరా అని?
**సావి:** మాలతి!
**నత్యా:** [ఆ పేరు వినగానే షాకయ్యాడు] మాలతా? మాలతి అంటే మా గోపాల క్రిష్ణ వైపు కదూ?
**సావి:** మీ గోపాలక్రిష్ణగారి సతీమణే! అయితే ఏమైందిట?
**నత్యా:** ఒక జీవితసత్యం తెలిసింది. ఒక గోపాలక్రిష్ణ అర్థమయ్యాడు. ఇంతకీ మీరు చూడబోయే సినిమా ఏమిటో?
**సావి:** పతిభక్తి!
**నత్యా:** పతిభక్తా? ఆహా...అందమైన పేరు! అవునూ-ఆ పతిభక్తిని మొన్నేగా చూశావు?
**సావి:** చూసిన సినిమా మళ్ళీ మళ్ళీ చూస్తే తప్పా?
**నత్యా:** కాదనుకో! ఆ సినిమాలో పతిభక్తి గురించి మంచి పాయింట్లేమైనా వున్నాయా?
**సావి:** అట్లా ఎందుకనుకోవాలి?
**నత్యా:** చూసిన సినిమానే చూస్తున్నారంటే
**సావి:** అదేంకాదు మాలతికి లెక్కలురావు ఎప్పుడూ తప్పే చెప్తుంది!
**నత్యా:** సినిమాకీ లెక్కలకీ సంబంధ మేమిటి?
**సావి:** పతిభక్తిలో హీరోయిన్ పదహారుసార్లు చీరలు మార్చింది నేనే కరెక్టు?

లెక్క పెట్టాను పద్దెనిమిదిసార్లు మార్చిందని మాలతి పందెం కాసింది!
సత్యా: సినిమాలో కూడా చీరెల లెక్కేమిటి?
సావి: లెక్క లెక్కేమరి! సరైన చీరెల లెక్క తేలేంతవరకు ఎన్నిసార్లయినా చూస్తాం-పతిభక్తి!
[అని వంట గదిలోకి వెళ్ళింది]
సత్యా: భగవాన్-తెలుగు సినిమాలు వందేసి రోజులు ఎందుకు ఆడుతున్నాయో ఇప్పుడు బాగా అర్థమైంది స్వామీ!
సావి. [లోపల్నించి అరిచింది] ఏవండీ ..
సత్యా. ఓయ్!
[పగిలిన కప్పు సాసర్లతో వచ్చింది సావిత్రి]
సావి: బంగారం లాంటి వస్తువుల్ని పగలకొట్టింది మీరేనా?
సత్యా. [భయంగా] నేనా? నో నో. నేను కాదు!
సావి వాల్లెండి అబద్ధాలు! మిమ్మల్ని సినిమాకి తీసుకెళ్ళలేదని, వళ్ళుమంటకొద్దీ పగలగొట్టారు అవునా?
సత్యా [నీళ్ళు కారిపోతూ] తమరిదయ! నాకు వళ్ళు మండటం ఎప్పుడైనా వుందా? మండినా నీ కిష్టమైన వస్తువులు పగులగొట్ట గలనా?
సావి. మరి ఎట్లా పగిలేయి?
సత్యా కొంచెం కునుకు పట్టింది సావిత్రీ! అప్పుడు పిల్లిలో ఎలుకలో ..
సావి [ఖంగారుగా] అంటే? అంటే వంటపని మానేసి నిద్రపోయారా?
సత్యా. ఏమిటో పాడునిద్ర ముంచుకొచ్చేసింది సావిత్రీ!
సావి [కోపంగా] ముంచుకొస్తుందండీ! ముంచుకొస్తుంది! మీకు నిద్ర రాకుండా ఏంచేయాలో నాకు బాగా తెలుసు
సత్యా ఆ చిట్కా ఏంటో నాకూ చెప్పు సావిత్రీ సుఖపడిపోతాను. నావంట నేనే చేసుకుని, నాతిండి నేనే తింటాను!
సత్యా: [గాభరాగా] మరి నా వంటా? నా తిండీ?
సావి: పస్తే! పంచక్కా నిద్రపోతూ పస్తు పడుకోండి.
[అని గదిలోకి వెళ్ళిపోయింది కొంతదూరం ఆమెను వెంబడిస్తూ ప్రాధేయపడ్డాడు]
సత్యా సావిత్రీ! ఇది నీకు న్యాయంకాదు సావిత్రీ! [ఆమె వెళ్ళిపోయింది అతను గుమ్మం బయటేనిలబడి తలుచుకున్నాడు] ఎక్కడున్నావయ్యా-మందుల మంగపతి.
మంగ [లోపలికి వచ్చి] పిలిచేవా నాయనా!
సత్యా. [ఆశ్చర్యంగా] అమ్మో! పిలవలేదు స్వామీ! తలుచుకున్నాను! మీరు వచ్చేశారు!
మంగ అంతే నాయనా! తలుచుకున్నా, పిలుచుకున్నా వెలుస్తాను.
సత్యా. మా ఫ్రెండు మీకేం చెప్పలేదా?

**మంగ:** ఏమీ చెప్పలేదు గానీ-మూడు సీసాలు పుచ్చుకున్నాడు మహిళా మటాష్ లోషన్!

**సత్యా:** అలాగా! బాబ్బాబు నాకు అర్జంటుగా అరడజను సీసాలు యిప్పించండి. చాలా అవసరం!

**మంగ:** [సంచిలో చెయ్యి పెట్టి] తథాస్తు.

తెరవాలుతుండగా క్రింద ప్రకటన వినిపిస్తుంది-మహిళా మటాష్ లోషన్ కావలసిన వారు సంస్థ కార్యదర్శినిగాని, కార్యకర్తలనిగాని కల్సుకోవాలి.



## కల నిజమాయెలే!!

**కలలనగానే యువతీయువకులలో పులకరింతలు మొదలవుతాయి. చాలా మందికి వాస్తవజీవితం కంటే కలలజీవితమే, అందంగా అనిపిస్తుంది. అద్భుతంగా అగుపిస్తుంది, అపూర్వంగా అపురూపంగా మిగులుతుంది.**

**కలలు ప్రతి మనిషికి వస్తాయి కలలురాని మనిషంటూ లోకంలో ఎవరూ ఉండరు**

**అందుకే జ్యోతి త్వరలో మీ కోసం**

**ఓ అద్భుతమైన కానుక**

**'నవలానుబంధం' రూపంలో కలలపై**

**సమగ్రమైన విశ్లేషణ అందిస్తోంది**

**ఎదురుచూడండి**



# ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం

## హైదరాబాద్

## బి ఏ, బి.కామ్., కోర్సులలో ప్రవేశానికి అర్హతపరీక్ష

**అర్హతలు** అభ్యర్థులు ఎటువంటి విద్యార్హతలులేకపోయినా బి ఏ, బికామ్., కోర్సులలో (1986లో) ప్రవేశానికి అర్హులు ఈ కోర్సులలో ప్రవేశం పొందగోరేవారి వయస్సు 1986, జూన్ 1వ తేదీ నాటికి 20 ఏళ్ళు పూర్తి అయి ఉండాలి ఈ విశ్వవిద్యాలయం నిర్వహించే అర్హత పరీక్షలలో ఉత్తీర్ణత పొందాలి

**అర్హత పరీక్ష జరిగేతేదీ, సమయం, స్థలం — 1986 మే 18వ తేదీన** ఉదయం 10 గంటల నుంచి మధ్యాహ్నం 1 గంటవరకు ఇంగ్లీషు, తెలుగు మీడియంలలో అర్హత పరీక్ష నిర్వహించబడుతుంది ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని జిల్లాలలోను, జంటనగరాలలోనూ, అవసరమైతే రాష్ట్రం వెలుపలకూడా ఈ పరీక్ష నిర్వహించబడుతుంది

**దరఖాస్తుఫారం పొందడం ఎలా?** రిజిస్ట్రార్, ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం పేర 5 రూపాయల ఇండియన్ పోస్టల్ ఆర్డరుగాని, డిమాండ్ డ్రాఫ్టుగాని హైదరాబాద్‌లో చెల్లుబాటు అగునట్లు తీసుకొని పరీక్షల కంట్రోలర్ కార్యాలయం, ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం 8–3–952/10/2/1, శ్రీనగర్‌కాలనీ రోడ్, పంజగుట్ట, హైదరాబాద్–500016 చిరునామాకు స్వయంగా వెళ్లి దరఖాస్తు ఫారం, ప్రాస్పెక్టస్ పొందవచ్చు లేదా అయిదు రూపాయల ఇండియన్ పోస్టల్ ఆర్డర్‌గాని, డిమాండ్ డ్రాఫ్టుగాని తీసుకొని అన్ని జిల్లాలలోను, జంటనగరాలలోను ఉన్న అధ్యయన కేంద్రాల కో ఆర్డినేటర్స్ కార్యాలయాలలో ఏ ఒక్కదానికైనా వెళ్లి స్వయంగా పొందవచ్చును

కావాలనుకుంటే అభ్యర్థులు పోస్ట్‌ద్వారా కూడా దరఖాస్తు ఫారం, ప్రాస్పెక్టస్ పొందవచ్చు రిజిస్ట్రార్, ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం పేర పదిరూపాయల ఇండియన్ పోస్టల్ ఆర్డర్‌గాని, డిమాండ్ డ్రాఫ్టుగాని హైదరాబాద్‌లో చెల్లుబాటు అగునట్లు తీసుకొని పైన పేర్కొన్న పరీక్షల కంట్రోలర్ కార్యాలయం చిరునామాకు పోస్ట్‌ద్వారా తెప్పించుకో వచ్చు.

| దరఖాస్తుఫారాల విక్రయం | పూర్తిచేసిన దరఖాస్తుఫారాలు |
|---|---|
| చివరి తేదీ. 17–03–1986 | స్వీకరించే చివరి తేదీ. 24–03–1986 |

పూర్తిచేసిన దరఖాస్తుఫారాలు పరీక్షల కంట్రోలర్ కార్యాలయం' 8–3–952/10/2/1, శ్రీనగర్ కాలనీరోడ్డు, పంజగుట్ట, హైదరాబాద్–16 చిరునామాకు స్వయంగాగాని, పోస్టుద్వారాగాని 1986 మార్చి 24వ తేదీలోగాని, అలోగాని అందేట్లుగా పంపాలి.

బి ఏ., బి.కామ్., బి.యస్‌సి., కోర్సులలో నేరుగా ప్రవేశం— ఇంటర్‌మీడియట్ లేదా దానికి సమానమైన విద్యార్హతలు కలిగిన అభ్యర్థులను డిగ్రీ కోర్సులలో నేరుగా చేర్చుకునేందుకు త్రైటున ప్రత్యేకంగా జారీ అవుతుంది. వారు అర్హత పరీక్షకు హాజరు కావాల్సిన అవసరం లేదు.

**బోధనా విధానం**— బి.ఏ., బి.కామ్., బి యస్‌సి., కోర్సులలో చేరే విద్యార్థులు బోధనా భాష, తెలుగు, ఇంగ్లీషులలో ఏదో ఒకటి ఎన్నుకోవాల్సి ఉంటుంది. పోస్టల్ కరస్పాండెన్స్, కాంటాక్ట్ ట్యుటోరియల్ ప్రోగ్రాములు, ఆడియో, విజువల్ ప్రోగ్రాములు (రేడియో, ఆడియో కేసెట్లు వీడియో టేపులు) మొదలైన సాధనాలద్వారా విద్యాబోధన నిర్వహించబడుతుంది ఈ బోధన ఆంధ్రప్రదేశ్‌లోని ప్రతి జిల్లాలోను, హైదరాబాద్, సికింద్రాబాద్‌లోను నెలకొన్న విశ్వవిద్యాలయ అధ్యయన కేంద్రాలలో నిర్వహించబడతాయి

సం/—రిజిస్ట్రార్

# మా ఇల్లు అద్దెకిస్తాం

## — రావికొండలరావు



**పాత్రలు :**

కామేశ్వరరావు : (55-60 సం॥ల వయస్సు)
శేషయ్య : (50-55 సం॥ల వయస్సు)
సీతమ్మ : (45-50 సం॥ల వయస్సు)
సత్యనారాయణ (30-35 సం॥ల వయస్సు)

(ఈ నాటికను ముందుగా ఎవరు ప్రదర్శించాలనుకున్నా - ముందుగా రచయిత లిఖిత పూర్వకమైన అనుమతి తీసుకోవాల)

# మాఇష్టం అద్దెకిస్తాం

## — రావికొండలరావు

[మధ్యతరగతి కుటుంబీకుల ఇల్లు. ఇది వారి ముందు గది. ఎదురుగా గోడకు పూర్వీకుల ఫోటోలు, దేవుళ్ళ ఫోటోలు కనిపిస్తూ వుంటాయి. గదిలో రెండు మూడు కుర్చీలు, ఓ మూల పాత టేబిలూ వుంటాయి. టేబులుమీద పుస్తకాలు, పత్రికలూ వుంటాయి. అక్కడే ఒక ట్రాన్సిస్టర్ రేడియోలో భక్తి రంజని పాటలు వినిపిస్తూ వుంటాయి. తెరలేవకముందునుంచే పాటలు వినిపిస్తూ వుంటాయి. తెరలేచిన తర్వాత, అక్కడ ఎవరూ వుండరు. పాటమాత్రం వినిపిస్తోంది. ప్రేక్షకులకు ఎడమచేతివేపు వీధిలోకి దారి; కుడివేపు ఇంట్లోకి దారి. కొన్ని క్షణాలపాటు పాట వినిపించాక, వీధివైపునుంచి శేషయ్య ఆత్రుతగా వస్తాడు]

**శేషయ్య:** (ఆత్రుతగా అటూఇటూ చూస్తూ) కాముడూ...కాముడూ!...కామేశ్వరరావు! హు! ఈ రేడియో ఒకటి తారస్థాయిలో తోచనివ్వకుండా! (అని వెళ్ళి రేడియో ఆపుజేస్తాడు) కాముడూ...అరె! ఏమైపోయారు చెప్మా...ఒక్కరూ పలకరు. రేడియో శబ్దం ఆగిపోయినాకూడా గమనించరేంఖర్మ!...ఒరే కామేశ్వర్రావ్... సీతమ్మా....సీతమ్మా...ఏదో అయిపోయినట్టున్నారు వీళ్ళు! దొంగవెధవ వస్తే కూడా ఇంతేగద! ఇంత అజాగ్రత్త ఏమిటి చెప్మా ఈ దంపతులకి!...ఓపంపతుయా లాభంలేదు. లోపలికివెళ్ళి చూడాలి. (ఒక రెండడుగులువేసి ఆగి) లోపలికి వెళ్తే ఏం అఘాయిత్యం చూడవలసి వస్తుందో! అసలే రోజులు బాగలేవు-ఇక్కడినుంచి పిలవడమే శ్రేయస్కరం!...కాముడూ!...లాభంలేదు. దొంగవచ్చి ఎత్తుకుపోయినట్టు ఏదైనా ఎత్తుకుపోతే, అప్పుడు ఏసుకారేమో వాళ్ళకీ పరమేశ్వరుడు! చూడాలి. (మెల్లిగావెళ్ళి ట్రాన్సిస్టర్ రేడియో తెచ్చి కుర్చీమీదపెట్టి. రెండూ పట్టుకుని వెళ్ళిపోతూండగా లోపల్నుంచి కామేశ్వరరావు వస్తాడు)

**కామేశ్వరరావు:** ఆఁఆఁ...అదేమిటోయి శేషయ్యా...ఈ వ్యాపారం ఎప్పట్నుంచి ఆరంభించావు? పైగా పట్టపగలా...అన్యాయం! దారుణం!

**శేషయ్య:** కాకపోతే ఏమిటయ్యా...ఎంతసేపట్నుంచి పిల్చినా పలకరు; ఊడి పడరు! ఏమైపోయారిద్దరూ?...తలుపులు తీసేసి లోపల కూసుంటారేమయ్యా, గుడ్లో దేవతల్లాగా!

**కామేశ్వరరావు:** నేను స్నానానికని సిద్ధమవుతున్నాను పెరట్లో. ఇంతలో కాకి అరిచింది. పొద్దున్నే చుట్టం ఎవడేనా దిగులాడు కాబోల్రా భగవంతుడా; ఏది దారి- అని ఆలోచిస్తున్నాను. అంతలో నీ పిలుపు నా చెవిని పడింది. దిగాడ్రా చుట్టం అని కుని, భయంభయంగా నిదానంగా వచ్చాను. నీ దొంగతనం చూశాను!

**శేషయ్య:** లేకపోతే ఏమిట్రా కాముడూ! ఇలా కుర్చీ అవీ ఎత్తుకుపోతే ఏం చెయ్యగలవు? ఓసారి. నీకు ఇలా జరిగితేగాని, బుద్ధిరాదని ఎత్తుకుపోతున్నాను.

**కామేశ్వరరావు:** నాకు బుద్ధొచ్చేలా చేశావుగాని, కూచో. ఇంట్లో వున్నది ఇద్దరమే అయినా, అది చేస్తుందని నేనూ: నేను చేస్తానని అదీ-ఏదీ చెయ్యం. "నేను స్నానానికి వెళ్తున్నాను-తలుపు వేసుకో" అన్నాను. అవిడగారు అప్పుడు ఇక్కడే వుంది- ఈ రేడియోలో పాట వస్తుంటే తాళం కొడుతూ. అంతే, ఆ తాళంలోపడి వీధితాళం గురించి మరిచిపోయి వుంటుంది. ఎన్నింటికని చావను శేషయ్యా-అది అమాయకు రాలూకాదు; అర్భకురాలూకాదు! ఏమిటో ఆ మనిషి తత్వం అంత.

**శేషయ్య:** సరే, నీకు స్నానానికి టైముందా-నాతో కాస్సేపు కాలక్షేపం చేస్తావా?

**కామే:** సుప్రభాత సమయంలో వచ్చి కాలక్షేపం అంటావేమిటి శేషయ్యా-అర్జెంటు కాలక్షేపం అయితే చెప్పు. ఆర్డినరీ అయితే తర్వాత చూసుకుందాం. నేనింకా స్నానం, ధ్యానం...

**శేష:** అర్జెంటేనయ్యా-కాకపోతే ఇంత పొద్దున్నే దిగుతానూ చుట్టం దిగినట్టు!

**కామే:** అప్పుకోసం వచ్చివుంటావు. ఎంత! పదా-పాతికా? నూరు, రెండొందలు మాత్రం అడక్కు.

**శేష:** అప్పుకోసం రాలేదుబాబూ-చెప్తా-కూచో. నీకు తెలియాలి ఈ విషయం. (కామేశ్వర్రావు కూచున్నాడు) కాఫీ అయిందా అదీలేదా?

**కామే:** ఐంది! నీది?

**శేష:** లేదే-అదేగా, అది పుచ్చుకుంటేనేగా మంట పెగుల్తుంది.

**కామే:** ఓరి నీయింటిచుట్టూ నెమళ్లు తిరగా! కాఫీకోసం వచ్చావుటయ్యా. హోటలు కొచ్చినట్టు! ఇంతదూరం రాకపోతే, మీయింటి దగ్గరున్న హోటల్లో ఓ ముక్క సేవించకపోయావు-రూపాయో అర్ధో పోతే పోయింది!

**శేష:** కాఫీకోసం రాలేదురా కాముడూ! ముక్క వివిపించుకోవుగదా. విషయం చెప్పేముందు ఓ గుక్కెడు వేడికాఫీ గొంతులో పోసుకుందామని కక్కుర్తి పడ్డాను. ఉంటే ఇవ్వు. లేకపోతే, వెళ్ళి కాఫీ తాగొచ్చి చెబుతాను.

**కామే:** ఓరి నీ భార్య దీర్ఘ సుమంగళికానూ-ఇస్తానేవయ్యా కాఫీ, అయితే ఒకటుంది

**శేష:** డికాషన్ లేదంటావు-పాలుమాత్రంది ఇవ్వనేసుమా-జబ్బు మనుష

కామే: మనం ఓమాటు వెళ్లి వాళ్ళని పాపం పలకరించి రావాలే!
నీత: అలాగే వెళ్దాం. అయినా ఇవాళా రేపూ వద్దులేండి. మంచిరోజులుకావు. తాదే పామై కరుస్తుందని, ఒకదానికొకటి! ఆ టైములో మనయింటోనా దొంగ పడొచ్చు; లేదా వారింటి దొంగతనం గొడవ మనమీదికేనా రావచ్చు.
కామే: ఓసి నీ కొంపనిండా ముత్యాలుపండా! ఎలాంటి మాటలంటున్నావే! మనకీ వాళ్ళ దొంగతనానికి ఏమిటే సంబంధం? శేషయ్యా నువ్వుచెప్పు-ఏమిటి సంబంధం?
నీత: సంబంధంలేదు. లేకపోయినా రోజు బాగులేకపోతే మీద పడుతుందనే చెప్పడం!
కామే: సర్లే-మంచి ముహూర్తం పెట్టించుకుని, వర్జ్యం, యమగండం అవీ లేకుండా చూసుకొని పట్టు పీతాంబరాలు కట్టుకొని, బ్యాండు మేళంతో వెళదాం-సరేనా?
నీత: అది! ప్రతిదానికి వేళాకోళం, వెక్కిరింతా! విన్నారా శేషయ్యగారూ, కీడెంచి మేలెంచమన్నారుకదా పెద్దలు...ఆ మాట చెప్పడం తప్పా?
శేష. తప్పేమీలేదమ్మా-రైటే. వెళ్లి పరామర్శించకపోతే కొంప మునిగిపోతుందా జైల్లో పెడతారా-అహఁ, నా పాయింటు అసలు అదికాదు-అంతమంది వుంటున్న ఆ యింట్లోనే అలా జరిగిందే, లింగులింగుమని ఇద్దరే వుంటున్నారుగదా ఇక్కడ, కాస్త జాగ్రత్తగా వుండమని హెచ్చరించిపోదామని వచ్చాను. అంతే!
కామే: నిజమేనయ్యోయ్! జాగ్రత్తగానే వుండాలిమరి.
శేష: ఏంజాగ్రత్త...నేకొచ్చేసరికి వీధితలుపులు రెంటూ తెరచిపెట్టి ఒదిలేశారు; రేడియో, పుస్తకాలూ అన్నీ ఎదురుగా వున్నాయి. ఎవడొచ్చినా దిక్కులేదు!
నీత: ఆఁ, పట్టపగలు ఎలా ఎత్తుకుపోతార్లెండి-అంత చేతకాని వాళ్ళెవరుంటారు
శేష: అదేమిటమ్మా- దొంగకి పట్టపగలు, పట్టరాత్రి అని వుంటుందా ఏమిటి వాళ్ళు అలా డ్యూటీలు వేసుకుని నిత్యం తిరుగుతూనే వుంటారు. అనువు దొరికితే, చేజిక్కించుకుంటారు!
నీత: ఇంట్లో మనుషులుండగానే?-
శేష: మనుషులుంటే మరీ మంచిదమ్మా-చక్కగా మర్డర్లుకూడా చేసేసి, చక్కా వెళతారు.
నీత: ఆఁ...అమ్మ దొంగవెధవలు! ఇళ్ళల్లో మనుషులు వున్నాకూడా నగలూ సామాన్లూ ఎత్తుకుపోతారన్నమాట!
కామే: సామాన్లన్నమా టేమిటీ-నిన్నుకూడా ఎత్తుకుపోతారు! మర్డరు చెయ్యడానికి వీలు కుదరకపోతే!
నీత: నన్నెందుకు ఎత్తుకుపోతారూ-మూతిపళ్ళ రాంగొట్టేస్తాను. అహఁ...అంత తేలిగ్గా వున్నానేమిటినేను?
కామే, నువ్వు బరువుగా వున్నావనిపిస్తే నలుగురూ సాయంపట్టి ఎత్తుకుపోతారు!

స ినా?

సీత ఏమండోయ్‌, నా జోలికి వచ్చారంటే మాత్రం ఊరుకునేదిలేదు! కావాలంటే నా నగలన్నీ ఒల్చి ఇచ్చేస్తానుగాని, ఆ వెధవలకి మాత్రం అంపను!

శే. అలాగేలేమ్మా మన జాగ్రత్తల్లో మనం వుంటే ఏదొంగా రాడు, ఏమీ జరగదు!

కామే వాళ్ళ జాగ్రత్తల్లో వాళ్ళు వుంటారు ఏంచేస్తాం-కర్మ సిద్ధాంతాన్ని నమ్ముకుని ముక్కు మూసుకుని కూచోడమే

సీత ఏమైనా నాకుమాత్రం భయంగానే వుంటున్నుంది పట్టపగలే వచ్చి దోచేసుకుంటూవుంటే ఎవరంమాత్రం ఏంచెయ్యగలం? పైగా, శేషయ్యగారూ-ఈయన పొద్దున్నే బయల్దేరతారా-వాకింగులకని, నేనొక్కదాన్నీ యింట్లో విస్కూవిస్కూమని కూచుంటాను మా పిల్లవెధవలని ఆ ఉద్యోగాలేవో, ఈ ఊళ్లోనే మానుకోండర్రా అంటే, తలో వూరూ పారిపోయారు అవునూ-సాయంకాలం వేళల్లోకూడా తిరుగుతూ వుంటారేమీరు-అదెక్కడికి?

కామే మీటింగులకి-లేకపోతే అలా గుడికి, లేదా కాలక్షేపానికి.

సీత చూశారా-ప్రతి సాయంకాలం ఇదో తిరుగుడు. తిరిగొచ్చేసరికి, ఎనిమిదో తొమ్మిదో అవుతుంది అంత రాత్రివరకూ జైల్లో పడివున్న దొంగలాగ, అలా కూచుంటాను ఒద్దువెండి- ఈ వాకింగులూవద్దు, మీటింగులూవద్దు-శుభ్రంగా ఇంట్లోనే తిరగండి రంగుల రాట్నంలా (ఈ లోపల శేషయ్య అక్కడున్న వార్తా పత్రిక చూస్తున్నాడు )

కామే చూడవయ్యా శేషయ్యా-ఎలా మాట్లాడుతోందో-వాకింగు అన్నదేదో నేను జల్సాకోసం తిరుగుతున్నానేమిటి-డాక్టర్లు చెప్పారుగదాఅని, వాళ్ళకోసం వెళ్తున్నాను. నా డయబటీసుకీ గుండెజబ్బుకీ మంచిదన్నారుగదా.

సీత. ఏమిటీ-మీకు గుండెజబ్బుకూడావుందా- ఆరోగ్యం సంగతి నాతో ఎప్పుడూ చెప్పారుకాదు.

కామే జబ్బేంలేదే! అలాంటి జబ్బు రాకుండా ముందుజాగ్రత్త పడటం అన్నమాట నీకు దొంగ భయం వుందని నేను వాకింగు మానేశానుకో-డయాబెటీసూ తగ్గదు, గుండెజబ్బూ రాక తప్పదు-నాకేం!

సీత. కొంపముంచేశారండి! ఇదేం చాదస్తమండీ-ఒంటికేదేనావస్తే మందోమాకో ఇవ్వకుండా, ఈ వాకింగులకి తిరగమని చెప్పడం ఏమిటండీ-అదే ప్రాణం కాదంటారో! అవునూ ఈ డాక్టర్లకి దొంగ భయాలూ అవీ వుండవా ఏమిటండీ—

శేష. (పేపరుచూస్తూ-ఒక్కసారి) అమ్మో దొంగలు దొంగలు!!

ఇద్దరూ ఎక్కడ ఎక్కడ...

శేష. ఇక్కడ-ఈ పేపర్లో! చూశారా. "బొమ్మతిమ్మనపేటలో దొంగల బెడద! రాత్రులు పోలీసుగస్తీ"

కామే. అమ్మ! బొమ్మతిమ్మనపేటమ్మనవూరేమోనని హడలిపోయాను. ఓరి

నీ కొంపకునోట్లో పంచదారపొయ్యా-భయపెట్టేశావయ్యా!
**శేష:** (పేపరు చూస్తూనే) ఈ దొంగతనం చూశావా-"పట్టపగలు బ్యాంకి దోపిడీ లక్షా ఇరవై వేలతో పరారీ"
**సీత;** బ్యాంకీగదా-పర్వాలేదు. ఇల్లేమో అనుకున్నాను. ఐనా ఈ బ్యాంకులవాళ్ళు అన్నేసి లక్షలు పెట్టుకుని కూచుంటారెందుకో!
**శేష;** ఇది చూశావా-
**కామే:** ఇహ చూడలేను, వినలేనుగాని, ఆ పేపరు అక్కడ పడేసి నువ్వు బయల్దేరు లేదా, దొంగల వార్తలు చదువుకుంటూ వుండు-నేను వెళ్ళి స్నానం చేసొస్తాను.
**శేష:** వెళ్ళువుగాని గాని-ఇంతకీ నా సలహా ఒకటుంది. వింటానంటే చెప్తాను.
**కామే:** చెప్తానంటే వినక చస్తామా-చెప్పు!
**శేష:** ఏంలేదు-ఉద్యోగాలకి వెళ్ళిన మీ పిల్లలకి ఈ వూరు ట్రాన్స్ఫర్ కాదు; వాళ్ళిప్పట్లో రారు. మీరు మీ ఈ దివ్యభవనం వదలి, వాళ్ళదగ్గరకి వెళ్ళరు అంచేత నా సలహా ఏమిటంటే, మీరు-మీ మేడపైన ఖాళీగానే వుంటుంది గనక-అది అద్దె కిచ్చేయండి. పైన సందడి, మీకు రాబడీ: దొంగభయం దొరభయం వుండదు: ఇంత ఇల్లు ఇద్దరికీ అనవసరం: ఆలోచించండి.
**కామే:** అవుననుకో శేషయ్యా- ఐనా, నాకెందుకో అద్దెకివ్వాలని లేదు మొదట్నుంచీ. అద్దెల వాళ్ళతో పడలేం. అద్దెలు సరిగ్గా ఇవ్వరు, ఇల్లు సరిగ్గా చూసుకోరు:
**శేష:** అలాంటి వాళ్ళకి ఇవ్వమయ్యా- అన్నీ చూసుకుని సవ్యంగా వుంటారనుకున్న వాళ్ళకే ఇస్తాం.
**కామే:** అదెలా తెలుస్తుందిలే- దిగిన తర్వాతగానీ తేలదు భాగోతం:
**శేష:** నే చూస్తాలే మంచి పార్టీని. అద్దె మూడు నెలలది ముందే ఇచ్చేయాలి. ఇల్లు సరిగ్గా చూసుకోవాలి.
**కామే:** పెద్ద కుటుంబం కాకూడదు సుమా:
**శేష:** ఇద్దరు పిల్లలే వుండాలి.
**సీత:** పిల్లల్లేకుండా వుంటే మరీ మంచిది. గోల వుండదు.
**శేష:** పిల్లలుండకూడదు:
**కామే:** ఆఫీసరైతే మంచిది.
**శేష:** మరీ మంచిది:...దీనివల్ల తేలిందేమిటంటే, మీ యింటికి ఎవడూ అద్దెకు రాడు!
**ఇద్దరూ:** ఏం?
**శేష:** ఆఫీసరు, పిల్లలు వుండకూడదు అంటే, ఎలాగయ్యా-ఆఫీసరైన తర్వాత పిల్లలుండకుండా ఎలా వుంటాడు?
**కామే:** సరే, పిల్లల్ని వుండనీ.
**సీత** మీకు మంచివాడిని చూశాంటే ఇవ్వయ్యగారూ-నాంగ్రామాయుమైన కుటుంబం

లక్షణమైన పిల్లలూ అయితే బావుంటుంది.

**కామే:** నువు చెప్పింది పెళ్ళి సంబంధానికి చెప్పినట్టుంది! నేనూ చూస్తానులేవయ్యా నువ్వూ చూడు.

**శేష:** మూఢం అనేం లేదు ఈ రోజుల్లో. ఇల్లు అద్దెకి దొరుకుతుందని తెలిస్తే, పంచదార కోసం రేషన్ షాపుమీద పడ్డట్టు పడతారు!

**నీల:** ఐతే ఎవరికీ చెప్పొద్దు.

**కామే:** ఆ—ఓ పని చేస్తాను శేషయ్యా! ఇంటిముందు బోర్డు కడతాను. వచ్చే వాళ్ళందరినీ ఇంటర్వ్యూలు చేస్తాను. నెగ్గినవాడికి, నాకు నచ్చిన వాడికి ఇల్లు ఇస్తాను. ఏమంటావ్?

**శేష:** ఈ ఐడియా బాగానే వుందిగాని— ఆ వచ్చేవాడే దొంగ కాకుండా మాత్రం చూసుకో.

**కామే:** నీ కెందుకు, నేచూస్తాగా—అవన్నీ. ఆలోచన బాగానే వుంది. బోర్డు కట్టెయ్యమంటావేమిటి?

**నీల:** మంచిరోజు చూసి కడదాం అండీ.

**కామే:** ఇంకానయం! పురోహితుణ్ణి పిల్చి, ముహూర్తం పెట్టిస్తాననలేదు! బోర్డు రాతి గుమ్మానికి కట్టడానికి మంచేమిటి శేషయ్యా—దీని చావస్తంగాని!

**శేష:** ఏం భయం లేదమ్మా—కట్టనీ. నీ దగ్గర పెద్ద అట్ట వుందా—

**కామే:** వుంటుంది.

**శేష:** ఐతే, ఒక పళ్ళు తోముకునే పుల్ల తీస్కో. ఒక వైపు రాయితో కొట్టి, కుంచెలా చెయ్యి. సిరాబుడ్డి వుందా— అందులో ముంచి అట్టమీద రాసేయ్—అంతే. ఇంతకీ నీ రాత బావుంటుందా—

**కామే:** నారాతకేమయ్యా— దివ్యమైనరాత! రాత బాగోలేకపోతే ఇంతమంచి భార్య, నలుగురు పిల్లలు, ఈ ఇల్లు—ఇవన్నీ ఎలా వస్తాయి?

**శేష:** ఆరాత సరే—ఈ రాత, చేతిరాత!

**కామే:** ఆ రాత బావుంటే ఈ రాతా బావుంటుంది. (వెళ్ళిపోతాడు)

**నీల:** ఏమండీ, ఏమనిరాస్తారు బోర్డు?

**కామే:** ఏమని రాస్తాను—టులెట్ అని రాస్తాను.

**నీల:** అదెందుకండీ—టులెట్టా టాయిలెట్టా అని ఇంగ్లీషు! ఏ ఇంగ్లీషువాడో వచ్చి ఇల్లు అడిగాడంటే చస్తాం! చక్కగా తెలుగులో రాయండి—తెలుగువాళ్ళే వస్తారు! ఇంకోభాష వాళ్ళెవరొచ్చినా మాటామంతీ తెలియకుండా అవస్థపడాలి!

**కామే:** అలాగే తెలుగులోనే రాస్తాను. అదీ, అందరూ రాసినట్టు "ఇల్లు అద్దెకు" అని పొడి అక్షరాల్లో రాయను. "మా ఇల్లు అద్దెకు ఇస్తాము" అని రాస్తాను, ఎలా వుంటుంది?

**శేష:** బ్రహ్మాండంగా వుంటుంది. వీలైతే మధ్యలో ఒక తలకాయి కూడా వెయ్యి.

దిష్టిబొమ్మలా వుంటుంది!
**కామే:** బొమ్మ అది నాకు రాదయ్యా-అక్షరాలైతే పర్వాలేదు.
**సీత:** తప్పులూ అవీ లేకుండా సుబ్బరంగా రాయండి. అట్టకిపైన తాడు కూడా కట్టండి-పైన వేల్లాడదియ్యాలిగా.
**కామే;** చూశావా! నాకు తట్టనే లేదు (వెళుతున్నాడు)
**శేష;** మరి-నేను కూడా వెళ్ళొస్తాను కాముడూ!
**కామే:** ఉండుండు. ఏదో నీ చలవ, నీ పుణ్యమా అని. దొంగలభయం లేకుండా ఐడియా ఇచ్చావు. నీ సముఖంలోనే, ఈ బోర్డు సెరిమనీ కూడా అయిపోతే-దివ్యంగా వుంటుంది. ఒక్క నిమిషం-(లోపలికి వెళ్ళాడు).
**శేష:** చూశావా సీతమ్మా! ఇంతసేపు నీయింట వున్నానా-మంచి సలహా ఇచ్చానా కప్పు కాఫీకి నోచుకోలేదు!
**సీత:** రేపు తెల్లవారే సరికి వచ్చేయండి శేషయ్యగారూ-రెండు కప్పుల కాఫీ ఇస్తాను. ఇవాళ మరి పాలు నిండుకొన్నాయి!
**శేష:** అది సరేలే-అక్క-ఉన్నమాట చెప్పావు మాట వరసకి! ఇంతకీ పైన అద్దె కిస్తే ఎంతొస్తుందంటావ్ సీతమ్మా!
**సీత:** ఏమో-నాలుగైదు వందలు రావచ్చు.
**శేష:** నాలుగైదు వందలేమిటి సీతమ్మా అమాయకురాల్లా వున్నావు. వెయ్యి రూపా యిలకు తక్కువ రాదు. రాకపోవడం ఏమిటి నువ్వు ఇవ్వకు!
**సీత:** ఆయనతో చెప్పండి శేషయ్యగారూ ఈ మాట! అన్నీ చవకసన్మా, ఖరీదు బేరాలూనూ. మనం ఏదైనా ఇస్తే చవగ్గా ఇవ్వాలంటారు; కొంటే ఖరీదు ఎక్కువ పెట్టి కొంటారు.
**శేష:** అమాయకుడమ్మా పాపం!
**సీత:** అమాయకుడేం కాదులేండి-ఆ గడుసుతనం చూపించవలసినచోట చూపిం చరు-అదే నా గోల!... ఈ రేడియో ఎందుకు ఊరుకుందో ఏమిటో-తీసుకెళ్ళి ఎవరి కైనా చూపించకూడదండి శేషయ్యగారూ-(తెచ్చి ఇస్తుంది)
**శేష:** నాకెవరు తెలుసమ్మా-
**సీత:** ఎవరో ఒకరు తెలుస్తారు. మీరైతే కాస్త చవకలో చేయించుకొస్తారు. రేపొద్దున్న కాఫీ వేళకు వస్తారుగా-తీసుకొచ్చేద్దురుగాని! (ఇచ్చింది తీసుకున్నాడు) మరేం అనుకోకండి. నాకు రేడియో వాడకపోతే తోచదు. వాగుతూవుంటే ఆయనకు తోచదు. అదిగో, ఆ వార్తలు చెప్తారు చూడండి, అవి మాత్రం వింటారు! (లోప ల్నుంచి కామేశ్వరరావు బోర్డుతో వచ్చాడు. చేతిలో పెద్ద నోట్‌బుక్ కూడా వుంది).
**కామే!** శేషయ్యా-బోర్డురెడీ. ఎలావుంది? చదువు.
**శేష:** (చదువుతూ) "మా ఇల్లు అద్దెకు ఇస్తాము." బావుందయ్యా, శుభ్రంగా బోర్డులు రాసుకునే వ్యాపారం పెట్టావనుకో-నీకు ఇంక తిరుగులేదు!
**సీత:** అలాంటి సలహాలు ఇవ్వకండి శేషయ్యగారూ-ఇహ అదే పనిగా అట్టలు

పట్టుకుని రాసుకుంటూ వుంటాడు. వచ్చేవాళ్ళూ-పోయేవాళ్ళూ! ఎవడి దగ్గరా పైసా పుచ్చుకోరు. రాయను అని చెప్పండి!

**కామే:** ఓసి నీ యిల్లు బంగారం గానూ-ఎలా తెలిసిపోతోస్తున్నావే నన్ను! సరే-పదవయ్యా మేడ ఎక్కుదాం!

**సీత:** ఉండండుండండి-ఏదీ ఆ బోర్డు? (తీసుకొని, గోడకి వున్న పటాల దగ్గర హారతి ఇచ్చినట్టు తిప్పుతూ) భగవంతుల్లారా! ఈ బోర్డు చలవ వల్ల, మా యింటికి మంచి అద్దెగాళ్ళు వచ్చి, మాకు దొంగ భయాలు లేకుండా చెయ్యండి!

**కామే:** ఈ నోట్‌బుక్ కూడా వాటికి చూపించవే-(ఇస్తాడు)

**శేష:** ఇదేమిటి కాముడూ-అద్దె వసూళ్ళకా?

**కామే:** ఆఁ-కాదు! అప్లికేషన్లకి వచ్చిన వాళ్ళందర్నీ ఇంటర్వ్యూలు చేస్తానా-వాళ్ళ వివరాలు అందులో రాస్తాను. పేరు, ఉద్యోగం, కుటుంబం ఎంతమంది, జీతం ఎంత-ఇవన్నీ కాలంవారీ వుంటాయి. వారం రోజులపాటు ఇంటర్వ్యూలు జరిపి, ఎనిమిదో రోజున అవన్నీ చూసుకొని-ఇల్లు ఎవరికివ్వాలో ఎన్నుకొని కబురు చేస్తానన్నమాట.

**శేష:** గట్టివాడివేనయ్యా కాముడూ-నిన్ను అమాయకుడనుకుంటుంది మీ ఆవిడ!

**సీత:** నేనేం అనలేదు. మీరే అన్నారు: పదండి-బోర్డు కడదాం. [ముగ్గురూ వీధి వేపు నడుస్తూవుండగా-ఉత్సాహమైన నేపథ్య సంగీతం వినిపిస్తుంది. తర్వాత, కామేశ్వరరావు, సీతమ్మ లోపలికి వస్తారు. కామేశ్వరరావు చేతిలో బోర్డు వుండదు. కొన్ని రోజులు గడిచాయని చెప్పడానికి లైటింగ్‌లో చిన్న మార్పు చెయ్యొచ్చును. లైట్ "డిమ్" కావచ్చు; లేదా రంగు మారవచ్చు. సంగీతం అలా వినిపిస్తూనే వుంటుంది సీతమ్మ ఆ రంగస్థలానికి కుడి చివరన వుంటుంది. ఆ సమయంలో ఎందరో ఆడ, మగా లోపలికి క్యూల్లో వస్తారు లోపలికి వచ్చిన తర్వాత-మాట ఏమీ వినిపించదు. అంతా మూకాభినయం. కొందరు స్త్రీలు సీతమ్మను చుట్టుముట్టి, ఏదో అడుగుతూ వుంటారు. ఆమె సమాధానం చెబుతూ ఉంటుంది. కామేశ్వరరావు ఏదో ప్రశ్నించడం, వచ్చినవాళ్ళు సమాధానాలు చెప్పటం-అతను పుస్తకంలో రాసుకోడం కాస్సేపు జరుగుతుంది. అందరూ ఇల్లు మాకు ఇవ్వాలంటే, మాకు ఇవ్వాలన్నట్టుగా అభినయంచేసి వెళ్ళిపోతారు. సీతమ్మ కూడా లోపలికి పోతుంది. ఒక యువకుడు మాత్రం కామేశ్వరరావు పక్కగా నిలబడి వుంటాడు. కామేశ్వరరావు నోట్ పుస్తకంలో రాసుకుంటూ వుంటాడు "లైటింగ్" పిక్క పూర్వ దశకు "బ్రైట్"గా వచ్చేస్తుంది నేపథ్య సంగీతం ఆగిపోతుంది ]

**కామే:** మీ పేరు, మీ ఉద్యోగం?

**సత్య:** పేరు సత్యనారాయణ, ఉద్యోగం ప్రభుత్వంలో పెద్ద గుమాస్తా.

**కామే:** కూచోండి.

**సత్య:** పర్వాలేదులెండి ఇంటర్వ్యూల్లో నిలబడే వుండాలి,

కామే బాగా చెప్పారు మేము మీ దగ్గరికి పనిమీద వచ్చినప్పుడు, చేతులు కట్టుకుని నించుంటాం ఇప్పుడు మీరు నించున్నారు అంతేలెండి-అవసరాలు అలాంటివి ప్రభుత్వంలో వున్నారంటే, సంపాదన ఎలా వుంటుంది?

సత్యః: పర్వాలేదు నెలకి పదిహేను వందలు చేతికొస్తుంది.

కామే ఇతరత్రా...?అదే, ఈ చేతికి?

సత్యః: ఇతరత్రా...పెద్ద అవకాశం లేదు. ఐనా స్వతహాగా మేము కాస్త వున్న వాళ్ళం అంచేత డబ్బు ఇబ్బంది వుండదు.

కామే: పిల్లలెంతమంది?

సత్యః: ఒకడే ఒక అబ్బాయి.

కామే: అబ్బాయి వయసు?

సత్య: ఆరేళ్ళు.

కామే. భార్యసంగతి చెప్పలేదు.

సత్య: భార్య వయసు అబ్బాయి వయసు కంటే ఇరవై ఏళ్ళు పెద్ద. నావయసు కంటె ఆరేళ్ళు చిన్న.

కామే· చిక్కు ప్రశ్నలా వుందేమిటి?

సత్యః: చెప్పుకోండి చూదాం. పోనీ...
నా వయసు 32. ఇప్పుడు చెప్పుకోండి చూదాం,

కామే· చూడు నాయనా, సత్యనారాయణ! ఇలా చిక్కు ప్రశ్నలూ లెక్కలూ నాకు అక్కర్లేదు. అసలు నీ భార్య వయసు అడగలేదు. (ఆలోచించి) ఓహో-అంటే నీ భార్య వయసు...నీ భార్య వయసు...ఇరవై ఆరేళ్ళు...అంతేనా?...

సత్య· సరిగ్గా చెప్పారు!...సార్, మాది పరిమిత కుటుంబంకన్న చిన్న కుటుంబం సార్...మాయింట్లో మేం ముగ్గురమే. (గబగబ పాఠం వప్ప చెప్పినట్టు చెబుతాడు) మావాడు అల్లరి చెయ్యడు. మా ఆవిడకి సంగీతం రాదు. నాకు పేకాట, తాగుడూ లేవు మా యింట్లో పశువులు లేవు. మేకలు లేవు. నీళ్ళు తక్కువగా ఖర్చు చెయ్యం స్నానాలు ఒంటి పూటకే. దగ్గర బంధువులు ఎవరూరారు. అంతా దూరంలో వున్నారు.

కామే: చాలు చాలు! ఎందుకింత దండకం?...అన్నీ అనవసరం! ఓరి నీ కొడుక్కి మంచి బుద్ధి రానూ-ఎంత గడగడా వప్పజెప్పావయ్యా-పాఠం చదువు కొచ్చినట్టు!

సత్య: ఎలాగైనా ఇల్లు నా కివ్వండి సార్...

కామే: అది ఇప్పుడే చెప్పలేము బాబూ...నీలాంటి వాళ్ళు చాలామంది వున్నారుగా-ఈ దరఖాస్తులన్నీ పరిశీలించి —నాలుగు రోజుల్లో ఖాయం చేస్తాను.

సత్య: కావాలంటే కలెక్టర్‌గారి దగ్గర్నుంచో, మంత్రిగారి దగ్గర్నుంచో సిఫార్సు ఉత్తరం తీసుకురమ్మన్నా తెస్తానుసార్

కామే· అవన్నీ నా దగ్గర పనిచెయ్యవు నేను చాలా స్ట్రిక్టు. అలాంటి వేషాలువేసి, ఇన్ఫ్లుయన్స్ ఉపయోగించాలని చూస్తే మాత్రం చస్తే ఇల్లు ఇవ్వను ఆఁ...నీకు పోలీసు వాళ్ళతో సంబంధాలున్నాయా?

సత్యా: అంటే అర్థం కాలేదు సార్...

కామే· పెద్ద పోలీస్ ఆఫీసర్ ఎవరైనా తెలుసా అని?

సత్యా తెలీదు సార్ మా స్వస్థలంలో అయితే, ఒక కానిస్టేబుల్‌తో పరిచయం అయింది అదీ చిన్నప్పుడు. సైకిల్‌కి లైట్ లేదని పట్టుకున్నాడు! ఇక్కడ ఎవరూ అంతగా తెలియదు

కామే, (రాసుకుంటూ) దొంగలతో సంబంధాలున్నాయా? లేదా, మీ స్నేహితుల్లో చుట్టాల్లో ఎవరైనా దొంగతనాలువేసి జైలుకెళ్ళిన వాళ్ళున్నారా?

సత్యా ఎవరూ లేరుసార్ స్వాతంత్ర్య పోరాటంలో మాత్రం మా తాతగారు జైల్లో కొన్ని రోజులు వుండేవారట.

కామే అది ప్రశ్నల్లో లేదు-అనవసరం!

సత్యా సరేసార్...సార్, ప్రశ్నావళి ఇంకా వుందా...అయిపోయిందా?

కామే ఐనట్టే. ఏం?

సత్యా ఒక్క ప్రశ్న నేను మిమ్మల్ని వెయ్యాలి. అది వెయ్యకుండా, మీ ప్రశ్నలకి సమాధానాలు చెప్పడం వేస్టు.

కామే· ఏమిటా ప్రశ్న?

సత్యా ఇంటికి అద్దె ఎంత సార్?

కామే ఆరు వందల యాభై కరెంటు మీరే కట్టుకోవాలి.

సత్యా అది సరే ననుకోండి-ఈ ఆరు వందల యాభై నెలకా లేక...

కామే సంవత్సరానికి! ఏమిటయ్యా నీ అడగడం? నెలకికాక ఆరునెల్ల కనుకుంటున్నావా?

సత్యా నేను పదిహేను రోజులకేమో అనుకున్నాను సార్. చాలా చవగ్గా వుంది అద్దె రెండు పెద్ద గదులు, వంట ఇల్లు బెడ్ రూమూ, బాత్ రూమూ అన్నీ కలిపి ఆరు వందల యాభై అంటే, ఈ రోజుల్లో చాలా చవక సార్ ఎందుకని సార్, అంత తక్కువ?

కామే నారేటది అంతకంటె నాకు పెద్దాశ లేదు గనక.

సత్యా అడ్వాన్సు ఎంత ఇవ్వాలి సార్?

కామే: ఒక్క నెలదే-

సత్యా నిజంగానా సార్...(అతని కాళ్ళమీద పడుతూ) సార్, ఎలాగైనా నాకి ఇల్లు ఇప్పించండి సార్...మీమేలు మరచి పోలేను పిల్లలు-సారీ, పిల్లాడు గలవాడిని మీ కెంతో సహాయంగా వుంటాను. బజారెళ్ళి వంటాయలు తెచ్చిపెడతాను. మా ఆవిడ చేత, మీ ఆవిడకి వంటసహాయం చేయిస్తాను. మీరు ఎక్కడికైనా వెళ్తే కుక్కలాగా

మెడకి గొలుసు కట్టుకుని? మీ గుమ్మం దగ్గర కాపలా వుంటాను. ఎలాగైనా నాకే ఇప్పించండి ఇల్లు గలాయనగారూ!

**కామే** చెప్పాను గదండీ చూడాలి అన్నీ పరిశీలించి అప్పుడు చెప్తాను నాలుగు రోజులు టైమివ్వండి. ఏమాత్రం అవకాశం వున్నా మీకే ఇవ్వడానికి ప్రయత్నిస్తాను. మీ అడ్రసు ఇచ్చారా?

**సత్యం** ఇదిగో సార్-నా కార్డు (విజిటింగ్ కార్డు ఇస్తాడు)

**కామే** బావుంది ఎక్కడ వేయించారు కార్డు?

**సత్యం** ఈ ఊళ్ళోనే సార్...ప్రింటరు నాకు తెలిసినవాడు మీకు ఓ వెయ్యికార్డులు వేయించమంటారా సార్-

**కామే** అదే, అలాంటి సహాయాత్రే-చేస్తానని మొహమాట పెట్టకూడదూ అన్నాను [వీధి వేపునుంచి శేషయ్య వచ్చాడు అక్కడ నిలబడి చూస్తున్నాడు కొన్ని రోజులు గడిచాయి గనక, అతని జుబ్బా మారవచ్చును]

**సత్యం** లేదు సార్...బావుందని మీరు మెచ్చుకుంటేనూ-మీక్కూడా ఇలాంటి కార్డ్సు వెయించాలని ముచ్చట పడ్డాను-ఐతే, వస్తాను సార్! మా ఆవిడనీ అబ్బాయినీ తీసుకుని నాలుగు రోజులు పోయాక వస్తాను సార్...గృహలక్ష్మిగారిని దర్శించు కోవాలి

**కామే** మీరు రాకూడదు! నేనే మీ అడ్రసుకి జాబు రాస్తాను

**సత్యం** తప్పకుండా రాయండి వస్తాను సార్...నమస్కారం- (వెళ్ళడానికి వెనక్కి తిరిగాడు శేషయ్య కనిపించాడు) సార్...మీరింక ఇల్లు అడగనవసరం లేదు తాంబైపాళ్ళు నా కిచ్చేసినట్టే మీరు వెళ్ళిరండి

**కామే** ఓరి నీయింట ముత్యాలవాన కురవా! ఆయన ఇంటికోసం రాలేదు నాయనా నా మిత్రుడు-శేషయ్య ఇల్లు అద్దెకిమ్మని సలహా ఇచ్చిన పరోపకారి. మీ నిర్వాసితులకు పునరావాసం కల్పిస్తున్న పదవిలేని ప్రజోపకారి!

**సత్యం** ఆహా! మీకు నా జోహార్లు! రికమెండేషను పనికిరాదు గనక నోరెత్తకుండా నిష్క్రమిస్తాను-సెలవు (వెళ్ళాడు)

**శేష.** వస్తూ, ఆఁ...మాంచి పట్టుమీద వున్నట్టుంది గ్రంథం! పెద్ద ఆఫీసరు పోజులో, ఇంటర్వ్యూలు ఘనంగా జరిపిస్తున్నావు-పో, నీ జాతకానికి తిరుగులేదు!... ఇప్పటికి ఎన్ని దరఖాస్తులొచ్చాయి?

**కామే** లెక్క పెట్టలేదు శేషయ్యా-ఉండొచ్చు-60, 70 కూచో

**శేష** బావుంది సీతమ్మా...ఎక్కడ గృహలక్ష్మిదేవి-

**కామే** ఇంకెక్కడుంటుంది పాక గృహలక్ష్మిదేవి-అక్కడే

**శేష.** అయితే, కాఫీ అడక్కుండానే వచ్చేస్తుందన్నమాట సీతమ్మా!—నేవచ్చా!

**కామే!** (నవ్వి) కూచో శేషయ్యా-నువు తీరిగ్గా వున్నావంటే-ఈ దరఖాస్తులన్నీ చూదాం

**శేష** అవన్నీ ఎందుకయ్యా చూడ్డం?...నీకు నచ్చినవాడెవడో వుంటాడు గదా-వాడికిచ్చేయ్. ఐనా, చూశావు-నువ్వు అద్దె తక్కువ అనగానే అందరికీ ఆశ్చర్యంగా వుంది! బియ్యంధర ఒక్కసారి కిలో పావలాకి పడిపోయినట్టు ఫీలవుతున్నారు!

**కామే:** బాగా చెప్పావు న్యాయ ధర్మాలకీ, పరోపకార చింతనకీ స్థానంలేని ఈ కాలంలో ఇలాంటివి విడ్డూరంగానే కనిపిస్తాయి మరి!

**సీత** (కాఫీతో వస్తూ) ఇదిగో శేషయ్యగారూ! (ఇచ్చింది) మళ్ళీ ఏమైనా దొంగ తనాలు, దోపిడీలూ...నిన్నా మొన్నా...అన్నట్టు ఆ దొంగల ఆచూకీ ఏమైనా తెలిసిందా?

**శేష** ఏమీ తెలీలేదు. పోలీసులు పాపం గాలిస్తూనే వున్నారు! కుక్కల్ని తిప్పుతున్నారు. అంతర్రాష్ట్ర పోలీసు శాఖలకి వైర్‌లెస్‌లు ఇస్తున్నారు...వ్యాన్‌లు వేసుకుని ఊరూ ఊరూ తిరుగుతున్నారు. దొంగ మొహంలా కనిపించిన వాళ్ళందర్నీ నిలవేసి అడుగుతున్నారు...ఎన్ని తిప్పలు పడుతున్నా దొంగలు దొరికినట్టు లేరు!

**కామే:** దొంగలు దొరుకుతారటయ్యా-అసలే దొంగలు! ఎందుకూ-ఇప్పుడు బుద్ధొచ్చింది గా-మన జాగ్రత్తలో మనం వుంటున్నాం? రమ్మను ఏ దొంగ వస్తాడో మా యింటికి!

**సీత** బావుంది మీరు, మీ కోరికలూ!...కాఫీ తాగినట్టు లేదు, వేడి ఎక్కువగా వుందా శేషయ్యగారూ?

**శేష,** లేదమ్మా. ఐస్ వాటర్‌లా వుంది. పంచదార వెయ్యలేదు గావును, చేదుగా వుంటే అవస్థ పడుతున్నాను.

**సీత** నా మతి మండింది-ఇదిగో. ఈయనకి చక్కెర లేకుండా కలపడం అలవాటు గదూ-ఆ అలవాటులో మరచిపోయి వుంటాను. ఉండండి, చక్కెర తెస్తాను.

**శేష** అక్కర్లేదమ్మా-ఈ సారికి గుటక వేసేస్తాను-కాస్సేపు పోయాక వేడిగా, చక్కెర వేసి తెచ్చి ఇద్దువుగాని-ఉంటాన్లే, ఓ అరగంట! (టక్కున కాఫీ! టంబ్లరెత్తి గొంతులో పోసుకుని, టంబ్లర్ ఇచ్చేశాడు) సీతమ్మ లోపలికి వెళ్ళింది)

**కామే,** సరే, శేషయ్యా- రేపట్నుంచి ఇంటర్వ్యూలు ఆపేస్తున్నాను. ఈ సాయంకాలానికి బోర్డు ఎత్తేస్తాను. చాలు-ఈ వచ్చిన వాళ్ళలో మంచి వాళ్ళని ఎన్నుకుంటాను. బోర్డు వున్నంతకాలం-ఎగబడుతూనే ఉంటారు! ఎన్నికయిన అభ్యర్థికి ఎల్లుండి కబురువేసి పిలిపించి, ఖాయం చేస్తాను.

**శేష** ఎల్లుండి ఆదివారం. మంచిరోజేనా చూడు!

**కామే** ఆదివారం మంచిరోజే. అందుకనే ఆరోజు అందరికీ సెలవు. ఈ మన ఆఫీసుకి మాత్రం సెలవులేదు-అవాళ రమ్మని అద్దె అడ్వాన్సు పుచ్చేసుకుంటాను.

**శేష** కామునూ-నాదో చిన్నమాట. మాట అనుకో, మనవి అనుకో-మరేం లేదు ఈ లిస్టులో నాకు బాగా తెలిసివున్న వాడొకడున్నాడు. పాపం, ఇల్లావాకిలి దొరక్క చెట్టుకింద కాలక్షేపం చేస్తున్నాడు. మంచివాడు, ఉద్యోగి. అతను, తల్లి, చెల్లి

తమ్ముడూ, భార్య, ఇద్దరు పిల్లలూ-అంతే! అతనికిగాని నువ్వు ఇల్లు ఇస్తే-నాకు మహోపకారం చేసినవాడివవుతావు

**కామే** ఓరి నీ ఇంటి ముందునుంచి వీధి చివరివరకు పిండి ముగ్గులు పెట్టా! నిదానంగా, తమాషాగా రికమెండేషన్ చేశావే-ఆహా! చూడు శేషయ్యా-ఒక ఆదర్శాన్నీ ఆత్మనీ నమ్ముకున్న వాడిని-స్వపర భేదాలు చూడకుండా, నిజాయితీ గలవాడికీ నాకు నచ్చిన వాడికి ఇల్లుఇవ్వాలని తీర్మానించుకున్నాను ఇల్లు అద్దెకిమ్మన్న సంహామీదే ఐనా, ఫలానా వాడికే ఇమ్మన్న సలహా మాత్రం నేను తీసుకోను! నన్ను ఈ ఆదివారం వరకైనా నిజాయితీగా ఎతకనీ!

**శేష** భేష్! నా పరీక్షలో నెగ్గావురా కాముడూ! సరదాకి, నువ్వు ఏమంటావో చూదామని, చిన్న టెస్టు పెట్టాను నువ్వు జారతావేమో అనుకున్నాను-లేదు, నిలబడ్డావు-నిజాయితీకి మారుపేరులా నిటారుగా నిలబడ్డావు-నీకు నా అభినందనలు! (షేక్‌హాండ్ చేశాడు)

**కామే** నీకు నా కృతజ్ఞతలు [ఇద్దరూ నవ్వుకుంటూ వుండగా "లైట్స్ ఆఫ్" అవుతాయి తిరిగి లైట్స్ వెలిగే సరికి-ఆరంభంలో వున్నట్టుగానే మూలవున్న టేబుల్ మీద ట్రాన్సిస్టర్ రేడియో ఉంటుంది ముందు వినిపించిన పాటే వినిపిస్తూ వుంటుంది స్టేజిమీద ఎవరూ వుండరు కాస్సేపటికి వీధివేపు నుంచి శేషయ్య వస్తాడు]

**శేష** కాముడూ! సీతమ్మా మళ్ళీ వీళ్ళు తలుపులు తెరిచేశారు, రేడియోలో పాట వినిపిస్తున్నారు వీళ్ళకి మతులుండవు (వెళ్ళి ట్రాన్సిస్టర్ ఆఫ్ చేస్తాడు) కామేశ్వర్రావూ-కాముడూ!

**కామే** (నీరసంగా వచ్చాడు లోపల్నుంచి) కూచో శేషయ్యా!

**శేష:** గుడ్ మార్నింగ్! మళ్ళీ తలుపులు తెరిచేసి వుంచుతున్నారు-రేడియో భక్తి రంజనితో ఇతరులకి స్వాగతం పలుకుతున్నారు-జాగ్రత్తగా వుండండయ్యా!

**కామే** కూచో-కాఫీ తెప్పిస్తాను

**శేష** వద్దులే ఇప్పుడే తాగాను ఇంటి దగ్గర తాగి బయల్దేరాను-మళ్ళీ మీ గుమ్మం ఎక్కుతూ ఎందుకేనా మంచిదని హోటల్లో కూడా తాగాను ఆ, ఏమిటి సంగతులు?

**కామే** సంగతులేమిటయ్యా-అంతా తారుమారై పోయింది! ఇంత మోసపు ప్రపంచం అనుకోలేదు సుమా-దాని చుట్టూ మనిషి ప్రదక్షిణలు చెయ్యా!

**శేష** ఏం చేస్తాంలే-తప్పంతా మనది మరీ న్యాయానికిపోతే, ఇలాగే జరుగుతుంది రోజుల్ని బట్టి మనమూ ప్రవర్తించాలి, మెసులుకోవాలి అసలు బోర్డు కట్టడంతో వచ్చింది చిక్కు ముందందరూ మాకిమ్మంటే మాకిమ్మని తండోపతండాలుగా ఎగబడ్డారా-ఎవడో సందేహం లేవదీశాడు ఈ రోజుల్లో ఇల్లు అద్దెకిస్తాం అని ఎవడైనా బోర్డు కడతాడా-అని అంచేత, అందులో ఏదో వుందన్నాడు నాకు తెలిసిన వాడొకడు వాడు కూడా ఆ మాటే అన్నాడు "ఇల్లు ఎవరూ అద్దెకు ఇవ్వరు,

ఇచ్చే వాళ్ళున్నా, పుట్టి చప్పుడు కాకుండా, ఎవరికో ఇచ్చేస్తారు-అంతేగాని, ఇలా బోర్డు కడతారా? బోర్డు కట్టారంటే, అక్కడేదో లోపం వుంది-" అన్నాడు

**కామే** వాడి మొహంలో వుంది లోపం' నిక్షేపంలాంటి ఇల్లు నిక్షేపంలాంటి పీధి! పది కాలాలపాటు తిరిగితే మాత్రం, దొరుకుతుందిటయ్యా శేషయ్యా-ఈ ప్రాంతంలో ఇంత చవగ్గా ఇల్లు?

**శేష** అదీ-అదొకటి కొంప ముంచింది అద్దె పన్నెండు వందలో, వెయ్యి రూపా యలో చెప్పవలసింది ఏదో రేడియోల రేట్లలాగా, గడియారాల రేట్లలాగా ఆరువం దల యాభై ఖరీదు పెట్టినట్టు ఇంకానయం-ఆరు వందల నలభై తొమ్మిది రూపా యల ఏభై పైసలన్నావు కాదు వచ్చినవాళ్ళు అదిరిపోయి పారిపోయే వాళ్ళు!

**కామే** నిజమేలే గుమ్మంలో నిలబడి పీధిలో వెళ్తున్న వాళ్ళని నుయిగున్ని పిల్చి, భోజనం పెడతాం రమ్మను-ఒక్కడురాడు "ఏ విషమో కలిపి పెడతారా వుంది అని పారిపోతారుగాని, వస్తేరారు పూర్వపు రోజులా ఏమిటి-ఉచిత భోజనాలకీ, ఉచిత కాఫీలకీ!

**నీత** (కాఫీ పట్టుకుని వస్తూ) గొంతు వినిపించింది శేషయ్యగారూ-మళ్ళీ మీరు పిలవడం ఎందుకని, నేనే తీసుకొచ్చేశాను కాఫీ తీసుకోండి

**శేష** వద్దమ్మా ఇరవై నిమిషాల్లో రెండు సార్లయింది అప్పుడే

**నీత** అయ్యో-మీ కోసం అని ప్రత్యేకంగా వేడిగా, చక్కెరవేసి బాగా చేశాను శేషయ్యగారూ-వద్దనడం ఆశ్చర్యంగా వుంది

**కామే** ఇప్పుడే అన్నానే-ఈ రోజుల్లో ఉచితంగా భోజనం పెడతానన్నా, కాఫీ బాగా కలుపుకొచ్చాను తాగమన్నా-అనుమానిస్తారనీ

**శేష** అబ్బెబ్బెబ్బె, నాకా అనుమానం ఏమీ లేదయ్యోయ్ ఎన్నిసార్లు మీ యింటి కాఫీ తాగలేదు గనక! సరే, ఇవ్వమ్మా-నీ మాట ఎందుకాదవాలి (కొద్దిగా తాగి) ఆహా, కమ్మగావుంది వద్దన్నప్పుడు, నువ్వు తీసుకెళ్ళి పోయివుంటే-గొప్ప కాఫీని పోగొట్టుకునే వాడిని!

**కామే** ఓరి నీ కళ్ళు వృద్ధాప్యంలో కూడా చక్కగా కనపడా! ఎక్కడికక్క డికి ఏదో మాట అంటావు!

**నీత** చూశారా, శేషయ్యగారూ! ఇల్లు ఇస్తాం అని బోర్డు కట్టిన నిమిషాల్లో వచ్చి మీద పడ్డారా-నిన్న ఒకావిడ గుళ్ళో కనిపిస్తే అడిగాను-"ఏమ్మా-ఇల్లు అడిగారు గదా, ఏంచేశారు?" అని మరికట్లో ఏదో దోషం వుందని అందుకనే ఇల్లు చవగ్గా ఇస్తున్నామని ఆవిడతో పక్కింటావిడ చెప్పిందట అంచేత, "ఇంకో ఇల్లు చూసు కుంటున్నాం అండీ అనీ నాజూగ్గా తిప్పుకుంటూ నన్ను ఈసడిస్తూ వెళ్ళిపోయింది

**కామే** ఇదొకటి! లక్షణమైన ఈ ఇంటి దోషం వుందా-ఎంతమాట-వీళ్ళ ముఖాల మీద వృద్ధ రేఖలురానూ!

**శేష** అయితే ఆర్భాటం, హంగామా అంతా దీపావళి టపాసులాగా తుస్సుమని

పోయిందన్నమాట-ఐతే, ఎవరూ మళ్ళీవచ్చి అడగనట్టేనా?

కామే నట్టే అడుగుదామని వచ్చినా, గుమ్మంలో ఎవర్తో కనిపించి, ఏదో చెప్పేస్తు న్నారు: వచ్చినవాళ్ళు పారిపోతున్నారు ఇహ ఈ ఇంటికి అద్దెకెవడూ రాడు, దొంగ భయమూ తప్పదు!

శేష ఇదేమిటి కాముడూ, ఇలా జరిగింది-చాలా విచిత్రంగా వుంది ఒకవేళ దొంగవెధవ లెవరయినా, వీధి చివర పొంచి వుండి, వాళ్లే ఇలాంటివన్నీ పుట్టిస్తు న్నారేమో-

వేళ నిజమే కావచ్చు శేషయ్యగారూ: నిన్న గుడికి వెళ్ళానా-ఇద్దరు వెధవలు నన్ను చూశారు ఏవో సైగలు చేసుకుని, గబగబ పరుగెత్తారు ఒకవేళ, మనయింట్లో ఎవరూ లేరు అనుకుని, దొంగతనానికే బయల్దేరి వుంటారు! తీరా వచ్చేసరికి గుడిలో వినాయకుడిలాగ ఈయన కూచుని వుండడం చూసి వుంటారు

శేష కావచ్చునమ్మా ఏదైనా కావచ్చు ఈ రోజుల్లో ఫలానాది జరుగుతుంది ఫలానాది జరగదూ అని చెప్పడానికి లేదు: ఏ క్షణంలోనైనా, ఏదైనా జరగవచ్చు

కామే ఆ రోజు వచ్చాడు చూడు, ఒక యువకుడు, గవర్నమెంటులో ఉద్యోగం అన్నాడు-ఎలాగైనా ఇల్లు ఇవ్వమని కాళ్ళావేళ్ళాపడి ప్రాధేయపడ్డాడు-అతనికి కబురు చేశాను రమ్మని చూద్దాం, అతనువస్తే ఎగిరి గంతేసి తీసుకుంటాడు అత నికి మళ్ళా ఎవరూ లేనిపోని విషయాలు చెప్పకుండా వుండాలి

శేష చెప్పినా అతను నమ్మే మనిషిలా కనిపించ లేదు.లే నాకు ఖచ్చితంగా అతను తీసుకుంటాడు

కామె ఇల్లు బావుందని మురిసిపోయాడు, అద్దె ఇంకా బావుందని సంబరపడి పోయాడు అలాంటి వాడికిస్తే పుణ్యం, పురుషార్థమునూ, [సత్యనారాయణ వస్తాడు]

సత్యా (వస్తూ,)నమస్తేసార్! నా పేరు సత్యనారాయణ

కామె (లేచి) ఆఁ రండిరండి సమయానికొచ్చారు నా కబురు అందిందన్న మాట చూడండి, దరఖాస్తులన్నీ చూశాను, పరిశీలించాను-మీ కంటె యోగ్యత గల వాళ్ళు ఇంకా కొందరు కనిపించారుగాని, ఎందుకులే వాళ్ళతో మనకి-పోనీపాపం ఎంతగానో అడిగారు సత్యనారాయణగారనీ-మీకు కబురు చేశాను మీరు ఎప్పుడు దిగుతారో ఆలోచించి, అడ్వాన్సు కట్టేసి, దిగిపోవచ్చు

సత్యా క్షమించండి కామేశ్వరరావుగారూ-నా కంటె యోగ్యత గలవాళ్ళు వున్నా రన్నారు చూడండి-వాళ్ళలో ఎవరికైనా ఇచ్చేయండి ఇల్లు:

ముగ్గురూ అదేమిటి?

సత్యా నా కొద్దులెండి మీరు రమ్మని కబురు చేశారు గనక! వచ్చానుగాని ఇంటి కోసం రాలేదు!

కామె ఆఁ!

సత్యా అవును సార్! మీరు పెద్ద మోసగాళ్ళు సార్ ఆ మాట నాకు అప్పుడు

అర్థం కాలేదు.

కామే ఏమిటన్నావు-ఏమిటన్నావు-నేను, నేను మోసగాడినా

నీత జాగ్రత్తగా మాట్లాడు నాయనా-ఇంత వరకు మా ఆయన్ని పట్టుకుని అలాంటి మాట అన్నవాడెవడూ లేడు!

శేష ఏదో నీ డబ్బు తినేసినట్టు, నిన్ను అన్యాయం చేసినట్టూ మాట్లాడతావేమిటి-తప్పు!

సత్య, తప్పేం కాదుసార్! ఇంటినిండా బోలెడన్ని లోపాలు వుంచుకుని అవన్నీ కప్పేసి ఇల్లు చవగ్గా ఇస్తున్నట్లు, అడ్వాన్స్ ఒక్క నెందే పుచ్చుకుంటున్నట్టూ నాటకం ఆడడం మోసంకాదూ!

కామే: నాటకం ఏమిటయ్యా నాటకం, మోసం? మర్యాదగా మాట్లాడు

సత్య అయ్యా-ఉన్నమాట, నేవిన్నమాటా చెప్తాను వినండి. మీ యింట్లో దెయ్యాలు తిరుగుతున్నాయట!

అంతా. ఆ!

సత్య కొన్ని సంవత్సరాలక్రితం ఈ ప్రాంతం అంతా శ్మశానం అనీ, దరిమిలా అది, ఇలా పేటగా మారిపోయిందనీ, అయినా కొన్ని ఇళ్ళలో దెయ్యాలు భూతాలూ ముందు గూళ్ళు కట్టుకుని తర్వాత గట్టి ఫౌండేషన్లు వేసుకుని పాతుకుపోయాయనీ అలాంటి ఇళ్ళలో మీయిల్లే ముఖ్యమైందనీ అందుకనే మీరు, ఎవ్వరూ మీ యింటికి రాకపోతే, చివరికి ఈ ఎత్తు ఎత్తారనీ నమ్మకం వున్న మనుషులు చెప్పారు

నీత ఎంతమాట ఎంతమాట! మా యింట్లో దెయ్యాలూ భూతాలూనా? నిక్షేపం లాంటి ఇల్లు! ఒక్కనాడు ఒక్క దుస్వప్నం రాలేదు, ఒక పీడ వాలలేదు. లక్ష్మి కళతో వెలిగిపోయే ఈ ఇంటిని పట్టుకొని భూతగృహం అంటావు

సత్య: అదేనమ్మా-నేను ముందు అలాగే వాదించాను అలాంటిదేమీ లేదని భ్రమ కల్పించడానికే మీరు, నిత్యం గుమ్మానికి మామిడి తోరణాలు కట్టడం, గడపకి పసుపు కుంకుమలు పెట్టడం-ముగ్గులు వెయ్యడంనట! ప్రతివాడూ ఈ ఇరల్లో దోషం వుందనే అంటున్నారు. అలాంటప్పుడు తెగించి నేనెలా రాగలను చెప్పండి!

కామే. ఓరి ఈ మనుషుల నోళ్ళలో మట్టి ముద్దలు కొట్టా-చూశావా శేషయ్యా లోకం ఎలావుందో! మంచికీ, నిజాయితీకి స్థానం లేదయ్యా!

సత్య నిన్ననే మీయింటి సంగతి మీవసతులూ వివరాలూ అన్నీ ఇంకో స్నేహితుడికి చెప్తే-ఎవ్వరైనా మేడమీద ఆత్మహత్య చేసుకుని చచ్చిపోయి వుంటార్రు, అందుకనే ఇన్నాళ్ళూ అలాపడి వుంది అన్నాడు!

శేష నారాయణ నారాయణ!

కామే ఈ ఇల్లు కట్టిన లగాయితు, ఇక్కడ ఒక చావు కూడ సంభవించలేదు. మా పూర్వీకులు ఎక్కడెక్కడో మరణాలు పొందారు మా తండ్రిగారు ఆసుపత్రిలో పోతే, ఆశ్వవాన్నయినా ఇంటికి తీసుకు రాకుండ అక్కణ్ణుంచిఅటే తీసుకు వెళ్ళిపో

యాము అంతటి శుభప్రదమైన ఇల్లు ఇది!

**సీత** ఎప్పుడూ నేను పూజలు, వ్రతాలూ చేస్తూనే ఉంటాను శుక్ర శని వారా లయితే మా యిల్లు గుడిలాగా కళకళ లాడుతుంది

**సత్యా** మనం ఎన్ని పూజలు, వ్రతాలు చేసినా కూడ శనిదేవత తాండవిస్తూవుంటే వాటి ఫలితం ఏం ఉండదమ్మా–

**శేష** అంటే మీరూ నమ్ముతున్నారన్నమాట!

**సత్యా** ఇంతమంది ఇన్ని రకాలుగా చెబుతూవుంటే, నమ్మకుండా ఎలా వుంటా నమ్మా కోరికోరి నా కుటుంబాన్ని తెచ్చి, ఈ యింటికి బలిచేస్తానా ఎవడైనామొండి వాడిని చూసుకోండి! (వెళ్ళబోతాడు)

**కామే** ఇదిగో సత్యనారాయణా–ఇలాంటి పుకార్లు లేవదీసిన వాడెవడో వాడి పేరు అడ్రసూ చెప్పగలవా?

**సత్యా** ఒకరా ఇద్దరా–ఒకరెవరైనా ఒక మాటంటే? తక్కినవాళ్ళు అవునవు నంటున్నారు! ఏమైనా, నిప్పులేకుండా పొగరాదు! ఇది తెలుసుకోండి అన్నట్టు మీకు ఆ రోజునా విజిటింగ్ కార్డ్ ఇచ్చాను–అది తిరిగి నాకు ఇచ్చేయగలరా–నాదగ్గర కార్డులు అయిపోయాయి!

**కామే,** ఆ కార్డు బావుందని మెచ్చుకున్నాను గదూ–

**సత్యా** అవునండి!

**కామే** అందుకని దానికి చక్కగా ఫ్రేమ్ చేయించి బెల్జియమ్ అద్దం బిగించి మేడమీద గోడకి వేల్లాడదీశాను– వెళ్ళితీసుకోండి

**సత్యా** (భయంగా) మేడమీదా!. . వద్దులెండిసార్, వస్తాను (వెళతాడు)

**కామే** విజిటింగ్ కార్డట–విజిటింగ్ కార్డు!...వీడి భయం సప్తసముద్రాల పాలు కానూ . దయ్యాలుట, ఆత్మహత్యలుట, శనిదేవతలట–హు! శేషయ్యా మొత్తం పథకం మార్చేస్తున్నాను ఈ ఇంటికి అద్దె రెండువేలు, అడ్వాన్సు సంవత్సరానిదీ ముందే ఇవ్వాలి బోర్డురాయను, పేపర్లలో వెయ్యను! రమ్మను ఎవడొస్తాడో—

**శేష** ఇప్పుడింక లాభంలేదు కాముడూ! చెయ్యిజారిపోయింది ఒకసారి ఒక మచ్చ పడిపోయిన తర్వాత, నువ్వు ఎన్ని క్రీములతో రుద్దినా ఆ మచ్చ మాసిపోదు!

**కామే:** ఐతే, అంతేనంటావా!

**సీత:** అద్దె ఇంకా తగ్గిస్తే?

**శేష:** అసలు ఈ పక్కకి ఎవడూ కన్నెత్తయినా చూడడు!

**సీత:** ఇదంతా ఇదిగో, ఈ తుప్పు పథకంవల్ల వచ్చింది బోర్డు కడతాను–మనుషుల్ని నిందర్యాలు చేస్తాను అని– అంతా నాశనం చేశారు. ఏ స్నేహితురాలికో ఓ మాట చెప్పివుంటే, ఈ పాటికి ఎవరో విశేషంగా పెద్ద, తీరాతో దిగిపోయి వుండేవారు! మీయన చేసిన నిర్వాకానికి ఏడవాలో నవ్వాలో తెలియడంలేదు!

**కామే:** ఏం? నువ్వు చేసిందిమాత్రం తక్కువా? సంప్రదాయమైన కుటుంబాన్ని

చూపమన్నావు-పిల్లలు లేకుండావుంటే మరీమంచిదన్నావు-ఎవరికీ చెప్పొద్దు అన్నావు- నేను మరిచిపోయా ననుకుంటున్నావా-

**శేష** పోనీ ఊరుకో కామేశ్వర్రావు! ఇప్పుడు మనలో మనం- నువ్వంటే నువ్వను కోడంవల్ల ఏం ప్రయోజనం ఏం భయంలేదు ఇన్నాళ్ళూ ఎలా వున్నారో, అలాగే హాయిగా వుండండి, ఏ భయమూ వుండదు

**కామే:** అంతేలే! దొంగ దొంగ అని భయపడితే, భయమే ఏ దొంగ వస్తాడో చూస్తాను పైన చుట్టూ ముళ్ళ కంచెలు కట్టించి గాజుపెంకులు దట్టించి, నాలుగు వేటకుక్కల్ని కట్టి పడేశానంటే, తిక్క కుదుర్తుంది దొంగవెధవలకి: ఆహా:... ఈ ఇంట్లో శనిదేవత కాళ్ళకి గజ్జె కట్టుకుని పక్కన హార్మోనీవాడిని కూచోపెట్టుకుని తాండవం చేస్తోందా- నిత్యం!...ఈ యింటికి చిల్లంగి పెట్టారా- చేతబడ్చేశారా. . ఆహా . ఏం మాటలు! ఏం మాటలు!! పుకారువెధవలు. . వీళ్ళకి సరైన పాఠం చెప్పనూ!

[పైన మేడమీద ఏదో దభీమని చప్పుడవుతుంది]

**కామే** ఏమిటయ్యా శేషయ్యా?

**శేష** ఏం వుండదులేవయ్యా- గాలికి తలుపుకొట్టుకుని వుంటుంది తలుపులు అవీ మూసేసి, గడియలు వెయ్యరుగామీరు:... నే చూసి వస్తానుండండి (వీధివేష వెళ్ళాడు)

**సీత** ఏమండీ- నిజంగా నా కేదో లోలోపల భయంగానే వుందండి...

**కామే** దేనికి: పైన దొంగపడి వుంటాడనా-

**సీత.** కాదు: ఈ ఇంటికి ఏదైనా పీడ చుట్టుకొని వుందేమోనని:

**కామే.** ఓసి, నీ నట్టిల్లు పీడతో అలకా- నీకూ వచ్చిందీ?

**సీత** అవునండి ఏమిటో, ఇంతమందీ అంటూవుంటే, మొన్నట్నుంచి నాకూ లోలోపల సందేహం పట్టి పీడిస్తోంది... దాని ప్రభావం వల్లనేకాబోలు, మనం అను కున్నదంతా తారు మారయింది:

**కామే.** అలా అంటావా- అందుకనే నేమోనే- ఈ మధ్య నా కన్నీ వెధవ కల లొస్తున్నాయి:

**సీత** ఏం కలలవి? నాతో చెప్పారుకరు!

**కామే** ఆ, ఎందుకోలే చెప్పడం అని వూరుకొన్నాను-

**శేష** (వస్తూ) మరేంలేదురా కాముడూ! నే చెప్పలా- తలుపు కొట్టుకొని వుంటుం దని గడియవేసేసి వచ్చేశాను

**కామే** శేషయ్యా- మా ఆవిడకో అనుమానం వచ్చిందయ్యా నిజంగా ఈ యింట్లో ఏదో పీడ వుందనీ-

**శేష** ఛా ఛా- అవేం మాటలు, ఇదిగో వులి అంటే అవిగోతోక అన్నట్టు!

**సీత** మా ఆయనకి పీడకలలు వస్తునాయట శేషయ్యగారూ- చావు కబురు చల్లగా

చెప్తున్నారు!

**శేష,** ఏమిటయ్యా అవి? ఎలాంటివి?

**కామే,** మా పిల్లలు రోజూ కలల్లో కనిపిస్తున్నారు. ఒకడు నీట్లో కొట్టుకుపోతున్నట్టు, ఒకడు మంటల్లో పడిపోతున్నట్టూ- నే చెప్పలేననుకో!

**సీత:** నేను మీకు చెప్తూవుంటే కొట్టి పారేశారు! ప్రతిరాత్రి మీరు నిద్రలో అరవ డమే లేపితే లేవరు ఇహ శేషయ్యగార్లూ, పిడుగులు పడ్డట్టు గురకలు ..ఉరుములు ఉరిమినట్టు కలవరింతలూ!

**కామే** ఏమిటో మరి, ఇదంతా చూస్తూవుంటే అనుమానంగానేవుంది! ఈ పిల్ల వెధవలు మమ్మల్ని వదిలేసి, దూరంగా ఉద్యోగానికి వెళ్ళిపోవడం, క్షేమ సమాచారా లతో ఉత్తరాలు రాయకపోడం, రాసినా అవి సకాలానికి చేరకపోవడం .

**సీత** లింగు లింగుమని రెక్కలు తెగిన పిట్టల్లాగా, మేమిద్దరం ఈ గూడు వదలక పోవడం . ఇదంతా దుష్టశక్తుల ప్రభావమేనేమో!

**శేష** కావచ్చులే ఏదో దోషం వుండే వుంటుంది ఆ మధ్య నీకు ఆపరేషన్ జరగడం, ఈ మధ్య సీతమ్మ ఆరోగ్యం బాగులేక, బల్లిలా మంచం పట్టడం- ఇవి కూడా మరి, దుష్ఫలితాలే! ..

**కామే** అసలు, కొంతకాలంగా చూస్తున్నాను అనుకున్నదేదీ జరగడం లేదయ్యా తిరుపతి కొండెక్కి, తలనీలాలు సమర్పించుకొందామని- రెండేళ్ళాయి అనుకొంటు న్నాను- ఎప్పటికప్పుడు ఏదో ఒక అవాంతరం! ఆ మధ్య నాకు రావలసిన పెన్షను డబ్బులో పేచీలు ఉండిఉండి ఈ దొంగభయాలు చివరికి, ఈ ఇల్లు అద్దెకు పోకపోవడం, అందరూ తలోమాటా చెప్పడం! వూఁ — ఏదీలేకపోతే, ఇవన్నీ ఎందుకిలా అపసవ్యంగా జరుగుతున్నాయి?

**శేష.** ఆలోచించవలసిందే!

[ముగ్గురూ కొన్ని క్షణాలు, మౌనంగా ఆలోచనలో పడ్డారు]

**కామే** శేషయ్యా- నా కొకటి అనిపిస్తోందయ్యా కొంతకాలం పాటు ఈ ఇల్లు వదిలేసి, ఇంకెక్కడేనా వుంటే-

[ఇద్దరూ అగమ్యంగా చూస్తారు]

ఓ ఆరునెలలు చూస్తాం అక్కడ అన్నీ సవ్యంగానే వుందనుకో- ఇంట్లో దోషం వున్నట్టేం లేదూ- అక్కడా ఇలాగే వుందనుకో- తిరిగి ఇంటి కొచ్చేస్తాం

**సీత:** ఆలోచన బాగానేవుంది గానీండి- ఇప్పటికివుండి మనకి ఇల్లెక్కడ దొరుకు తుందండీ?

**కామే:** శేషయ్య చూస్తాడు, మనమూ వెతుకుతాం- అందరితోనూ చెప్తాం

**శేష,** అలా అందరితోనూ చెప్పావంటే ఇప్పుడున్న పుకారు ఖాయం అయి పోతుంది! ఇంట్లో భూత ప్రేత పిశాచాలు వున్నాయి గనకనే ఇల్లు ఖాళీచేసి, ఓనర్లే వెళ్ళిపోయారంటారు ఎందుకూ- మీ ఇద్దరికీ చిన్న వంటగది, ఓగదీవున్న ఇల్లుచాలు-

నే చూస్తాను

**కామే:** తర్వాత ఇంకోటుంచయ్యా- కుటుంబాల వాళ్ళని మన యింటికి అద్దెకి రమ్మంటే, ఇలాంటి ఆక్షేపణలు చెప్తారుగాని- ఏ గవర్నమెంటు ఆఫీసుకో, బ్యాంకుకో మొత్తంగా ఇచ్చేస్తాం అంటే వాళ్ళకి అద్దుకుని మరీ తీసుకుంటారు అందులోని నాలుగోవంతు డబ్బుతో మనకోచిన్న పోర్షన్ దొరికినా చాలు!

**నీల** పోనీండి-ఇల్లు దొరకలేదే అనుకోండి-పెద్దబ్బాయి దగ్గరకి అహ్మదాబాదు వెళ్ళిపోదాం వాడు ఎప్పట్నుంచో, ఇల్లు అద్దెకిచ్చేసి అక్కడికి వచ్చేయమంటున్నాడు.

**కామే** ఇది బాగానే వుంది!

శేషయ్యా-రేపు సాయంకాలంనుంచి ఇద్దరం కలిసి తిరుగుదామయ్యా వారం పది రోజులు చూదాం లేకపోతే, మా వాడిదగ్గరకి అహ్మదాబాదు వెళ్ళిపోదాం

[బయటినుంచి "సార్" అని కేక వినిపిస్తుంది]

**కామే** ఎవరది?

బయటిగొంతు ఈ పైన మేడ ఖాళీగా వుంది-అద్దెకిస్తారని తెలిసింది ..ఆ విషయం మాట్లాడదామని-

**కామే** లేదు! ఖాళీలేదు . ఐపోయింది! వెళ్ళిరండి.

గొంతు అలాగాండి-వెళ్ళొస్తాను

**కామే** ఇలా వుంటాయి జాతకాలు మనం ఏదో నిర్ణయానికి వచ్చాము ఇప్పుడెవడో వచ్చాడు ఇల్లు కావాలని!

**శేష** అదేమరి, ఈ ఇంటి ప్రభావం!

[వీధిలో ఏదో అలజడి కేకలూ వినిపిస్తాయి]

**కామే** ఏమిటది? ఏమిటాగోల?

[దొంగ దొంగ పట్టుకోండి. పట్టుకోండి అని కేకలు వినిపిస్తాయి ఆ కేకలు అలా ఉధృతం అవుతూ ఉంటాయి ముగ్గురూ భయంగా-విగ్రహాల్లా అలా నిలబడి అటే చూస్తూ తర్వాత, త్వర త్వరగా సామాన్లు సర్దుతూ వుండగా]

—తెర—

# మొహమాటం మాటున కథకుడు

**కాసల నాగభూషణం**

## 'గురూగారూ!గుడీవెనింగ్'

ఆ మాటని వింటూనే గుర్తుపట్టేను అది గురుమూర్తి గొంతని. పుస్తకం పుస్తకంలోంచి తల పైకెత్తి చూసేను. అప్పటికే బాగా దగ్గరికొచ్చేసేడు గురుమూర్తి.

నేను పుస్తకం మూసి ఈజీ చెయిర్లోనే వెనక్కి వాలుతూ పక్కనే వున్న కుర్చీని చూపించేను అతనికి.

"ఏమిటో చదువుతున్నారు?" కూచుంటూ అడిగేడు గురుమూర్తి.

"మామూలేగా" అన్నాను నేనూ అతిమామూలుగానే,

అంతలో లోపల్నుంచి అడిగింది అపర్ణ-శ్రీమతి-"ఏమండీ కాఫీ తేనా?" అని.

"తీసుకురా! గురుమూర్తి కూడా వచ్చేడు" అన్నానేను కిటికీ కర్టెన్ తొలగించి లోపలికి చూస్తూ

సాయంకాలపు ఎండ వరండాకి కుడి వేపున్న మెత్తగా తాకుతోంది పూలమొక్కల్ని. వూరికి చివర కాస్తంత ఎత్తయిన చోట వుండడం వల్ల ఇంటికి హాయిగా తగులుతూ వీస్తోంది గాలి. అల్లాంటి సమయాల్లో వాలుకుర్చీ వేసుకుని పుస్తకాలు చదువుకుంటూ ఈ గురుమూర్తిలాంటి మిత్రులతో సాహిత్య చర్చ చేసేపాటి అవకాశం కలగడం-నిజంగా నా అదృష్టం!

ఇక గురుమూర్తిని గురించి చెప్పవలసొస్తే...

అతనే ప్రథమ పాఠకుడు నా ప్రతి రచనకీ. రఫ్‌గా రాస్తోండగానో ఫేర్ కాపీ చేస్తోండగానే వచ్చేవాడు గురుమూర్తి మా ఇంటికి, స్నేహపూర్వకంగానే నన్ను తొందర చేసి, నాచేత ఆ రచనని తొందరగా పూర్తి చేయించి, ఓపిగ్గా అక్కడే కూచుని చదివి తనఅభిప్రాయం చెప్పి మరీ వెళ్ళేవాడు. రాసినవాడి పుట్టుపూర్వోత్తరాలు పూర్తిగా ఎరిగుండీ, వాడి ఎదురుగానే కూచుని చదవడం సంభవిస్తే ఓ రచనని దానిమీద నిష్పక్షపాతమైన అభిప్రాయానికి రాలేడు పాఠకుడు-అనుకునేవాణ్ణినేను. అయినా ఆ అనుమానం లోపల నలుపుకున్నా అతని ఉత్సాహం చూసి ఇచ్చేవాణ్ణి స్క్రిప్టుని గురుమూర్తికి.

రసజ్ఞుడైన పాఠకుడే నిజమైన బంధువు రచయితకి.

అలా అంటూనే అయిపోయాడు నాకు గురుమూర్తి. [illegible] "[illegible]" [illegible] అన్నా.

ఆమె వచ్చింది ట్రేలో కాఫీలూ వక్కపొడి వుంచుకుని.

గురుమూర్తే ఓ కాఫీకప్పు ఇచ్చేడు నాకు తనూ ఒకటి తీసుకున్నాడు.

కాఫీలయ్యేక కప్పులు తీసికెళ్ళింది అపర్ణ.

చేతిలోకి వక్కపొడి తీసుకుంటూ అడిగేడు గురుమూర్తి

"ఇవాళ మీకో షాకింగ్ న్యూస్ చెప్పనా?" చూసేను ఏమిటన్నట్టు

"నేనూ ఓ కథ రాసేను" చెప్పేడు తాపీగా.

అతనన్నట్టు నామట్టుకు అది షాకింగ్ న్యూస్ కాదు.

ఆంధ్రదేశంలో చదువుకున్న ప్రతి నలుగుర్లోనూ ఓ రచయిత వున్నాట్ట. ఆ నలుగుర్లోనూ మా గురుమూర్తి ఒకడు కావడం నాకు మరీ ఆశ్చర్యం కాదు.

ఎందుకంటే పూర్వాశ్రమంలో ఎప్పుడూ అట్లాంటి అభిరుచి వున్న వ్యక్తిలా కనిపించలేదు నాకు గురుమూర్తి

'ఏదీ తెచ్చేవా?' అడిగేను సరిగా కూచుంటూ.

"నాకేదోలావుంది మీకు చూపాలంటే" జేబులోంచి మడచి వుంచిన ఓ సగం తావు కాగితాన్ని తీసి చేతబట్టుకుని అన్నాడు గురుమూర్తి.

"మొహమాటం, సిగ్గుపడితే పైకి రాపడం కుదర దబ్బాయ్" అంటూ అందుకున్నాన్నేను ఆకాగితాన్ని. మడత విప్పేను.

నిజం చెప్పాలి-కథ రాసే నన్నాడు గురుమూర్తి. ఆ సగం తావులోనూ సగానికి సగం ఖాళీ. తక్కిన సగమే "కథ" మొత్తం ఒకే ఒక్క పేరా!

ఇది మినీ కథల కాలం అయినా గురుమూర్తి చూపిన ఆ మాన్యుస్క్రిప్టుని కథ అని నేననలేను.

కానయితే అపను రాసిం దానిలో ఓ కథకి కావలసిన బలమైన ముగింపు వుంది. కాస్త పకడ్బందీగా ఆముగింపుతో సరితూగే బాడీని గనక డెవలప్ చేస్తే అదీ ఓ గొప్పకథే అవుతుంది.

అదే అన్నాను గురుమూర్తితో "ఈ మాత్రం చాలదు గురుమూర్తి! కథకి ఇంకా పెంచాలి దీన్ని"

గురుమూర్తి తెల్లమొహం వేసేడు.

"ఎల్లా పెంచాలో నాకేం తోచడం లేదు గురూగారూ!

ఏదో ఆలోచిస్తోండగా తక్కున ఈ అయిడియా వచ్చింది. రాయాలని కూచుంటే అది ఇల్లా తయారయింది. ఇక దీన్నేం చేసినా అది మీ ఇష్టం" అంటూ ఆ బాధ్యతని నాకే అప్పగించేడు చాల తేలిగ్గా.

నేను కాసేపు ఆలోచించేను గురుమూర్తి చూపిన ఆ పాయింట్ని ఆధారంగా ఓ అందమైన కథని అల్లగలమా? అని, అల్లగలననే అనిపించింది.

"సరే రేపటి కాస్తావుగా-అప్పుడు చూద్దువుగాని నీ కథని" అన్నా నతనితో.

కుర్చీలోంచి లేచి నవ్వుతూ వెళ్ళొస్తానని సెలవు తీసుకున్నాడు గురుమూర్తి.

అనడం వరకయితే అన్నాను గాని ఆ రాత్రి భోజనాలయ్యేక నా గదిలో కాగితాలు ముందేసుకుని కూచున్నప్పుడే తెలిసింది-ఇతర్ల అనుభవాన్ని ఇతర్లకి నచ్చేలాగే రాయడంలో వున్న ఇబ్బంది.

సరిగా గురుమూర్తి కాగితం మీద చూపించిన సంఘటనని ఆ ముగింపుని, రక్తమాంసాలు చేర్చి, జీవం పోసే సరి రాత్రి రెండు గంటలయింది

ఆ మర్నాడు యథా ప్రకారంగా, తన కథ రూపురేఖల్ని తనివి తీరా చూసుకోవాలనే వుత్సాహంతో మరింత తొందరగా వచ్చేడు గురుమూర్తి మా ఇంటికి

నేనా కథని చూపించే నతనికి,

అందుకుంటూ "అయ్యో! ఫేర్‌కూడా మీరే చేసేరా? చాల ఇబ్బంది కలిగించేను మీకు" నొచ్చుకునే ధోరణిలోనే అన్నాడు గురుమూర్తి.

సగం పుటలో తను చూపించిన కథ పన్నెండు పేజీలకి ఎల్లా పెరిగిందో అర్థం కాలేదు గురుమూర్తికి.

"చాలా పెంచేరే గురూగారూ!" అన్నాడు పేజీలు మళ్ళీ తిరగేస్తూ.

"చదివి చూడు బావుందేమో" అని అతనికి ఏకాంతాన్ని కలిగిస్తూ నేను లోపలి కెళ్ళి పోయేను

కాఫీల తయారీకి శ్రీమతిని రిక్వెస్ట్ చేసుకుని, కవరూ స్టాంపులూ తీసుకుని వెళ్ళేను మళ్ళీ ఆతని దగ్గరికి

"ఇంతగా ఈ కథ డెవలప్ అవుతుందని నే నూహించలేదండి గురూగారూ! చాల బావుంది" అన్నాడు గురుమూర్తి

"అయినా నా పేరు మీదే రాసేరే కథని? మీపేరు గదండీ వుండాలి" అనీ అన్నాడు అంటూనే కవర్లో ఆ కాగితాల్ని మడిచి వుంచి, స్టాంపుల్ని అంటించేడు

"ఏ పత్రిక్కి పంపితే బావుంటుందో ఆ అడ్రస్ ని కూడా మీ చేత్తో డి



రాయండి" అంటూ నా ముందుంచేను.
నేను కవర్‌మీద అడ్రస్‌ని రాసేను. నాకు కష్టం కలిగించడం ఎందుకని కాబోలు పోస్ట్ చెయ్యడం మాత్రం గురుమూర్తి చేసేడు.

ఆ తర్వాత మరో కథ ఇల్లాగే గురుమూర్తి అరగొరగా రాసి చూపెడితే "రాసిపెట్టండి గురూగారూ!" అని అడిగితే ఆ మొహమాటం నుంచి తప్పించుకోలేక 'అల్లాగే' అన్నాను. అన్నంతపనీ చేసి ఇచ్చేను. ఆ రెండో కథని ఫేర్ చేస్తోండగా మా శ్రీమతికి పట్టుబడి పోయేను.

"ఎంత మొహమాటమైనా రాసింది మీరైతే మధ్యన ఆయన పేరెందుకండీ పెట్టడం" అంది అపర్ణ.

"పోనీ అపర్ణా! ఇలానూ రాయడం అలవాటయితే మనకే మంచిది ఏసబ్జెక్టునయినా తీసుకుని తేలిగ్గా కథరాసి పడేసే టాలెంట్ వస్తుంది" అన్నాన్నేను ఓ దావ్పుగా

ఆపైన ఐదారు వారాలకి అనుకుంటూ టౌన్‌లో జిల్లా స్థాయి రచయితల సంఘం ఏర్పాట్లకోసం కొందరు రచయిత మిత్రులతో కలసి తిరుగుతున్నాన్నేను హడావిడిగా. అప్పుడు నాతో అపర్ణకూడా వచ్చింది. గురుమూర్తి వచ్చేడు.

అన్ని పనులూ పూర్తయింతర్వాత అందరం కలసి ఏదో హోటల్ కెళ్ళేం. మేం మాటల్లో వుండగా అప్పుడే అటు వెళ్ళి కొత్తగా బజార్లోకి దిగిన పత్రికనొకటి ద్దొన్ని కొని చేతబట్టుకుని వచ్చేడు గురుమూర్తి.

పక్కన కూడుని షేజీలు తిప్పుతున్న వాడల్లా రక్కున "నా కథ అచ్చయిందండోయ్!" అన్నాడు.

అతనా మాట అనడం తోటే సాభిప్రాయంగా చూసింది అపర్ణ నావైపు.

గురుమూర్తి పత్రికని ఆ పేజీ దగ్గర మడతపెట్టి అందరికీ చూపించేడు ఆకథని.

కథకి ఆర్టిస్టు గీసిన బొమ్మ అద్భుతంగా వుంది.

నేను మెరక కని పారేసిన శకుంతలని అపురూపంగా కళ్ళలో వుంచి పెంచుతున్న కణ్వుడు చూసినట్టు చూసేను ఆ కథని.

అప్పుడు మా అందరికీ గురుమూర్తే ఆర్డరిచ్చేడు టిఫిన్‌కి. అతనే బిల్లు చెల్లించేడు. కాలేజీ రోజుల్లో నా మొదటి కథ అచ్చయినప్పుడు పోరి పోరి ఫ్రెండ్సంతా నా చేతే బిల్లు పే చేయించిన సంఘటన జ్ఞాపకాని కొచ్చింది. ఆ టిఫిన్ చేస్తున్నంత సేపూ గురుమూర్తి చెప్పిన "నా కథ" అన్నమాటే నాలో సుళ్ళు తిరిగింది.

అయితే ఒక్కటిమాత్రం చెప్పగలను కృతజ్ఞతని సూచించేమాట-ఒక్కటంటే ఒక్కటి-అనలేదే మనతో అనే ఆ ఒక్క భావం తప్ప మరెల్లాంటి భావము కలగలేదు. నాకు గురుమూర్తిమీద అతనిపట్ల ముందున్న అభిమానము తగ్గలేదు.

ఇది జరిగిన ఓ పది రోజులకంటా మైపు చేసిన వుత్తరం ఒకటి పట్టుకొచ్చేడు గురుమూర్తి. నే (?) రాసిన ఆ రెండో కథనీ వేసుకుంటున్నామని పత్రిక వాళ్ళు పంపిన ఇంటిమేషన్ అది. వుప్పొంగి పోతూ చూపించేడూ గురుమూర్తి.

ఆ రోజున మేం బాగున్న కాఫీ కప్పు

పట్టుకెళుతూ నన్నుచూసి కన్నుమెదిపి మరీ వెళ్ళింది అపర్ణ అంటే గురుమూర్తి కథవిషయం కదిపితే మొహమాటం కోసం అనవసరంగా రాసేపని పైన వేసుకో వద్దని ఆమె సూచన!

గురుమూర్తి కాఫీతాగి అక్కడే నే చదువుతూ పడేసిన పుస్తకాన్ని పట్టుకుని అటూ ఇటూ తిప్పుతూ ఏదో చెప్పడానికి తటపటాయిస్తున్న వాడల్లె కనిపించేడు. ఏదో ఓ కథకోసం ప్లాట్ పట్టుకొచ్చి వుంటాడనే అనుకున్నానేను అతని వాలకం చూసి

నిజంగా అదే అన్నాడు గురుమూర్తి "గురుగారూ! బ్రహ్మాండమైన ప్లాటొకటి తట్టించండి నేనే దాన్ని రాసేనుగాని అది అంత బాగా రావడం లేదండీ!"

అంటూ నామొహంలోకి చూసేడు

చూసి క్షణం ఆగేడు.

"ప్లాట్ నీది కన్‌స్ట్రక్షన్ నాదయితే మనిద్దరి పేర్లూ పెడదాం ఆ బిల్డింగుకి" అన్నాన్నేను జోక్‌లాగానే

"దానికేం భాగ్యం! అల్లాగే కానివ్వండి" అన్నాడు.

నే నా కథని రాసేప కథకి మా ఇద్దరి పేర్లూ తగిలించేను

మరికొన్ని రోజులకి ముందు వెనకగా మొదటి రెండు కథలకీ మరియాద్ధ ల్లాచ్చే యి గురుమూర్తికి టిప్టాప్‌గా డ్రెస్ ఒకటి కుట్టించేసేడు గురుమూర్తి ఆ డబ్బులతో ప్యాంటుకొకటి, చొక్కా కొకటి ఆ కథల ఛాయాను పేర్లే పెట్టి నవ్వుకోడం సాగించేసు మిత్రులతో.

దాంతర్వాత ఈమధ్యే అంటే మా ఇద్దరి పేర్ల మీదుగా ఆ మూడో కథని రాసిన ఓ నెంబర్లకల్లా అది అచ్చు కావడం, దాని తాలూకు రెమ్యూనరేషన్ రావడం జరిగేయి వుమ్మడి ప్రతిఫలం కాబట్టి వూళ్ళో వున్న మిత్రులు నలుగురైదు గురికీ ప్రైడ్‌గా పార్టీ ఇవ్వడంతో దాన్ని సద్వినియోగం చేద్దాం అని తీర్మానించాడు గురుమూర్తి నేను మౌనంగా తల వూపేను

చిత్రం ఆ తర్వాత జరిగిందేమిటంటే ఒక్కటంటే ఒక కథనీ "ఇదండీ గురూగారూ! రాద్దామా?" అంటూ రాలేదు నా దగ్గరికి గురుమూర్తి ఏవో తనే రాసే వాడు పత్రికలకి పంపుకునేవాడు. ఆ సంగతి నాకూ తెలుస్తూనే వుంది. మా స్నేహం మామూలుగా సాగుతూనే వుంది అయితే చింతించ వలసిన విషయం అప్పై అతను పంపిన ఏ కథా అచ్చు కాకపోవడం!

"థీమ్‌లో ఏముందండీ! ఏదైనా రాసేయొచ్చు దాన్ని కథలా 'ఫామ్' చెయ్యడం లోనే వుంది అసలు ప్రతిభంతా" అంది అపర్ణ తర్వాతెప్పుడో.

ఏది ఏమయినా ఫేర్ చేసి పత్రిక్కి పంపేముందు అతనికి చూపకుండా నే పంపిన మొదటి కథ ఇదే, ఏకారణంచేత నేని కథను అతనికి చూపకుండా పంపేనో మీకిక వేరే చెప్పక్కర్లేదు.

ఇక పోతే ఈ కథని చదివి తనే ఇంపలో వస్తువయ్యేడని తెలుసుకున్న వెనక మొట్టమొదటిగా నా ఎదుటబడ్డ ప్పుడు మా గురుమూర్తి మొహం ఎల్లా వుంటుందో చూద్దామనే కుతూహలం వుండనే వుంది నాలో తీరా ఆ పరిస్థితే ఎదురయితే అప్పుడతన్ని ఎల్లా పలకరించాలా అనే సందిగ్ధంగా వుంది ●

" సెలయేటి నడకలాగ అడుగులు వేస్తూ ఆమె
వెనక్కి తిరిగింది యవ్వనం మన్మథ బాణం లాగ
ఆమె భుజం నుండి చేతుల మీదుగా గీసిన రేఖ
నడుం వద్ద జాగా వంగి అంతలోనే పొరపాటు సర్దు
కున్నట్టుగా రేగి వట్రురేఖ అయి సాఫీగా ప్రయాణించింది
మోకాళ్ళు దాటి కిందకు పాకింది

మన్మథ బాణం ఒకే ఒక్క క్షణం మెరుపు మెరిసినట్టుంది.

ఎవరామె?

పేరేమిటి?

భర్త ఏం చేస్తాడు?

ఆమె ఇంట్లోకి తిరిగి వెళ్ళేవరకూ అలాగే చూసి
ఆవలికి వెళ్ళాడు 'ధనంజయ' "

# వచ్చే నెల నవలానుబంధం



ఎం.వి.వి. సత్యనారాయణ

# పడమటింటి శ్రీమతి